


పుటి 1. | సంపాదకుడు : తిరుమల రామచంద్ర | సంయుక్తసంపాదకుడు : తిమ్మావజ్ఝల కోదండరామయ్య | సంచిక

# మనవి మాటలు

స్వరాష్ట్రం సాధించుకొని ఏడాది తిరుగకముందే మరొక విశ్వవిద్యాలయం నెలకొల్పుకొన్న ఆంధ్రావళి అభినందనీయం. కృష్ణరాయల వసంతకాల విద్యా వినోదాలు వెలసిన తిరుమల-తిరుపతి ఈ విశ్వవిద్యాలయానికి నెలవుకావడం మెచ్చదగిన మరొక ముచ్చట.

నాటి గురుకులం మహామహోపాధ్యాయ కపిస్థలం దేశికాచార్యులు, నరకంఠీరవశాస్త్రులు, నేలం సుబ్బారావు, గిరిధరాచార్యులు మున్నగు పండిత వతంసుల పాత్రప్రవచనాలు ప్రోదిగా శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలగా రూపొంది, పరిశోధనాలయమై, నేడు విశ్వవిద్యాలయంగా పరిణమించడం పాత విద్యార్థులందరికీ గర్వకారణం.

విద్యారంగంలో జీవితంపండి వివేకంనిండిన డాక్టర్ గోవిందరాజులునాయుడు గారి ఆధిపత్యంలో ఈ విశ్వవిద్యాలయం ప్రాచ్యవిద్యల పరిశోధనలో, లలిత కళల లాలనలో తానే తనకు సాటిగా, విలక్షణరతో వెలుగొందగలదని ఆశించడం అడియాస కానేరదు. వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యుల ప్రప్రథమ శిష్యులు శ్రీ చింతలపల్లి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రధాన ప్రాణాచార్యులుగా పూచి, పండి, ఏకారణాననో మోడుపోయిన ఆయుర్వేదశాఖకూడ ఈ విశ్వవిద్యాలయంలో తిరిగి చిగిర్చుతుం దనడం కూడ అసంభావ్యంకాదు.

# తుర్తప్ప త్రవ్వించిన కాల్వ

శ్రీమతి బాణగిరి రాజమ్మగారు

—: 0: —

బుక్కరాయలు విద్యానగర రత్నసింహాసనం అధిష్ఠించి రాజ్యమేలుతున్న కాలమది. ఒకానొక వసంతఋతువులో వెన్నెల రాత్రి రాయలకు నగరసౌందర్యం చూడాలని బుద్ధి పుట్టింది. ఆయన సపరివారంగా బయలుదేరి, నగరమధ్యంలో - హారానికి పతకంవలె వున్న మతంగపర్వతంఎక్కి నగరసౌందర్యం చూచి ఆనందిస్తున్నాడు.

ఇంతలో దూరంలో ఏవో కేకలు, బండ్ల చప్పుడూ వినిపించాయి. వెంటవున్న అంగరక్షకుడైన బోయసరదారు తుర్తప్పవైపు చూచాడు రాయలు; సంగతి కనుక్కొని వెంటనే తెలుపు అన్నట్టు. తుర్తప్ప అంగకు అరవై మెట్లుగా గబగబ కొండదిగివెళ్ళి, అరగడియలో తిరిగివచ్చి సమాచారం మనవి చేసినాడు. మరేమీ లేదు - రాజధానికంతా మంచినీటి వనరు తుంగభద్ర ఒక్కటే. దూరాన వులవేవారు బళ్ళుకట్టుకుని ఏటికివచ్చి పెద్దహండాలలో, గంగాళాలలో నీళ్ళుతోలుకుని పోతున్నారు.

విషయం సర్వసాధారణమైందే, దినం జరుగుతూవుండేదే కాని, రాయలుమాత్రం విని తెల్లబోయాడు. "ఎడతెగకపారే తుంగభద్ర ఒడ్డునవున్న తన ప్రజలకు ఈ నీటికరువేమిటి?" ఆయన ముఖం చింతతో ముడుతలుపడింది. ఇంతలో ఏదో తట్టింది మెరపువలె. ఆయన ముఖం కొంచెం తేటపడింది. 'నగరుకు ఆగ్నేయంగా ఆమడదూరంలో...' అంటూ మంత్రి వైపు చూచాడు. మంత్రి చిటికలో గ్రహించాడు. "కొంత బయలు, ఒక వైపు మెట్ట, కొండవాగుల నీరుకూడా చేరుతుంది. చెరువు త్రవ్వడానికి అనువైనప్రాంతం" అని కంఠపాఠంచేసినది ఒప్పించినట్టుగా ఒప్పించాడు మంత్రి. రాయలు ఆగమన్నట్టుగా చేయి చూపుతూ, తుర్తప్పవైపు తిరిగాడు; చెరువు త్రవ్వించే బాధ్యతంతా నీది అన్నట్టు "ఎండలోకే దేవరా?" అన్నాడు తుర్తప్ప.

వేలాది బోయవీరులకుటుంబాలు ఆ నెలలలో చెరువు సిద్ధమైంది; పేరు బుక్కసాగరం - బుక్కరాయలుగదా త్రవ్వించినవాడు! కాని, ఈ చెరువువల్ల రాయలు అనుకున్నంత ఫలం కలుగలేదు. నగరమధ్యలోని వారికినీటిఇబ్బందిమామూలే. "తుంగభద్రనుంచి కాలువత్రవ్విస్తే..." రాయలు ఈ ఊహతో ఉప్పొంగిపోయాడు. "కాని త్రవ్వించడం ఎక్కడినుంచి? ఎక్కడ తుంగభద్రకు ఆనకట్ట కట్టాలి? నగరంలో అన్నిప్రాంతాలకూ నీళ్లు లభించేట్టు త్రవ్వాలి! త్రవ్వించేబాధ్యత వాస్తు శాస్త్రం తెలిసిన వానికి అప్పగించాలి." ఇలాటి ఆలోచనలతోనే ఆయనకు కునుకు పట్టింది.

ఆ కునుకులోనే రాయలకొక కలవచ్చింది; తన వాంఛితం తీర్చే బంగారుకల. ఒక దేవతామూర్తి ప్రత్యక్షమయ్యాడు. రాయలు వెంటనే లేచి సాష్టాంగ దండప్రణామం ఆచరించి మహానుభావా ఎవరుమీరు? ఏమిటి ఆజ్ఞ అని ప్రశ్నించాడు. "నేను ఆదిశేషుణ్ని. నీవదో కాలువ త్రవ్వించ దలచుకున్నావు గదా! దానికి సహాయం చేద్దామని వచ్చాను" అన్నాడు ఆదిశేషుడు. "చిత్తం" అన్నాడు రాయలు. "ఇదిగో! నామాట విను. నీవు ఎక్కడినుంచి కాలువ త్రవ్వదలచావో అక్కడికివెళ్ళి, నన్ను తలచుకుని నమస్కారంచేసి వెనక్కు తిరిగిచూడకుండా నీ ఇష్టంవచ్చినట్టు పరుగెత్తు. నీ వెనుక పెద్దకాలువ పడుతూ వస్తుంది. తిరిగిచూస్తే పని జరుగదు. కాలువ ఆగిపోతుంది. నీ ఇష్టం! ఎన్నివంపులు తిరిగినా సరే, వెనక్కుమాత్రం చూడకూడదు. ఇదే నావరము," అని అంతర్ధానమయినాడు.

రాయలు కళ్లునులుపుకుని లేచినాడు. కల! అయినా కలకావలసిన అవసరంలేదు. తెల్లవారగానే, కాల్య కృత్యాలు ముగించి, స్వప్నవృత్తాంతం అందరికీ తెలియచేశాడు. కాలువ హేమకూటానికి పరువు ఎగువనుంచి ప్రారంభం కావాలని వాస్తుశాస్త్రజ్ఞులు నిర్ణయించారు. రాయలు ఆ ప్రాంతానికి వెళ్లి వెను తిరిగిచూడకుండ పరుగెత్తసాగాడు. వెనుక

సాహిత్యమీమాంస :

# పోతన కవిత్వపటుత్వం

శ్రీ తాపీ ధర్మారావుగారు



ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకన్నట్లే పోతన్నది సహజ పాండిత్యమనీ, అతను రామభక్తి పరాయణుడనీ, సహృదయులు తమ అభిప్రాయాన్ని "గుళికారూపంగా" ప్రకటించారు. దానితో ఇటీవలి పాఠకలోకానికి బమ్మెరపోతరాజూ, రొడ్ల రామదాసూ, ఒక్క తరగతి రచయితలుగా కనబడ నారంభించారు.

సహజ పాండిత్యం కాబట్టి, పోతన్న ఆంధ్ర శబ్ద చింతామణిగాని, కనీసం చిన్నయసూరి వ్యాకరణంగాని, నేర్చుకోనే ఉండడు. కాబట్టి అతని కవిత్వంలో వ్యాకరణ దోషాలూ, తప్పుడు సంధులూ కనబడతాయి; రసాల పరిజ్ఞానం అసలేలేదు; అందుచేతనే అప్పకవిలాంటి లాక్షణికులు పోతరాజును ప్రామాణిక కవిగా అంగీకరించలేదు.

మరే మెరుగు లేకపోయినా రచనలో శబ్దాడంబరమయినా ఉంచాలని పోతన్న అంత్యానుప్రాసకోసం ప్రాకులాడి నిఘంటువులన్నీ గాలించాడని కొందరనుకున్నారు.

ఇక పోతన రామభక్తుడన్నారు సహృదయులు. కాబట్టి అతని కవిత్వం (?) భక్తిప్రేరితమూ, భక్తిపూరితమూ; భక్తి ఆవేశం వల్ల ఒళ్లుమరచి ఏదో అన్నాడు, ఏదో వ్రాశాడు; ఆ భక్తి సంబంధమైన గొడవ మినహాయిస్తే, ఇంక పోతనలో కవిత్వమేమి కనబడుతుంది అన్నారు మరికొందరు విద్యాధికులూ విమర్శక ప్రముఖులూను.

అయ్యో! పోతనామాత్యా! నీవు "దుర్గ, మాయమ్మ, కృపాబ్ధి, యీవుత కవిత్వ పటుత్వ మహత్వ సంపదల్" అని అర్థించినదంతా వ్యర్థమేనా? "కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ" ఏడుస్తున్నట్టు కనిపించిన సరస్వతీ దృశ్యమంతా నిఘంటువుల నిహారమేనా? ఇమ్మనుజేశ్వరాధముల కివ్వనని చెప్పుతూ "సత్కవుల్ హాలికులైననేమి? గహనాంతర సీమల కందమూల కౌద్దాలికులైననేమి?" అని సత్కవిగా, సగర్వంగా, చెప్పినదంతా వట్టి బాకా ఊదుడేనా?

అభిప్రాయ గుళికలవల్ల కలిగిన అనర్థమిది. ఆనాటి సహృదయులు ఆ కవులలోని గుణాలన్నీ చూచినవారే; అందులో మరీ స్ఫుటంగా ఉన్న ఏ గుణాన్నో ఒకదానిని గుళికారూపంలో ప్రకటిస్తారు; తక్కిన కవితా విశేషాలు లేవని వారెప్పుడూ అనలేదు; అయినా, ఆ గుళికా ప్రభావం విపరీతంగా పరిణమించింది; వారు పేర్కొన్న గుణమొక్కటే ఆ కవిలో ఉన్నట్టూ, తక్కిన గుణాలు-ఏవీగూడా-లేనట్టూ ఇటీవలి పాఠకలోకం అర్థం చేసుకుంది; రసపోషణగాని, కవితా శిల్పంగాని, భావనిరూపణంగాని, విషయ చిత్రణంగాని, ఆ కవిలో ఉంటాయని అనుకోరు; చూదామని శ్రద్ధగూడ తీసుకోరు.

పోతన్న అంత తేలికగా త్రోసివేయదగినవాడు కాడు; ఎందరో మహాకవులకన్న మిన్న.

ఆంధ్రకవితా పితామహుని వరూధిని మర్త్యకాంత - తనకంటె తక్కువజాతిదై పుట్టకపోయానే అని విచారిస్తుంది; అలాగే, పోతన గోపిక ఒక వెదురుమొక్కగా యమునానదీ తీరములో పుట్టకపోయానే అని చింతిస్తుంది.

ఎంతతపంబుచేసి జని
యించినవారొకో మర్త్యభామినుల్;
కాంతు డవజ్ఞ జేసినను
కాయము వాయదు; రే నమర్త్యనై
చింతలవంతలం దివికి
సిగ్గరితిన్; మృతిలేని నాదు చె
ల్వింతయు శూన్యదేహమున
కత్తిన దీపిక యయ్యెనక్కటా!

అని వరూధిని గణితంలో ఒక లెక్కచేసినట్టూ, లాయర్ వాదించినట్టూ, విచారించింది. పోతన గోపిక అలా కాదు;

నా మోసంబున కెద్ది మేర వినవే
నా పూర్వ జన్మంబులన్

లేమా, నోములు నోచుచో, నకట కా
 లిందీ తటిన్ వేణువై
భూవిన్ బుట్టెదనంచు గోరదగదే
 బోధిల్లి; యట్టైన నీ
శ్యామం బిప్పుడు మాధవాధర సుధా
 పానంబు గల్గుంగదే!

అని స్త్రీ భావసమాజంగా రసముట్టిపడేటట్టు, చింతించింది.

వామనావతార ఘట్టములో పోతన్న చూపిన 'కవిత్వ పటుత్వము' అసాధారణము; ఆ ఘట్టాన్ని అంత సమర్థతతో చిత్రించగల కవులు ఒకరిద్దరికి మించి ఉండరు. బలిచక్రవర్తి దానాన్ని గ్రహించి, వామనుడు త్రివిక్రముడై బ్రహ్మాండం నిండిపోతాడు. వటుడింతింతై మరింతయి పెరిగిపోతూండడం పోతన్న హృదయానికి ప్రత్యక్షంగా కనిపిస్తూంది. ఆ విధంగానే పాఠకునికిగూడా కనబడాలిగదా! ఆ బ్రహ్మాండత్వం పాఠకునికి ప్రస్ఫుటం కావాలిగదా! అలా జరిగినప్పుడేకదా ఆ రసం పలికినట్టవుతుంది!

ఇంతింతై వటుడింతయై మరియు దా
 నింతై, నభోవీధిపై
నంతై, తోయదమండలాగ్రమున క
 ల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రునికంతయై, ధ్రువునిపై
 నంతై, మహర్వాటిపై
నంతై, సత్యపదోన్నతుండగుచు బ్ర
 హ్మాండాంత సంవర్ధియై

అని వర్ణించాడు; ఆకాశవీధి, మేఘమండలము, కాంతిరాశి, చంద్రుడు, ధ్రువుడు, మహర్వాటి, సత్యపదమూ అని ఆ రూపాన్ని పెంచాడు. కాని—ఆ బ్రహ్మాండత్వం పాఠకులకు కరతలామలకంగా కనిపించిందా? ఆ మహాద్భుతాకారమెంత పెద్దదో కంటికికట్టినట్టుందా? తృప్తిలేదు. కాబట్టే,

రవిబింబం బుపమింప బాత్రమగు; ఛ
 త్రంబై, శిరోరత్నమై,
శ్రవణాలంకృతియై, గళాభరణమై,
 సౌవర్ణ కేయూరమై,
ఛవిమత్కంకణమై, కటిస్థలినుదం
 చద్ఘంటయై, నూపుర
ప్రకరంబై, పదపీఠమై వటుడుదా
 బ్రహ్మాండమున్నిండుచోన్.

అని వర్ణించి కృతార్థుడయాడు; ఆ మహాద్భుత రూపాన్ని ప్రత్యక్షంగా చూపించి పాఠకులను చరితార్థుల జేశాడు.

నడిమింటనున్న సూర్యబింబాన్ని చూడమన్నాడు. అది ఎంతయెత్తున ఉందో, ఎంత పైకి పోతే దాన్ని తాకగలమో, ఊహారూపంగా ప్రతి పాఠకుడికీ తెలుసును. దృష్టిని ఆ బింబంమీదనే ఉంచి, పోతన్న వామనుడిని పెంచాడు; వామనుడి కది గొడుగులాగుందన్నాడు; ఇంకా పెంచాడు, ఇప్పుడాబింబం తలలో పెట్టుకున్న రత్నంలాగుందన్నాడు; ఇంకా పెంచాడు; చెవిపోగులాగుంది; ఇంకా—మెడనున్న రత్నంలాగ; ఇంకా—భుజకీర్తిలాగ; ఇంకా—ముంజేతి కంకణంలాగ; ఇంకా—మొలనూలి మువ్వలాగ; ఇంకా—కాలి అందెలాగ; ఇంకా పెంచాడు—ఆ బింబం పాదపీఠంలాగుందన్నాడు. ఎంత పెద్ద ఆకారాన్ని ఎంత స్ఫుటంగా చిత్రించాడో చూడండి. పోతన్న శిల్పనైపుణ్యం ఏమనగలం! మన మహాకవులెంద రీ మహాకార్యమింత అందంగా నిర్వర్తించగలరు!

అనకూడదుగాని; భగవద్గీతలోని విశ్వరూప సందర్శన ఘట్టములోనైనా ఇంతటి స్ఫుటత్వం ఉందేమో చూడండి.

ద్యావాపృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చసర్వాః
దృష్ట్వాద్భుతంరూప ముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్.

ప్రహ్లాదచరిత్రలో నృసింహావతార వర్ణన ఎంత భయంకరంగా ఉందో, ఎందరు కవులా రీతిని వర్ణించి సాధకులకు సాక్షాత్కారము కలిగించగలరో యోచించినట్టయితే, పోతన కవిత్వ పటుత్వము నిస్సందేహంగా తేటపడుతుంది.

గజేంద్రమోక్షణ ఘట్టములో పోతన చూపిన మహాకవి లక్షణాలు అమోఘములు. గజేంద్రుడి ప్రార్థనలో జ్ఞానభక్తి వైరాగ్యప్రవృత్తులను ఏవిధంగా సోపానాలుగా ఉపయోగించాడో చూడగలసినదే. విష్ణుమూర్తి భక్తవాత్సల్యం ప్రకటించడానికి పోతన వేసుకొన్న పథకం, కేవల భక్తిప్రేరితమే కాదు; అత్యుత్తమ కవితా భరితము.

నిరాతంకముగా లక్ష్మీదేవితో కాలం గడుపుదామని నిశ్చయించుకున్న విష్ణుమూర్తితో మనలను ఆ వైకుంఠపురంలో, నగరిలో ఆ మూలసౌధం దాపల, మందారవనంలో, సెలయేటి ప్రక్కనున్న కలువతిన్నె దగ్గరకు పోతన్న తీసుకెళ్లాడు. అక్కడ మంచి రసవంతమయిన పట్టులో గజేంద్రుడి మొఱ్ఱ వినిపించాడు. క్షణంలో రమావినోదితనం ఎగిరిపోయింది; ఆపన్నప్రసన్నత మూర్తీభవించింది; ఆ పైటచెంగు పట్టుకొనే విష్ణువు సంరంభంతో బయలుదేరాడు.

ఆ సంరంభం ఒక మహాప్రవాహంలాగా కవిహృదయంలో పరిగెడుతూ ఉంది; ఆ ప్రవాహవేగంలోనికి మనలనీడ్చాడు పోతనమూడుపద్యాలలో. సిరికి చెప్పకుండా శంఖచక్రాలు తీసుకోకుండా విష్ణువు వెళ్తున్నాడు; చేతిలో పైటచెంగు చేతిలో నే ఉంది. లక్ష్మి పాపం, ఏమో తెలియక శాటీముక్తకుచంబులతో, తాటంకాచలనంబుతో, వెంటపడ్డది.[1]

కలువతిన్నె నుంచి తిరుగు ప్రయాణమారంభమయింది. ఆ మందారవనంలో మరెవ్వరూ లేరు కాబట్టి, తనవెంటన్ సిరిమాత్రమే. తరువాత ఆమూలసౌధంలో కొస్తారు; అక్కడున్న అవరోధవ్రాతం వెంటపడుతుంది; చావడిలో పక్షీంద్రుడు మొదలైనవారు—నగరి వెలుపలికి వచ్చేసరికి వైకుంఠంలోని ఆబాలగోపాలం వెంటబడ్డారు. వారిలోనే మనమూ ఉన్నట్టు పోతనకవి చేశాడు, చూడండా క్రమం:

తనవెంటన్ సిరి; లచ్చివెంట నవరో
    ధవ్రాతమున్, దాని వె
న్కను పక్షీంద్రుడు, వాని పొంతను ధనుః
    కౌమోదకీ శంఖ చ
క్రనికాయంబును, నారదుండు, ధ్వజినీ
    కాంతుండురా, వచ్చి రో
య్యన వైకుంఠపురంబునం గలుగు వా
    రాబాలగోపాలమున్.

పద్యారంభంలో 'వెంట' 'వెన్క' 'పొంత' అన్నమాటల నుపయోగించిన పోతన్న పోను పోను సంరంభాతిశయంవల్ల వాటినుపయోగించడం మానుకున్నాడు. తా నూహించిన సంరంభభావాన్ని పాఠకుల హృదయాల్లో నింత చక్కగ ప్రతిఫలించినట్టు చేసిన పోతనలో కవితావిశేషం లేదా?

ఇంతేకాదు; అతి సున్నితమయిన మానసికావస్థలను చిత్రించడంలోగూడా పోతన్న ఏ కవికీ తీసిపోడు. పాత్ర హృదయం తనదిగా చేసుకొని, దానికి సరిపోయినట్టు భావాలను ప్రకటించగలగడం పోతన్న కలవడినట్టు ఎందరికో అలవడలేదు.

రుక్మిణి తన బ్రాహ్మణుడిని కష్ణుడి దగ్గరకు పంపించింది; ఇంకా రాలేదు; ఇక్కడ వివాహ ప్రయత్నాలు సాగిపోతున్నాయి. కూర్చొని అనుకొంటూంది:

ఘనుడా భూసురుడేగెనో, నడుమ మా
    ర్గ శ్రాంతుడై చిక్కెనో,
విని కృష్ణుండిది తప్పుగా తలచెనో,
    విచ్చేయునో, యీశ్వరుం
డనుకూలింప దలంచునో తలపడో,
    ఆర్యామహాదేవియున్
నను రక్షింప నెరుంగునో యెరుగదో,
    నాభాగ్య మెట్లున్నదో.

ఈ పద్యంలో పోతన రుక్మిణి హృదయంలో ప్రవేశించాడు. అనిన మాటలు కొన్ని; అనకుండా ఉన్న ఊహాలు కొన్ని; అతి మనోహరమయిన పద్యం. భూసురుడేగెనో అన్నదే గాని 'లేదో' అనలేదు. ఆ ఘనుడి విషయంలో కల్లక పోవడమన్న ఊహగూడా రుక్మిణి సహించలేదు; మార్గాయాసంవల్ల కొంచె మాలస్య మయ్యుంటుందని సమర్థించకొని, వెళ్లే ఉంటాడు. కృష్ణుడితో చెప్పే ఉంటాడు అనుకొన్నది. విని కృష్ణుడిది తప్పుగా భావించుంటాడా? అని ప్రశ్నించుకుంది. అతనలాగ తలచేవాడు కాడే అనుకొని, విచ్చేయునా అనేఅన్నది గాని, విచ్చేయడో అనదు. ఆ ఊహే తనకు దుర్భరము. 'లేదు' అన్నపదం తన నోటపలకదు.

తానూ భూసురుడూ కృష్ణుడూ అయిపోయారు; ఇక మిగిలినది దేవతలు. వారిలో తన

(తరువాయి 64 వ పుటలో)

1. పరుగున పోతున్న స్త్రీని అల్లసాని పెద్దనగూడా వర్ణించాడు.
మట్టెల్ మ్రోవగ, గబ్బిచన్నుగవ కంపంబంద, వేణీభరం
బట్టిట్టె కటిచిమ్మచీకటులు గా...అని; దీనిని పోతన వ్రాసిన తాటంకాచలనంబుతో,
[illegible]

# నిఘంటువు కెక్కని నన్నయపదాలు

శ్రీ నిడదవోలు వెంకటరావుగారు

—: ♦ :—

ఇప్పటికి ముప్ఫయిరెండేండ్ల క్రిందట కీర్తిశేషులు గిడుగు రామమూర్తి పంతులుగారు నన్నయ భారతభాగము ప్రామాణిక పాఠముతో పరిష్కరించి, ప్రకటింపవలసిన బాధ్యతనుగూర్చి [1]'రాజరాజు కాలమందున్న తెనుగుభాష' అనే వ్యాసములో ఉద్ఘాటించినారు. ఆ పైని క్రీ. శ. 1937 వారి శిష్యులలో ప్రధానులైన చిలుకూరి నారాయణరావుగారాంధ్రభాషాచరిత్ర ద్వితీయసంపుటములో నన్నయభాషనుగూర్చి పరిశ్రమచేసి పరిష్కరణ విధానాన్ని సూచిస్తూ సౌపర్ణోపాఖ్యానము అచ్చువేసినారు. క్రీ. శ. 1940 లో త్రిలింగ రజతోత్సవ సంపుటిలో డాక్టరు గిడుగు సీతాపతి పంతులుగారు నన్నయ భారతభాగ పరిష్కరణావశ్యకతను చక్కగా నిరూపించి, యీ ఉద్యమమునకు ప్రోత్సాహించినారు. ఈ పరిశోధన పత్రికలో ప్రకటితములైన శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి నన్నయ పదాలను గూర్చిన వ్యాసములు పరిశీలించినట్లయితే, ఆ గ్రంథపు పునర్ముద్రణావశ్యకత ఎంతగా నున్నదీ మనకు తెలియగలదు. ప్రత్యేకాంధ్రరాష్ట్రమేర్పడినది. మన సాహితీ సంస్కృతుల ప్రత్యేకత వెల్లడింపవలసిన సమయము వచ్చినది. ఆ సంస్కృతికాధారమైన నన్నయ భారతభాగము ప్రామాణిక పాఠములతోడను, కూలంకషవ్యాఖ్యానములతోడను త్వరలో ముద్రితము గావించి లోకమునకందింపవలసిన బాధ్యత ఆంధ్రమహాజనులపై నున్నది.

—సంపాదకులు.

(1) రచయించు:

నేటికాలమున 'రచియించు' అను తత్సమ క్రియ గ్రంథములు రచియించుట యను నర్థమున నియతమైయున్నది. నన్నయ కాలమున నీ క్రియ కట్టడములు మొదలగు వానిని నిర్మించుటయందు వాడబడుచుండెను. "ఇమ్ముగ విశ్వకర్మ రచియించిన కాంచన హర్మ్యతుంగ శృంగమ్ముల —ఆది. 8-71

"ప్రాకారములను గరమొప్పుచుండ రచియించె సభన్"—సభా 1-11.

[2]శాసనములలోకూడ దీపమునిల్పె, దీపము పెట్టె మొదలగువానికి దీపము రచియించె అని కూడ ప్రయుక్తమైనది. నాదిండ్ల శాసనమున-"అఖండదీపరత్నము రచియించె నారవిసుధాకర తారకమై వెలుంగగాన్" అనికలదు.

రచియించు అను క్రియను గ్రంథరచనమునందు తొలుత నుపయోగించినకవి పాల్కురికి సోమనాథుఁడు. పండితారాధ్య చరిత్ర కృత్యవతరణికలో

"రచియింతుఁ బండితారాధ్య చరిత్ర
మచలితప్రీతి నీ కతిశయభక్తి-"

అని కలదు శివకవుల ననుసరించిన తిక్కన, పై ప్రయోగమును చూచియే "మహాకవిత్వదీక్షావిధి నొందిపద్యముల గద్యములన్ రచియించెదన్ కృతుల్"-(విరాట 1-8) అని గ్రంథరచనాపరముగా దీని నుపయోగించినాఁడు. తరువాతి కవులు దీని ననుసరించిరి. తిక్కన పైవిధముగఁ బ్రయోగించినను నన్నయ ననుసరించి చేసిన ప్రయోగములుకూడ లేకపోలేదు. "పర్ణశాలలు నే రచియించి రుచిరంపు విధముననధిపా"— విరాట 1-182.

వాక్యములు సమకూర్చు. కూర్చు అనునర్థమున శ్రీనాథుఁడును "నానావిధ చిత్రవాక్య రచనాచణ" అను కృదంతరూపము వాడియున్నాడు.

రచియించు=రచించు. 'రచించు' అను రూపమునకు చాలాప్రయోగములున్నవి. రెండు మాత్రము తెలుపుచున్నాను. "కృతిరచింపుము మాకు"—మనుచరిత్ర.

---

1. రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక, పుట 128
2. చూడుడు. మద్రాసు విశ్వవిద్యాలయమువారి తెలుగుకవుల చరిత్ర.

"అరవితారకంబుగ నుదా
 హారణంబు రచించె భక్తి వి
స్తారత"......
-తాళ్లపాక పెదతిరుమలయ్య-వేంకటేశ్వ
రోదాహరణము.

"జనముల్ మెచ్చగమున్ రచించితి నుదం
చద్వ్యాఖ్యలన్..."
— ప్రభావతీ ప్రద్యుమ్నము

(2) మనుమఁడు-మన్మఁడు.

నన్నయ యీ శబ్దమును 'మన్మండు' అను రూపముతో ప్రయోగించి యున్నాడు.

"మతిలోకోత్తరుఁడైన యంగిరసు మ
న్మండాశ్రితుం..."—ఆది. 8-118.

మనుమఁడు—ఆది 7-149 అరణ్య 8-67.

సాధారణముగ మనుమఁడు శబ్దమే వాడుకలో నున్నది.

"మనుమని-సఖాన్వితుఁడవై మనుమని
దీవించె."—అనిరుద్ధచరిత్ర. ౨ ఆ.

కాని 'మనుమఁడు' అను శబ్దముపై భట్టారక ప్రయోగము ననుసరించి 'మనమఁడు' అను రూపమును పొందినది:-మనుమఁడు-మన్మండు-మనమండు-మనమఁడు. వసుచరిత్రలో

"తే. గీ. భవ్యగుణమంజి.
 మనమరాలు......"

"మనమరాళి(లి) మానసమున, మన మరాళి (లి), మనమరాలి వివాహసంభ్రమముఁ జూడ" అని శబ్దస్వరూపము మార్పరాని శ్లేషస్థలమున గలదు. 5-85

కాని మనమరాలు శబ్దము నిఘంటువులలో లేదు.

(3) రంధ్రము.

నన్నయ యీ పదమును ప్రయోగించి యున్నను ముద్రిత పాఠములో లోపించినది.

సీ. "బ్రహ్మణ్యుఁడగు కశ్యప బ్రహ్మవరమున
 వినతకుఁ బుట్టిన యనఘమూర్తి
వాలఖిల్యులదయ వరపక్షికులమున
 కింద్రుఁడైపరగిన యిద్ధతేజుఁ(రంధ్రతేజు)
డుదధిలోనున్న యత్యుగ్ర నిషాదుల
 సారంగ మ్రింగిన ఘోరవీరుఁ
డిభకచ్ఛపముల రోహిణ శాఖలోనెత్తి
 కొని దివిఁబఱచిన యనిలవేగి."
—ఆది. 2-88.

పై సీసపద్యమున రెండవపాదమున "ఇంద్రుఁడై పరగిన రంధ్రతేజు" అను పదమే యుండవలెను. వ్రాతప్రతులలో నట్లేయున్నది. ప్రస్తుతము ముద్రిత ప్రతిలోనున్న 'యిద్ధతేజు' అను పాఠములోనున్నచో నది నన్నయ సీస పద్యరచనాపద్ధతికి విరుద్ధమగును. పై పద్యమున ద్వితీయదళమున నన్నియుప్రాసయతులే కలవు.

1. వినతకు - అనఘమూర్తి
2. కింద్రుఁడై - యిద్ధతేజు (రంధ్రతేజు)
3. సారంగ - ఘోర
4. కొనిదివి - అనిలవేగి.

పై పాదములలో మూడింటప్రాసయతి, ఒక చోట సాధారణ యతిగలదు. మూడింటిలో ప్రాసయతి యున్నప్పుడు తక్కిన పాదములో నుండుట నిశ్చితమే యగుచున్నది. అచ్చట "రంధ్రతేజు" అని యున్న నందును ప్రాస యతియే యుండు నన్నయ నియమమునకు సరిపోవును. క్రీ.శ. 1858 లోని ప్రథమ ముద్రణ ప్రతిపాఠమే తరువాతి ముద్రణముల కెక్కినది: [1]క్రీ.శ. 1118 లో నూరని శాసనమున (పద్యమయము) నీపదము ప్రయుక్తమైనది...

"...నఖండదీపంబు నిల్పె నా
 చంద్రతారకముగ రంధ్రయశుఁడు."

(4) ఆమ్నాయము-వంశము.

"ధరణీసురామ్నాయము "-భార. ఆది, 1-89.

ఆమ్నాయమునకు వంశము అను నర్థముగల ప్రయోగములు రెండు నన్నయభట్టారకునివి మాత్రమే సూర్యారాయాంధ్ర నిఘంటువున జూపబడినవి. కాని సూరన మార్కండేయ పురాణములో నీ ప్రయోగము గలదు.

"నాపేరు సమాధి యే ధనిక వైశ్యామ్నాయ
 సంజాతుఁడన్..."—6-18.

(5)—అగుడెంచె (అర. 4-8)
అరుగుడెంచె (అర. 4-85)
పోవుడెంచె - (ఆది 8-40)

తెంచు ధాతు వనుప్రయుక్తమైనప్పుడు నన్నయకాలపు భాషలో నొక విశిష్టమైన అర్థముతో వాడుకలో నుండెడిది. "మునిశాప దినమ్ములు పోవుడెంచె"—అంటే పోయెను అని అర్థము కాదు. శాపదినములు 'పోవచ్చెను' అనిఅర్థము. పోవుడెంచెను=పోవచ్చెను.

అట్లే 'అగుడెంచె' అనగా కావచ్చెను అని అర్థము. తిక్కనాదుల ప్రయోగములో నీ శబ్దమునకు పై అర్థవిశిష్టత కానరాదు.

ఈ 'అగుడెంచు' అను ప్రయోగమునకు సూర్యారాయాంధ్ర నిఘంటువున కడచు-గతించు అనునర్థములు వ్రాయబడినవి. కాని యవి సరికావు. ప్రకరణమునుబట్టి చూడగా అగుడెంచెను అనగా కావచ్చెననియే యర్థము సరిపడును. ప్రకరణమిది "ఏనేడు లగుడెంచె నర్జునుం డేగి యింతకేతెంచుఁ బూని దివ్యాస్త్రముల్ వడసి" అని ధర్మరాజు నరనారాయణాశ్రమ మందున్నప్పుడు తమ్మునితో నన్నాడు. ఇచ్చట "ఏనేడు లగుడెంచె" అనగా నైదేండ్లు గడచినవి అన్నచో నది మూలమునకు విరుద్ధముగా నుండును. మూలములో నైదేండ్లు గడవలేదని కలదు. "సమాశ్చ త్రస్రోఽభిగతాః శివేన చరతాం వనే, కృతోద్దేశస్తు బీభత్సః పంచమీ మభితాం సమామ్" (వనపర్వము 157-8) కాగా నిచట అయిదేండ్లు కావచ్చినవి అని అర్థమే మూలానుసారి.

(6) తోడ.

ప్రాచీనకాలమున తోడ విభక్తి ప్రత్యయముగా కన్పట్టుటలేదు. నన్నయకు ముందు కాలమున, ధర్మవరపు శాసనములో 'నలరామ విభుతోడ' అనియు, యుద్ధమల్లుని శాసనమున 'రమణితో' అనియు ప్రయోగములున్నవి. నన్నయ భారతమున నీ 'తోడ' ప్రయోగము సర్వత్ర నొకేరీతిగాలేదు:

కరుణతోడన్ - ఆది 1-27
గుణములతోడ - ,, 1-10
భక్తితోన్... ,, 2-191
రత్నావళితోన..., 2-99
దేవసములైన విప్రులతో - ఆరణ్య 2-48.

ఇట్లు పెక్కురూపములతో నున్నది విభక్తి ప్రత్యయమగునా యని సందేహింపవలసి యున్నది. క్రిందటి 'పరిశోధన' సంచికలో నావ్యాసమున వ్రాసినట్లుగా, విభక్తి ప్రత్యయ రూపమెప్పుడును నొకే రూపమున నుండవలయును. అట్లయిన పైవానిలో నే రూపమును విభక్తిప్రత్యయముగా పరిగణించుటయో తెలియుటలేదు. 'తోడ' అను రూపమునే గ్రహించిన అది నన్నయలోనే భిన్నముగా గానవచ్చుచున్నది. వ్యస్తముగా సముచ్చయార్థమందు; అనేక శబ్దములతోడ చేరవలసినచోట చివర వచ్చుచున్నది.

(1) "బాలకులయు శ్రీదర్పితులయు లుబ్ధులయు లఘుజనంబులతోడ-అర. 3-319
"కోమలధామ్యులయు తమ్ములయుతోడ"
—ఆది. 4-215.

(2) అధ్యయన విషయిక మయినప్పుడు గురువులను బోధించు శబ్దములకు చేరుచున్నది.
"ధనుర్వేద మగ్నివేశులతోడ నధిగమించి-"
-ఆది 8-297

ఇచ్చటనైన తోడ యను రూపమే సర్వత్ర లేదు. [-ఆది 4-167
"ప్రమతితోఁ జదివె నెల్లశాస్త్రములు."
"వసిష్ఠుతోఁ జదివె"—5-194|
"చదివించె భూసురులతో"...7-5
"ఉద్దాలకుతోఁ జదివె."—అరణ్య 3-242

ఇట్టి పరిస్థితిని గమనించియే కేతన ఆంధ్రభాషాభూషణములో తోడ తృతీయావిభక్తి ప్రత్యయముగా పరిగణింపలేదు. చిన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో తోడ మాఱురూపముగా నిచ్చియున్నాడు. అనగా పర్యాయపదమని యాతని యర్థము. విభక్తి ప్రత్యయమునకు పర్యాయపదము లెట్లుండును? మఱియును నర్వాచీనకాలమున 'తోడ మాటాడకునికి' అని (రామాభ్యుదయమున) తోడకు ప్రత్యేక ప్రయోగమే యున్నది. వేయేల విశేషమేమనగా నుదాహరణ గ్రంథములలో తోడ విభక్తి ప్రత్యయముగా నెంతమాత్రము నుదాహరింపరు. (ఒక్క విశ్వనాథవారు మాత్రము గోపాలరెడ్డి యుదాహరణములో వాడినారు. అది లాక్షణిక విరుద్ధము.)

వాస్తవికస్థితి యిట్లుండగా ఆంధ్రశబ్దచింతామణిలో విభక్తి ప్రత్యయముగా 'తో, చేత, తోడ, చేచతృతీయా' అని అజంత పరిచ్ఛేదములో నీయబడినది. పై నన్నయ భారత ప్రయోగములను బట్టి నన్నయ కాలములోగాని తరువాత కేతనకాలములోగాని అది విభక్తి ప్రత్యయముగా పరిగణనము కాలేదు. ఇక నిట్టి యాంధ్రశబ్ద చింతామణిని నన్నయ రచించెననుట హాస్యాస్పదము. తోడ విభక్తి ప్రత్యయముగా తొలుతపరిగణితము కాలేదనిసిద్ధాంతము.

# ద్విపద భారతము

శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మగారు

—: ♦ :—

ఆంధ్రనాయక రాజుల కాలములో తంజనగరము అన్నివిధముల విజయనగర సామ్రాజ్యమునకు ప్రతిబింబముగా వన్నెకెక్కినది. అపర కృష్ణరాయలనదగిన రఘునాథరాయల యేల్బడిలో సంగీతసాహిత్యములు రెండును జంట విడువకుండ మహావైభవమును పొందినవి. ఆతని యాస్థానములో అవిరెండును చిద్విలాసముతో పొందిన వివిధవిన్యాసములే దక్షిణాంధ్ర వాఙ్మయమున కంతకును మేలుబంతులు. అవి పాటలు, పదములు, ద్విపదలు, యక్షగానములు, వచన రచనలు, శృంగారకావ్యములు మున్నగునవి. రఘునాథరాయలు తన సభాంగణమున కెదురుగా ఆ దివ్యమూర్తులకు నెలకొల్పిన పూజామందిరమే సరస్వతీమహాలు దక్షిణదేశ యాత్రలు చేయబోవు ప్రతియాంధ్రునికిని అది దర్శింపదగిన పుణ్యక్షేత్రము. అందులో మనకు ముఖ్యముగా దర్శనమిచ్చునది ఆంధ్రసరస్వతి. ఆమెకు ఇరువంకల తక్కినభాషామూర్తులు కూడ నెలకొల్పబడినవి.

కాలాంతరములో తంజపురపాలనము మహారాష్ట్రులవశమైనప్పటికిని నాయకరాజులవలెనే వీరుకూడ సంస్కృతాంధ్రముల పట్ల అభిమానము కలవారై ఆ యాకవులను పండితులను ఆదరించియు పోషించియు వారిచేత గ్రంథరచనము చేయించుటయేగాక తాముకూడ తెనుగు నేర్చుకొని ఆ భాషలో గ్రంథములు రచించిరి. వారిలో క్రీ. శ. 1800-1832 ప్రాంతమువాడైన ఒక శరభోజియను మహారాష్ట్రరాజు దేశము నలుమూలలనుండియు వివిధభాషలకు చెందిన తాళపత్రగ్రంథములు సంపాదించి, నాయకరాజులు ప్రతిష్ఠించిన శారదామందిరమును సరస్వతీమహాలుగా పెంపొందించినాడు. ప్రపంచములోని పెద్దపెద్ద తాళపత్ర గ్రంథాలయములలో ఇది యొకటిగా ప్రసిద్ధిచెందినది. పై[1] ద్విపదభారతము ఈ గ్రంథాలయమునుండి వ్రాసి తేబడినదే.

సంస్కృతభారతమును ఆధారముగా చేసికొని ఆంధ్రమహాభారత మవతరించినట్లే ఆ కవిత్రయ భారతము మాతృకగా చేసికొని ఈ ద్విపదభారతము ఆవిర్భవించినది. దీనికి నెల్లూరు మండలము జన్మస్థానము. దీనిని రచించినవారు బట్టేపాటి తిమ్మయ, బాలసరస్వతి, ఆతుకూరి సోమన అనువారు. పై ముగ్గురిలో తిమ్మయ ఆది అరణ్య విరాట ఉద్యోగ భీష్మద్రోణ పర్వములు రచించినాడు. ఇతడు క్రీ. శ. 1550-1600 ప్రాంతమువాడు. వల్లభసూరి కుమారుడు, కాశ్యపసగోత్రుడు కాణ్వశాఖీయుడు శివభక్తుడును. నెల్లూరు మండలములోని బట్టేపాడు ఇతని వాసస్థానము. తిమ్మన, తిరుమలభట్టు అనికూడ ఇతనికి వ్యవహారమున్నట్లు తెలియుచున్నని. ఈతడు తాను రచించిన భారతభాగములలో ఆదిపర్వమును నరసయాధిపుని కుమారుడైన చాడామాత్యునకు, విరాటపర్వమును బట్టేపాటి నివాసియగు జంగాలముమ్మయ అను పంటవంశ ప్రభువునకును తక్కిన పర్వములు శ్రీరామునకును అంకితమొనర్చినాడు.

ద్విపద భారత కర్తలలో రెండవవాడు బాలసరస్వతి. ఇతడు పై పేర్కొనిన తిమ్మయకు సమకాలము వాడేకాక అతనికిశిష్యుడో, శిష్యప్రాయుడో అయినట్లు ఊహింపబడుచున్నది. ఇతడు సభాపర్వమును మాత్రము రచించి రంగయామాత్య పుత్రుడైన అనంతామాత్యునకు అంకితము చేసినాడు.

ఇక మూడవవాడు సోమన. ఇతడు కర్ణపర్వము మొదలు స్వర్గారోహణ పర్వమువరకు మొత్తము పదునొకండు పర్వములను రచించినాడు. అదియుగాక ఆదిపర్వకర్తయైన తిమ్మయ ఉపాఖ్యానముల నన్నిటిని విడిచి, కేవల ప్రధాన కథామయముగా అరణ్యపర్వమును రచింపగా ఆ యుపాఖ్యానముల నన్నిటిని కూర్చి ఆ పర్వమును సర్వాంగసుందరముగా

---

1. నేనును నా మిత్రులు టి. రామచంద్రగారును ఆంధ్రవిశ్వకళాపరిషత్తునకై తంజావూరి మాతృకనుండి ప్రతివ్రాసి యిచ్చితిమి. విశ్వకళాపరిషత్తువారు ఈ గ్రంథమును నాల్గుసంపుటములలో ప్రకటించిరి.

నిర్మించినాడు. ఇతడు రమారమి క్రీ. శ. 1600-1650 ప్రాంతమువాడు. నెల్లూరు మండలములోని అతుకూరి గ్రామవాసి. ఇంటిపేరు అతుకూరివారు. తిమ్మయ కుమారుడు. వేంకటేశ్వర భక్తుడు. తన రచనయంతయు ఆదేవునకే అంకితమొనర్చినాడు. ఈ భారతమునంతను ముత్తెములవంటి యక్కరములలో తాళపత్రముల మీద వ్రాసిన యతడు కుప్పయమంత్రి. ఇతడు చోళమండలమును పాలించిన మహారాష్ట్రరాజులలో రెండవవాడగు శాహజీ కొలువుకూటములో వ్రాయసకాడు. శాహజీయాజ్ఞననుసరించి నింబాజియను విద్యాశాఖాధికారి నియోగముచే తానీభారతమున కంతకును ప్రతివ్రాసితినని యీ లేఖకుడు విరాట ఉద్యోగ భీష్మ అశ్వమేధ పర్వాంతములలో వ్రాసినాడు.

ఏ సారస్వతములోనైనను పద్యకవిత్వముకన్న పదకవిత్వమే ముందు పుట్టి పెరుగును. కాని, ఛందోవ్యాకరణాది నియమమూ, ప్రౌఢమగు శైలీ, ఇతివృత్తౌదార్యమూ, విజ్ఞాన బోధకత్వమూ, మొదలైన వివిధములగు కవిత్వాంగములను సంపాదించుకొని పద్యకవిత్వము ప్రౌఢసాహిత్యమను పేరుతో నాగరికలోకమున ప్రతిష్ఠ సంపాదించుకొనును. పదకవిత్వము ఎంత సహజమనోహరముగను నిరాడంబరముగను ఉన్నను ప్రౌఢవాఙ్మయములో ప్రవేశింపలేక గాలిలోనే పుట్టి గాలిలోనే పెరుగుచు పుట్టుకబలిమిని బట్టి కొంతకాలము సజీవముగానుండును. ఇదే మన సారస్వతములో శుద్ధదేశికవిత్వమనిపించుకొన్న శాఖ. దీనికిగూడ నాగరికలోకములో సారస్వత ప్రతిష్ఠ సంపాదించుటకు ప్రయత్నించినవారే ద్విపదకావ్యకర్తలు. వీరు, చదువదగిన పద్యకవిత్వముపట్ల ఒకకంటిని, పాడదగిన పదకవిత్వముపట్ల రెండవకంటిని ఉంచి, ఉభయగుణములను ఏకముచేసి జనసామాన్యమునకు గూడ ఆస్వాదనీయముగా పాకముచేసిన రసాయనమే ద్విపద కవిత్వము. ఏతద్రూపమైన కావ్య నిర్మాణమునకు ప్రథమాచార్యుడుగా పేర్కొనదగినవాడు పాల్కురికి సోమనాథుడు. కాని పండితారాధ్య చరిత్ర మొదలైన యితని ద్విపదకావ్యములు ప్రౌఢమగు శైలిలో నుండుటచేత జనసామాన్యములో ఇతడాసించినంత ప్రయోజనము పొందలేక పోయినవి. రచనలో సౌలభ్యమును కథాగమనములో క్రొత్తదనమును గలిగి చాలవరకు జనాదరమును సంపాదించుకొన్నది రంగనాథరామాయణము. దీనికంటె ప్రసన్నమగు శైలిలో[1] భాగవతమును శేకుమల్ల రంగశాయి ద్విపదీకరించినాడు.

భారతములోని పరమార్థమును జన సామాన్యమునకు గూడ సుబోధము చేయుటకై ఈ ద్విపద భారతకర్తలు తమ రచనలను సాధ్యమైనంత సరళమార్గములోను, సులభశైలిలోను సాగించినారు. ఇది కవిత్రయ భారతము ననుసరించినను చాలవరకు యథేచ్ఛానువాదముగానే నడచినదిగాని యథామాతృకముగా పరివర్తితము కాలేదు. అనగా కవిత్రయమువారు ఏవిధముగా సంస్కృతభారతములోని శాస్త్రీయ విషయములు మొదలైనవి విడిచియు తగ్గించియు మార్చియు కూర్చియు తెలుగు భారతమును రచించిరో, ఆవిధముగనే వీరుకూడ ద్విపదరచనలో ఉండదగినంతవరకే కవిత్రయ భారతమునుండి విషయములు సంగ్రహించిరి. కొన్ని విడిచిపెట్టినవీ ఉన్నవి. అందులో లేక పోయినను అవసరమును, ఔచిత్యమును పురస్కరించుకొని ఇందు క్రొత్తగా చేర్పబడిన కథాంశములును గలవు. ఆ విషయములు క్లుప్తముగా వివరింతును.

ఉపపర్వశమంతకాక్షౌహిణీ సంఖ్యాకథనము, దేవళుని వృత్తాంతము, చ్యవనునిచరిత్ర ప్రమద్వరాకథ, దేవదానవుల యుత్పత్తి క్రమము, పురూరవాది రాజవంశ ప్రసంగము, ఋషితాశ్వ శ్వేతకేతు దీర్ఘతమ సుందోపసుంద మందపాలుర చరిత్ర మొదలైనవి - ప్రధాన కథతో అంతగా సంబంధము లేనివి యిందులో బొత్తిగా విడువబడినవి.

భారతకథను మాత్రము క్లుప్తముగా ప్రస్తావించి, కథకు పూర్వాంగమైన సముద్ర మథనము, దానికి హేతువగు దుర్వాసశ్శాప వృత్తాంతములతో గ్రంథారంభము చేయబడినది. దుర్వాసశ్శాప వృత్తాంతము వ్యాసభార

1. ఇది అముద్రితము. దీని మాతృక మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీలో ఉన్నది.

తములోను, కవిత్రయ భారతములోను లేదు. ఆ రెండు గ్రంథములలోను సముద్రమథన వృత్తాంతము హఠాత్సంభూతముగానే కనిపించుచున్నది. దానికి ఉపపత్తిని కలిగించుటకొఱకే ఈ వృత్తాంతము విష్ణుపురాణాదులనుండి గ్రహింపబడినట్లు తోచుచున్నది. ఈ ఘట్టములో దేవదానవులకు పొత్తు కుదుర్చుటకై రాయబారము నడపిన బృహస్పతియొక్క ప్రసంగ నిపుణత్వము ద్విపద భారతకర్తల శైలిలోని సంభాషణ చాతుర్యమునకును, లోకజ్ఞత్వమునకును నిదర్శనము:

"నావుడు నాదైత్య నాథులతోడ
నా విబుధాచార్యుఁడనియె నేర్పెసఁగ
అమరవల్లభుఁడు మీయందఱితోడ
సమచిత్తుఁగఁ గూడి చరియింపఁదలఁచి
పవిపాణి మీతోడఁ బలుకుమన్నట్టి
వివరంబు చెప్పెద వినుఁడు మీరెల్ల
తాము నేమును నన్నదమ్ముల మయ్యు
నీమాడ్కి నన్యోన్య మీసుగా నేల!
జగతి నేపొద్దొ గోచారాన మనకు
జగడంబు వచ్చినఁ జనునె పాయంగ!
ఉభయ వాదులము కూడుండినమనకుఁ
త్రిభువనంబుల నెదిరింపఁగఁగలరె!
ఒనరంగ మనమెల్ల నొక్కటై దివిజ
దనుజభటాళిచేఁ దడయక యిపుడు
తోయధిమథియింప దొఱకును నమృత
మాయమృతము ద్రావినంతనె మనము
చావును దెవులును జరయును నెవ్వి
భావింపఁగారాక భాసిల్లఁగలము."

నీచమైన తల్లి దాసీత్వమును, తన నీచత్వమును చూచుకొని గరుడుడు విచారముతో వినత నుద్దేశించి పలికిన మాటలలో ఎంత సహజమైన సల్లాపమాధుర్యము కలదో సహృదయులు గ్రహించి ఆనందింతురుగాక!

"తల్లి, నిన్నిదియేమి తవిలి మీవార
లిల్లాదిగా వీరికిచ్చిరో వెలకు!
కాదేని నీకొండుకడ దిక్కులేమి
నీడసపొంది నీవిడుమ పొందెదవో!
కాకున్న వనదవై కడుపుకూటికిని
ఈ కద్రువకుఁ బనులిట్లు చేసెదవో!
అదిగాక ప్రతినకునైపూని తగవు
వదలక యిట్లుండ వలసెనో నీకు!
కులిశ సన్నిభపటు ప్రఖరతుండాగ్ర
దళిత నిష్ఠుర ధరాధరుఁడనై వీరిఁ
జేపట్టి కుచ్చితు చెలువున నేను
ఈపాపకొదములు నిట్లుమోచుటకుఁ
బనియేమి చెప్పుమీ మేర్పడ నాకు......"

తేలికైన ఘట్టములుకూడ రచనా చమత్కారమువల్ల వీరి చేతిలో రసవత్తరముగానే తయారయినవి. తండ్రి సంపాదించిన ఆస్తినంతను విభావసుడొక్కడే కాజేసి అనుభవించుచుండగా తమ్ముడైన సుప్రతీకుడు తన భాగమిమ్మని అన్నను నిలువదీసి యడిగినమాటలు ఎంత లోకస్వభావముగా నున్నవో చూడుఁడు:

"పితృపితామహులెల్లఁ బెంపారఁదొల్లి
యతుల ధనాఢ్యులై యందఱు నేఁగ
డాఁచిన యర్థమంతయు నొక్కరుఁడవె
చూచి చేకొంటివి వచ్చుగ విభాగించి
నాకు నీకలవె ధనంబులో సగము!
చేకొని తండ్రిచేసిన ఋణంబున్న
వడిఁబంచి నాకిచ్చు వాఁడవుగావె!
గడుసుతనమేల కన్నవారెల్ల
నగుదురు గాన సన్నకుసన్న ధనము
సగమిమ్ము......"

ఈ ద్విపదభారతము రమారమి కృష్ణరాయల కాలమునకు దగ్గరగా ఆవిర్భవించుటవలనను, ఆది ప్రబంధ వాఙ్మయము ముమ్మరముగా బయలుదేరిన సమయమగుటచేతను ఇందులో అక్కడక్కడ శైలిలోను, వర్ణనలోను ప్రబంధవాఙ్మయ ధోరణి పొడసూపినది. దుష్యంతుని మనస్సును ఆకర్షించిన యిందలి శకుంతలా రూపవర్ణనము పిల్లలమర్రి పినవీరభద్రుని సృష్టికి ప్రతిబింబముగా గోచరించును. పాండురాజు చరిత్రలోని కిరాతులరాక, వేటవర్ణన మొదలైనవి మనుచరిత్రాదులలోని మృగయావర్ణనలను తలపునకు దెచ్చును. ఇందలి ద్రౌపదీస్వయంవర మండపము రఘువంశములోని యిందుమతీ స్వయంవర మండపమును, నైషధములోని దమయంతీ స్వయంవర మండపమును చూచి నిర్మించబడ్డవా యనిపించును. అక్కడక్కడ కొన్ని కొన్ని ఘట్టములు రసవత్తరములైన చిన్నచిన్న కావ్యములుగా నిలువదగినంత మనోహర రచనలో రచింపబడినవి. ఉపరిచర వసువృత్తాంతము, యయాతిచరిత్ర, సముద్రమథనము మున్నగునవి ఈజాతికి చెందినవి.

పదప్రయోగ విషయములో కేవలము అచ్చ

గ్రంథముల యడుగుజాడలలోనే నడవక స్వాతంత్ర్యము చూపిన ప్రాచీనాంధ్ర కవులు కొంతమంది కలరు. అందును ద్విపదకవులు అతి స్వతంత్రులేమోయని తోచును. ఈ భారతములో అట్టి వింత పదప్రయోగము లెన్నో కనిపించుచున్నవి. 'శుభ్రుపచారముల్' 'చక్రిహింసిదియేల' 'మానవనాథనుమానము' 'విప్రులనుమతి' మొదలగు ప్రాచీన లక్షణగ్రంథములను అంతగా లక్ష్యము చేయని ప్రయోగములు చేయుటలో వీరేమాత్రమును వెనుకాడలేదు. 'నియ్యనుగ్రహము' 'అయ్యన్న' ఇత్యాదిగా క్రొత్త ఫక్కిలో రూపసృష్టికూడ చేసినారు. 'కలహారము' 'భయము' 'చనుమానము' 'అయివారము' 'తరువాయి' వంటి వ్యావహారిక పదములను ప్రయోగించుటలో చాల చొరవే చూపినారు.

ద్విపద కావ్యములకుగల పాఠ్య గేయరూపములైన ద్వివిధప్రయోజనములలో పాఠ్యముకన్న గేయత్వమే జనసామాన్యమునకు ఆదరపాత్రమైనది. ఈ ద్విపదభారతము ఎంత లక్షణయుక్తముగా రచించినను

"శ్రీరామా రఘురామా సీతాభిరామా
ధారుణీపతిరామ దశరాథరామా"

అను రీతిగా తాళగతికిని, గానఫణితికిని అనుగుణముగా పాటకజనము పాడు ఫక్కికలోనే అక్కడక్కడ కొన్ని పంక్తులు నిలిచియున్నవి. ఈ గానఫణితిలో వ్రాయుటలో రచయితలు ఛందోభంగమునుగూడ గుర్తించినట్లు లేదు.

"భూధరేంద్రము బుడబుడరవముతోడ"
"తెల్లచంద్రిక దగడుదేహంబుతోడ"
"వినతకొడుకని కాద్రవేయులు గరుడి"

ఈ మొదలగు స్థలములలో ఇంద్రగణముకుండవలసినచోట్ల మాత్రాధిక్యము గోచరించును. ఈవిధముగా తాళగమనమును, గానపద్ధతిని సరిపెట్టుకొని రచన సాగించుటలో "అజాడంత తనదు సత్యాలోకమునకు" "నకుల సహదేవ నామముల్ వారు" అనురీతిగా హ్రస్వమును దీర్ఘము చేయుటకుకూడ వీరు వెనుకాడలేదు.

ఈ ద్విపదభారతమునకు సంపూర్ణమైన మాతృక ఒక్కతంజావూరి లైబ్రరీలోమాత్రమే ఉన్నది. మద్రాసు ప్రభుత్వపు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమందును, తిరుపతి గ్రంథాలయమందును, కాకినాడ సాహిత్య పరిషత్తులోను, ఉస్మానియా, ఆంధ్రా యూనివర్సిటీలలోను కొన్నికొన్ని పర్వముల ప్రతులేయున్నవి. ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు పరిష్కరించి ప్రకటించిన యీ ద్విపదభారతమునకు తంజావూరిలో సరస్వతీ మహలులోని సంపూర్ణమైన ప్రతే మాతృక. తక్కిన స్థలములలోని ఆయాపర్వముల ప్రతులు అవసరమైనచోట్ల పాఠాంతరములు సరిచేసికొనుటకు ఉపయోగింపబడినవి. 1912 వ సంవత్సరములో శ్రీ వనప్పాకం శ్రీనివాసాచార్యులుగారు ఇందలి విరాటపర్వమును అచ్చువేయించి ప్రకటించినారు. అది చూడగా మద్రాసు ప్రతి ననుసరించి వ్రాయబడినట్లు తోచుచున్నది. ఈమధ్య ఆంధ్ర విశ్వవిద్యాలయములోని తాళపత్రగ్రంథములను పరిశీలించుచుండగా అందులో 'సీతావిజయము' అను అముద్రితాంధ్ర కావ్యమొకటి లభించినది. కర్త లింగకవి. ఇతడు పీఠికలో:

"విప్రవర్యుడ వేదవిదుడ సీతారామ
......ప్రాప్త సరస
సత్కవిత్వ మనోజ్ఞ సామ్రాజ్యసుఖపరా
యణుడను విద్వజ్జనాభినుతుడ
ఆత్రేయగోత్ర పవిత్రుడ నర్సన్న
కొండన్నగారికి కూర్మిగల్గు
తమ్ముడ నర్సాంబ ధర్మనార్యుండును
తల్లిదండ్రియై తనరువాడ
లింగకవి యాంధ్రునా పేరు లీలమెఱసి
తెనుగునను భారతంబెల్ల ద్విపద చేసి
వారికి నంకిత మొసరించి తద్విధులైన
కవివరేణ్యుల నితడు సత్కవియనంగ."

అని చెప్పికొన్నాడు. ఈ లింగకవి యెక్కడివాడో, యెప్పటివాడో, ఈతడు రచించిన భారతము స్వరూప మెట్టిదో తెలియరాదు. కాలగర్భములో ఇంకను ఇట్టి గ్రంథములెన్ని మరుగుపడియున్నవో.

ఇప్పటికి లభించిన యీ తంజావూరు ప్రతిని మూలరూపమును మార్చకుండ, వీలయినంత నిర్దుష్టముగను, సమగ్రముగను సంస్కరించి ఆంధ్ర మహాజనులకు అందించినందులకు ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు ఎంతయు శ్లాఘనీయులు. పాఠకమహాశయులు దీనిని కవిత్రయ భారతముతో సరిపోల్చి ఇందులో ఇదిలేదు అదిలేదు-అని యీసడింపకుందురుగాక! ఏమనగా, ఇది పుట్టిన

# కాళిదాసుని దేశాటనము

శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు



"నరత్వందుర్లభంలోకే
విద్యాతత్రసుదుర్లభా,
కవిత్వం దుర్లభం తత్ర
శక్తిస్తత్ర సుదుర్లభా."

అను శాస్త్రకార వచనము ప్రసిద్ధము. శక్తియనగా లోకశాస్త్రాది పరిజ్ఞానమువలన గలుగు ప్రతిభ. ప్రతిభ రాజ్యతంత్రనిర్వాహకుల కెంత అవసరమో, కావ్యనిర్మాతలకు నంత అవసరమే. ప్రతిభలేని వానికవిత రసములేని చొప్పదంటు. ప్రతిభగల కవియైనచో నవరస రుచిరమగు కావ్యమును నిర్మించి యపరవిధాతగా ప్రఖ్యాతిగాంచును.

ప్రతిభాపాదకము లన్నింటిలోను దేశాటనము, బహుశ్రుత సాంగత్యము ననునవి ముఖ్యములు. కవులు సాధారణముగా తమ యనుభవములను దమ కావ్యములందు వ్యంగ్యరీతిని బ్రతిష్ఠించుట స్వాభావికము. తమ కాలము నందలి సాంఘికాచార వ్యవహారములు, రాజకీయములు, మతవిషయములును గవులు దమ కృతులందు ప్రతిఫలింపజేయుచునే యుందురు. దానివలననే మనకు బూర్వ చరిత్రము దెలియుట సంభవించుచున్నది. మృచ్ఛకటిక నాటకమును జిత్తగింపుడు. దారిద్ర్య దుఃవస్థలు, దాన ప్రియతచే దారిద్ర్య సంప్రాప్తి: ఆరక్షకాధికారుల మూర్ఖతలు, అన్యాయదోషారోపణములు, ద్యూతవ్యసనములు, చౌర్యచాతుర్యములు మొదలగు సకల విషయములు నానాడు వర్ణింపబడినవి యీనాడును సరిగ నారీతినే జరగుచున్నవి కనుకనే మృచ్ఛకటికమునకు నాటకలోకమున ప్రత్యేక ప్రశస్తి చేకూరినది.

మన ఆంధ్రకవులలో శ్రీనాథుడు తాను సంచరించి చూచిన దేశవిశేషములు, అనుభవించిన యనుభవములు నన్నియు దనగ్రంథములందు నెలకొల్పి, మనకన్నులకు గట్టిన ట్లాయావిషయములు చూపినాడు. అతని యే గ్రంథము చదివినను నతని యనుభవము మనకు ననుభావ్యమే యగును కావుననే, యతడు కవిసార్వభౌముడు కాగలిగినాడు. అతడు వాచికముగ ననేక విషయములు తెలిపినను వ్యంగ్యముగను బహు విషయములు బోధించినాడు. అతని రీతిగ (ఇప్పటి విమర్శకుల యభిప్రాయము ననుసరించి) నభ్యుదయ కవిత రచించిన వారా కాలమున నితరులు కానరారు.

సంస్కృత భాషయందన్నచో కాళిదాస మహాకవి కీడగు కవిలేడనుట సుప్రసిద్ధ విషయమేకదా! అతని కవితయందు శైలి, పాకము, అర్థగౌరవము, వర్ణనౌచిత్యము, అలంకార చాతురి, సుకుమార పదలాలిత్యము అన్నింటిని మించిన పాత్రపోషణము మొదలగు విషయములన్నియు ననన్యాదృశములే. అన్నియు మహామణులే. తక్కినకవుల కృతులందు కొన్ని కొన్ని యనర్ఘ విషయములు లేకపోలేదు. కాని కాళిదాసుని కృతులందువోలె నన్నిగుణముల నేకస్థానసీయత కానరాదు. కావుననే యా కవి కంతటి మహాప్రఖ్యాతి లభించినది. అతడు ఇంచుమించుగ భారతదేశమంతయు సంచరించినాడు; నౌకలచే సముద్రము లుత్తరించినాడు; విమానములచే నభోగణము నధిగమించినాడనుటకును గొంచె మవకాశ మగపడుచున్నది. తాను జూచిన విషయములన్నియు దన కృతులందు చొప్పించి యా కృతులమూలమున మనకు

---

దొక తరగతి పాఠకలోకమునకు, అది జన్మించినది మరొక తరగతి పాఠకలోకమునకు. దీని ప్రయోజనము వేరు; దాని ప్రయోజనము వేరు. ఏ మూడువందలయేండ్ల కిందటనో ఆంధ్రావనిపై అవతరించి, దేశము నలుమూలల సంచారము చేసి, ఇంతవరకును తంజాపురిలో తాళపత్ర శరణ్యముగా నున్న యీ మహాగ్రంథము ఈ నాటికైనను ఆంధ్ర విశ్వవిద్యాలయ ద్వారము నుండి వెలుతురులోనికి వచ్చినందులకు సంతసించి దీని ప్రయోజనమును పొందుదుముగాక!

(ఆల్ ఇండియా రేడియో విజయవాడ కేంద్రంవారి సౌజన్యంతో.)

కూడ దేశపరిజ్ఞానమును కలిగించుచున్నాడు. ఆ మహామహుడు వర్ణించిన దేశస్వరూప మీనాడును నించుక మార్పులొందినను ప్రాచీనతా సూచకముగ నిలచియున్నది. ఈ విషయమున కొన్ని యుదాహరణములను బాఠకలోకము నెదుర నుంచుటయే నాయీ ప్రయత్నము.

రఘువంశము నాలవసర్గమున రఘుమహారాజు దిగ్విజయయాత్రావసరమున వంగదేశపు రాజులు

శ్లో. "ఆపాదపద్మప్రణతాః
కలమా ఇవ తే రఘుమ్
ఫలైస్సంవర్ధయామాసుః
ఉత్ఖాతప్రతిరోపితాః."

పెల్లగింపబడి మరల నెలకొల్పబడినవారు వరిచేలవలె రఘువున కధిక ఫలము లొసంగిరని వర్ణించినాడు. వరిసేద్యమున సాధారణముగ రెండుపద్ధతులు కలవు. క్షేత్రము దమ్ముపట్టి బురదగాచేసి, నారుమడికే వేఱొక తావున విత్తనములు చల్లి మొలపించిన మొలకలను బెఱికి తెచ్చి, యీ క్షేత్రమున దూరదూరముగ నాటుట; లేదా బురదచేసిన మడిలో వరిగింజలను చల్లుట. ఈ రెండు పద్ధతులు నిపుడు పెక్కుతావుల నగపడుచున్నవి. అతని కాలమున రెండవ పద్ధతి కలదో లేదో తెలియదు కాని మొదటిపద్ధతి విశేష ఫలప్రదమని తెలియనగుచున్నది. మఱియు నాకాలమున వంగదేశీయులు నౌకాయుద్ధములు గావించువారనియు "వంగానుత్ఖాయ తరసా నేతా నౌసాధనోద్యతాన్." అనుదానివలన దెలియును.

శ్లో. "ప్రతిజగ్రాహ కాలింగః
తమస్త్రైర్గజసాధనః,
పక్షచ్ఛేదోద్యతం శక్రం
శిలావర్షీవ పాదపః."

గజసైన్య మత్యధికముగాగల కాలింగు డాతని నెదిరించెను. కళింగరాజుల యుత్కలారణ్యములు స్వాయత్తములగుట గజసైన్య మధికముగా నుండుట పురాణ ప్రసిద్ధమేకాక చరిత్ర ప్రసిద్ధముకూడ నైనదే. ఇప్పటికిని రసూల్‌కొండ ప్రాంతమునకును, గుణుపరమున కావల మిన్నాజోలాయను క్షేత్రప్రాంతమునకును నడవి యేనుగుల మంద ఇప్పటప్పట వచ్చుచు నేయుండును. ఇప్ప డుత్కలముగా మాఱిన పల్లూరు, తాల్చేరు మొదలగు నరణ్యప్రాంతములం దడవియేనుగులను వేటాడిపట్టుచుండుటయు గలదు.

"ఉత్కలాదర్శితపథః
కళింగాభిముఖో యయౌ."

దీనివలన వంగకళింగదేశముల నడుమ ప్రసిద్ధమగు రాజ్యమేదియు లేదనియు, నుత్కలులను నాటవిక జాతిమాత్ర ముండెననియు దెలియుచున్నది. చరిత్రవలన వంగము తరువాతగల దేశమెల్ల కళింగాంతఃపాతియే యనియు, కళింగమున కుత్తరభాగ ముత్కలింగమనియు నది మహారణ్య భూయిష్ఠమై జనపద విరహితమై కిరాతజనాకీర్ణముగా నుండెడిదనియు దెలియుచున్నది.

శ్లో. "తాంబూలీనాం దలైస్తత్ర
రచితాపాన భూమయః,
నాళికేరాసవం యోధాః
శాత్రవంచ పపుర్యశః"

కళింగదేశమున రఘుని సైనికులు తమలపాకులు దొన్నెలుగా జేసికొని కొబ్బరికల్లు త్రావిరట. భువనేశ్వర క్షేత్రమునకు నాతిదూరమున కొన్నియేండ్లకుముందు బయలుపడిన శిశుపాల ఘడము (ఖారవేలుని రాజధాని)నకు నెదురుగా, పూరీక్షేత్రము మొదలుకొని శ్రీకాకుళము జిల్లాలోని కళింగపట్టణము వఱకుగల సముద్రతీరమందు కొబ్బరి తోటలు మిక్కిలిగా నుండుట నేడును ప్రసిద్ధమే. ఉద్దాన (ఉద్యాన)ము మఱియు కొబ్బరికి ప్రఖ్యాతిగన్నది. ఇప్పుడీ ప్రాంతమున దొన్నెలుగా చేయుటకు వీలయినంత పెద్ద తమలపాకులు గలవు. వానిని బంగాళా ఆకులని వ్యవహరింతురు. ఇంత పెద్ద యాకు లితర ప్రాంతములం దెచ్చట నగపడవు. కొబ్బరికల్లు మాత్రమిపు డగపడదు. దానిని నేను మదరాసున మాత్రమే చూచితిని. ఈ ప్రాంతమున నిపు డీతచెట్లనుండి మాత్రమే కల్లు తీయుదురు. కొబ్బరి, తాటిచెట్లధికముగ నున్నను వానినుండి కల్లుతీయుటమాత్ర మిప్పుడు లేదు. ఆ కాలపు వర్ణనమునకు సరిపడునట్లు మిక్కిలి పెక్కువగా కొబ్బరి తోటలు, తమలపాకుల తోటలును నిప్పుడును గలవు.

"తతో వేలాతటేనైవ
ఫలవత్పూగమాలినా,"

అగస్త్యచరితామాశా
మనాశాస్య జయో యయౌ."

కళింగమునుండి పోకచెట్లధికముగా గల సముద్రతీరమునుండి యొక్కమాఱుగా కావేరీ తీరమునకు వెడలిపోయినాడు రఘువు. పై శ్లోకమువలన కళింగము తరువాతనున్న ఆంధ్రదేశము నేల పేర్కొనలేదో సందేహము కలుగక తీఱదు. ఆకాలమున నాంధ్రసామ్రాజ్యము లేదనుటకు వీలు లేదు. అతనికి కొంచెము ముందుగనో, వెనుకనో ఆంధ్రులు మగధను పాలించిన కాలమున్నది. అతి ప్రాచీనకాలము నుండియు నాంధ్రసామ్రాజ్య మవిచ్ఛిన్నముగ సాగుచునే యున్నది కావున నక్కాలముల విడచిన ట్లాంధ్ర రాజన్యులన నాదరింప వీలులేదు. వర్ణించె నందమా—కనబడలేదే — అనిపించుచున్నది. సూక్ష్మముగ బరిశీలించిన "ఫలవత్పూగమాలినే లాతట" పదముచే నాంధ్రదేశము కథితమయిన దని తోచుచున్నది. కృష్ణా గోదావరీ పినాకి న్యాది నదీతీరములందు పూగనారికేళాదివనము లీనాడు నేత్రపర్వము గావించుచున్నవి యీనాడు నుండెననుటకు సందేహము లేదు. శ్రీనాథుడు భీమఖండమున దక్షారామాది ప్రదేశములందు నారికేళాదివనములు ముమ్మరముగ నున్నట్లు వర్ణించినాడు. కావున శ్రీనాథుని కాలమునకు ముందుగూడ కోనసీమ మొదలగు సముద్రతీరములందు నీ వనము లుండియే యుండును. కాళిదాసు యేకారణముననో యాంధ్ర రాజన్యుల జయాపజయములు రెంటిని వర్ణింపక విడచి భంగ్యంతరమున నాంధ్రదేశ వైభవముమాత్ర మగ్గడించినాడు.

"మారీచోద్భ్రాంతహారీతా
మలయాద్రే రుపత్యకాః."

మలయగిరి ప్రాంతములు మిరియపు తీవలందు నెగురుచున్న హారీతపక్షులతో గూడినవట. హారీతములనగా గోరలని యందురు. వానికి మిరియములుగాని మిరపకాయలుగాని యీకాలమందును మేపుదురు. హారీతములకు మిరియములు, మిరియపు తీగలచిగుళ్లును మిక్కిలి ప్రియమైన యాహారము. ఆ మిరియముల పంట యీనాడును నా మలయ ప్రాంతమున గలదు. మరియు గుఱ్ఱముల గొరిజలచే నలిగిన యేలకిపండ్ల ధూళి మదగంధము గల యేనుగుల గండములందు పడినదట. మలయమున నేలకులపంట యీనాడును ప్రసిద్ధమే కదా! మఱియు చందన ద్రుమములు నా పర్వతమున విశేషించి కలవట. నేడునక్కడ గంధపు ప్రాకులు విస్తారముగ నున్నవే కదా! పై విషయములన్నియు నాతడు కనులార చూచినవి చూచినట్లు వర్ణించినవే కాని కేవలము వినికిడివలన వ్రాసినవి కావనుటకు సంశయము లేదు.

'తామ్రపర్ణీ సమేతస్య ముక్తాసారం మహోదధేః':-తామ్రపర్ణీనదిసాగరగామినియగు ప్రాంతమున మంచిముత్యములు లభించుట యిపుడును గలను కడలూరు ప్రాంతసముద్రమునం దక్కనింకెక్కడను సముద్రమున ముత్యములు లభించుటలేదు. ఇది యీనాడు నానాడు కూడ నిట్లే యున్నది. ఇది కవిస్వానుభవముమీద వ్రాసిన మాట కాదా?

"మురళామారుతోద్ధూతమగమత్కైతకం రజః":—కేరళమున మురళ లేక మురళీయను నది యున్నదట. ఇది పురాణ ప్రసిద్ధ మహానది కాదుకదా! కవి స్వయముగ దాని జూడకున్న నానదిని దాని యొడ్డుననున్న కేతకీ కుసుమములు నెట్లు వర్ణింపగలడు. ఆ ప్రాంతమున రాజతాళి (శ్రీతాళ) వనము లీనాడును బ్రసిద్ధములే. పున్నాగములు, ఖర్జూర తరువులుగూడ బ్రసిద్ధమైనవే. కవి వీనినెల్ల స్వయముగ నెఱింగియే గ్రంథస్థములు గావించినాడు.

"పారశీకాం స్తతో జేతుం ప్రతస్థే స్థలవర్త్మనా":— పశ్చిమదేశములనుండి పారశీకదేశములకు భూమార్గమున వెళ్లెనని వర్ణించుటవలన కవికి సముద్రముపై నౌకామార్గముగూడ దెలిసి నదేయని మన మూహింపగలము.

పాశ్చాత్యులగు పారశీకుల కశ్వసైన్యము లధికముగా గలవనియు, నారాజులు గడ్డములు మీసములు పెంచెడివారనియు నాదేశమందు ద్రాక్షతోటలెక్కువగా నున్నవనియు చక్కని చర్మములందు గూర్చుండి ద్రాక్షామధువు నా దేశీయులు పానము చేసెడివారనియు వర్ణించుట కేవల పురాణ పరిజ్ఞానమున సంభవింపదుకదా! కవి యాప్రాంతము స్వయముగ చూచినదగుట నిర్విశంకము.

"వినీతాధ్వశ్రమాస్తస్య
సింధుతీరవిచేష్టనైః"
దుధువుర్వాజినస్స్కంధాన్
లగ్నకుంకుమకేసరాన్."

ఉత్తరప్రదిక్కునకు వెడలునపుడు సింధునద సైకతముల నాతనియశ్వములు పొరలాడునపుడు వాని స్కంధములందు కుంకుమ కేసరములు తగులుకొన్నవట. ఆదేశమున హూణులు కలరట. పారశీకమునయవనులు గలరట.

"కాంభోజాః సమరే సోఢుం
తస్యవీర్యమనీశ్వరాః,
గజాలాన పరిక్లిష్టైః
అంక్షోటైస్సార్థమానతాః"

కాంభోజదేశమునం దంకోలవృక్షము లధికముగానుండుట పురాణప్రసిద్ధముగదా? ఎవడైనను దాను జూడనివిషయమును జూచినట్లిట్లు వర్ణింపగలుగునా?

"చకంపే తీర్ణలౌహిత్యే
తస్మిన్ప్రాగ్జ్యోతిషేశ్వరః,
తద్గజాలానతాం ప్రాప్తైః
సహ కాలాగురుద్రుమైః"

హిమవంతమునుండి ప్రాగ్జ్యోతిషమున కేగు మార్గమున లౌహిత్యయనునదియు, నాదేశమునందు కాలాగరు తరువులు నత్యధికముగాగలవట. ఇంతవఱకును బేర్కొన్న విషయములు రఘుదిగ్విజయ యాత్రాసందర్భమున దెలుపబడినవి. ఇంక నితరస్థలములందలి విషయములు గమనింపుడు.

పాండ్యదేశమునకు ఉరగాఖ్యపురము రాజధానియట. అది యిపుడు నాగపట్టణమను పేర గలదు. అతనిచే వర్ణింపబడిన కళింగనాథుడు హేమాంగదుడు. అతడు మహేంద్రపర్వతములకును నుదధికిని ప్రభువు. తన శయనమందిరమున గవాక్షములనుండి చూచిన సముద్రతరంగము లగపడును. సమీపముననున్న సముద్రపు హోరువలన నాతనికి యామతూర్యముల (నగారా) యక్కరలేకుండెనట. సముద్రతీరములందు తాళవనములచే మొరమొర చప్పుళ్లుగల యాతని యుద్యానములందు ద్వీపాంతరములనుండి లవంగపూవులను దెచ్చెడి కమ్మతెమ్మెరలు వీచునట. మహాభారతమున కళింగరాజు రత్నాంగదుడని పేర్కొనబడినది. అతని కూతురు చిత్రాంగద నేకర్ణుడు రాజుల నెల్లజయించి స్వయంవరమున దుర్యోధనున కర్పించినాడు. కళింగరాజుల నొక్కరీతినే పెక్కుర నామము లుండుట ప్రసిద్ధము. గంగావంశమున ఇంద్రవర్మ మహేంద్రవర్మ రాజేంద్రవర్మ దేవేంద్రవర్మేత్యాదులు. గంగవంశమున ప్రాచీనులు గుణార్ణవ దానార్ణవ కామార్ణవ రణార్ణవ మధుకామార్ణవాదులు. తరువాతివారు, ముగ్గురు వజ్రహస్తదేవులు, పెక్కురు అనంతవర్మలును బేర్కొనబడిరి. వీనినిబట్టి కాళిదాసునకు హేమాంగదుడు పరిచితుడేమోయను నూహమున కవకాశము గలదు. నేడా రాజవంశములు నాసామ్రాజ్యములు, నాద్వీపాంతరలవంగపుష్పానయనములు లేకున్నను మిగిలినవన్నియు నున్నవియే. ఇప్పుడిపుడు పురావస్తు రక్షక శాఖవారిచే త్రవ్వింపబడుచున్న సాలెహుండముకడ పూర్తిగా బయలుచేసినయెడల నానాటిదే కాకయంతకు బహుకాలము ముందటిదగు కళింగరాజ ప్రాసాదమును మనము చూడగలుగుదుము. సాలెహుండము వఱకు కడలి తరగలు వచ్చుచుండుట యిప్పుడును గలదు. కనుక నీ విషయము లెల్ల కవి చూచినవియే యగును.

లంకనుండి జనస్థానమునకు విమానముతో సముద్రము దాటివచ్చుచు రాముడు సీతతో

"తవాధరస్పర్థిషు విద్రుమేషు
పర్యస్తమేతత్సహసోర్మివేగాత్,
ఊర్ధ్వాంకురప్రోత ముఖం కథంచిత్
క్లేశాదపక్రామతి శంఖయూథమ్."

తరగల వేగముచేఁ బగడపు మొలకలందు దగులుకొన్న శంఖములు చాలసేపటికిగాని పైకి పోలేకున్నవి అని చెప్పినాడు. దక్షిణసముద్రమున ప్రవాళద్వీపములుండుట స్వయముగా జూడకున్నచో వాని మొలక లూర్ధ్వముఖములుగా నుండుటయు, వానియందు పురుగులు చచ్చి నీటిపైని దేలుచున్న శంఖములు దగులుకొనుటయు వర్ణింపగలుగునా?

కాఁబట్టి యాతడు చూచిన విషయములనే యత్యంత మనోహరముగా వర్ణించియున్నాడనుట నిక్కము. కావుననే యా మహాకవి కవిత యనన్యాదృశమై జగద్గేయమానముగా నున్నది; అతడును ఏకైక కవియను ప్రఖ్యాతి నందినాడు. నేటికాక యింక ననంతమగు భావికాలమునగూడ నతని వర్ణనములు ప్రేక్షకులకక్షిగోచరములుగా, నజరామరములుగా నుండగలవు.



**పదాల పుట్టు పూర్వోత్తరాలు :**

# తెలుగు పలుకుబళ్ల పుట్టుక

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు.



దేశీయంబగు తెలుగుభాషలోని పలుకుబళ్లు, పదబంధాలు ఏర్పడిన రీతిని పరిశీలించినట్లయితే, ఇవి యీ భాషలోని తత్సమతద్భవ శబ్దము లేర్పడినరీతినే యేర్పడి యుండునా, లేదా యని వేరువిధాన నేర్పడియుండునట్లు తోచునాయను విషయమును కనిపట్టి నిర్ధారణ చేయుట కవకాశ మేమైన కనబడునేమోయను నాశతోనే యిదివరలో పలుకుబళ్లు, పదబంధములను గూర్చిన పరిశీలనము కొంత చేయబడినది. దీనినిబట్టి చూడగా నీ భాషలో ముఖ్యముగా అర్థభేదమును సూచించుటకై ధాతువుపై ధాతువునో, శబ్దముపై శబ్దమునో చేర్చి, ధాతుపల్లవము లనువానినో శబ్దపల్లవము లనబడు వానినో కల్పించుట ఈ భాషలో నతి ప్రాచీన పద్ధతియని తెలియవచ్చుచున్నది. ఒక ధాతువుపై మరియొక ధాతువు చేరినప్పుడు కాలక్రమమున వాని స్వరూపములో ననేకవిధము లగు మార్పులు కలుగుచుండ టయు కద్దు. ఏయే యర్థమునం దేధాతువు దేనితో జేరి యెట్టి రూపము నొందినదో పరిశీలించి కనిపెట్ట గలిగినచో, నీ భాషలోని ధాతువుల మూలరూపములను గూడ కనిపట్ట నవకాశ మేర్పడును. కొన్ని సందర్భములలో నీ భాషారూపములతో పోల్చి చూచినంత మాత్రమున దాని మూలరూపము లేవో కనిపట్టుటకు సాధ్యము కాకపోవచ్చును. అట్టి సమయములలో సన్నిహిత భాషలలోని రూపములతో బోల్చి చూచినచో వాని పరిణామ క్రమము సుబోధంబై మూలధాతు స్వరూపమును కనిపట్టు నవకాశ మేర్పడవచ్చును. ఇట్లు పరిశీలించుటచేత నే తెలుగు భాషలో నిప్పుడు మనము ధాతువులని వాడుకొనుచున్న రూపము లనేకములు మూలధాతు రూపములు కావనిన్ని, ధాత్వంతరసంయోగము చేతనో, భృశార్థాదులందు ఒకే ధాతువు యొక్క భిన్నరూపముల కూడికచేతనో, యేర్పడిన ధాతుపల్లవము లనిన్ని, తెలిసికొన గలుగుచున్నాము.

" యథాప్రయోగంబుగ గ్రాహ్యము " లని వైయాకరణుడు చెప్పిన 'ఇఱ్ఱింకులు, తొఱ్ఱద్రొక్కులు, వఱువట్లు' వంటి రూపములన్నీ ఆయా ధాతువుల ప్రాచీన నవీన రూపముల కలయికచే నేర్పడినవని తెలిసికొనగలుగుచున్నాము. దీనినిపట్టి-ఇప్పటి-'ఇంకు' ధాతువునకు ఇఱంకు-ఇఱుకు అనునది ప్రాచీన రూపముగా నేర్పడుచున్నది. ఇట్లే త్రొక్కు-అను దానికి తుృ్రి-'తుృ్రిక్కు' అనునది వట్టు-వట్టిపోవు-అనుదానికి 'వఱు' (వఱుగు); పీకు-అనుదానికి 'పెఱుకు' ప్రాచీనరూపము లైనట్లు తెలియవచ్చుచున్నది. ఇట్లే-బిఱ్ఱు-బిగియు-లకు, విఱుగు-వీఁగు-లకు నిలుఁ-కు, నిక్కు-లకు, దగ్గిర సంబంధమే కలదు. ఇక ననేక ధాతువులలోని రేఫములు తరువాత చేర్పబడిన ధాతువులో కలిసిపోవుటచే మూలధాతుస్వరూపము తెలియకుండనే పోవుట తటస్థించినది. ఉదా : వర్-వచ్చు, తర్-తెర్-తెచ్చు, పుర్-పుచ్చు, మెఙ్-మెచ్చు, మొదలగువాని సరిపోల్చి చూచినగాని, కేవలము ధాతువులుగానే పరిగణింపబడుచున్న 'వచ్చు, పుచ్చు, మెచ్చు' అనువానిని బట్టిచూచినచో, వీని పూర్వరూపములలో నొక రేఫముకూడ నుండెనని యూహించుటకే అవకాశము కలుగదు. ఈ భాషలో వీనికి సంబంధించిన కొన్ని యితర రూపములతోగాని, ఇతర సన్నిహిత భాషలలోని ధాతురూపములతోగాని, పోల్చిచూచినట్లయితే ఇవి వాస్తవముగా ధాతుపల్లవములే కాని మూలధాతువులు కానేకావని మనకు తెలియకపోదు.

ఇట్లే తెలుగున రేఫసంయుక్తవ్యాంజనరూపమగు సంయుక్తాక్షరము తొలివర్ణముగా గలిగిన యనేక ధాతువులు - శబ్దములునుగూడ, నీ భాషలలోని మూలధాతువులు లేదా శబ్దములు కావనియు, పదాదియందు సంయుక్తాక్షర ముండుట ద్రావిడభాషా సంప్రదాయసిద్ధమే కాకపోవుటచేత-నీ భాషలోని రూపములన్నీ వర్ణవ్యత్యయాది సంస్కార ఫలితముగా నీ

భాషలో నొక కాలమున నేర్పడినవేగాని, మూలభాషా స్వరూపమునకు జెందినవిమాత్రము కావని గ్రహింపవలసియుండును. అట్టి యప్పుడు మన భాషలోని త్రొక్కు, త్రోయు, మ్రోగు, వ్రాయు, క్రుంగు, క్రోలు, మొదలగు ధాతువులయు; మ్రాను, వ్రేలు, ప్రాలు, పోలు, మొదలగు శబ్దములయు రూపములు మూలరూపములు కావని-అవి తుఱ్-కు తొఱ-యు, ముఱ(ంగు), వఱ్, అను మూలధాతువుల నుండియు; మరన్, విరల్, పఱ, పుఱల్-అను మూలశబ్దములనుండి కాలక్రమమున నేర్పడిన రూపములనియు నిశ్చయింపవలసియుండును. ఇట్లు పరిశీలించినచో పదాదియందు రేఫసంయుక్తాక్షరముతో గూడిన తెలుగుభాషారూపము లన్నియు నీ భాషలో నేదో యొక కాలమున స్వరవ్యత్యయము మూలముగా గలిగిన వర్ణవ్యత్యయమువలన నేర్పడినవేయని వ్యక్తము కాకపోదు ఈ వెనుకటి రూపములకు తెలుగుభాషలో వాడుకపోయి, వానిరూప మతిప్రాచీనకాలముననే మారిపోయి యుండుటచేత-(ఎప్పుడు మారినదో చెప్పుట కష్టమేకాని, తెనుగుభాష చరిత్రలోని ప్రాచీన శాసనయుగమునకు పూర్వమేయని యని మాత్రము-అనగా క్రీస్తుశకారంభమునకు పూర్వమేయని మాత్రము చెప్పవచ్చును)-ఈ తెలుగరూపము లితరసన్నిహిత భాషారూపములతో బోల్చుటకేగాని, వీని పూర్వరూపములను-మూలధాతు రూపములను-కనుగొన శక్యమగుటలేదు. అనగా నీ రూపములు శాసనయుగమునకు బూర్వమే యేర్పడియుండునని తలంపవలసియున్నది. ఏలయనగా తెలుగు భాషలో రచింపబడిన తొలి శాసనములు లభించినకాలమునకే-లేదా-ఇంకను పూర్వమున, ప్రాకృత సంస్కృత శాసనములలో తెలుగు పదములు లభించిన కాలమునకే యిట్టి మార్పులు కొన్ని కలిగినట్లు తెలియవచ్చుచుండుటచేత, శాసనకాలమునకు పూర్వమే, తెలుగుభాష తక్కిన ద్రావిడభాషలనుండి విడివడిన తరువాత-గల అజ్ఞాతయుగములో నీ మార్పులన్నియు గలిగియుండవలెనని యూహింపదగియున్నది. తమిళ కన్నడములలో నీ తెలుగు శబ్దముల తొలిరూపము లిప్పటికి నట్లే నిలిచియుండుటచేతనే, తెలుగుభాష కాయజ్ఞాతయుగమున గలిగిన ఏదో యొకవిధమగు సంస్కారముమూలముగా నిట్టిమార్పులేర్పడినవని తలంపవలసియున్నది.

పైని తెలిపిన స్వరవ్యత్యయ మూలకమై వర్ణవ్యత్యయ రూపమగు మార్పు పదాదిని సంయుక్తాక్షరమును దెచ్చిపెట్టుటలోనేకాక ఇంక నితరవిధములగూడ మూలభాషారూపము లీ భాషలోమారి పోయినవి. మూలభాషలోని యనేకములగు నజాది శబ్దముల నీ భాషలో వాలాదులనుగా భాసింప జేయుట కీమార్పే కారణము. ప్రథమపురుష సర్వనామమునందలి ప్రాచీన రూపములగు అవన్, ఇవన్, ఎవన్-అనునవి వాండు, వీండు, ఎవణ్డు-అగుటకు, అదిని-దాని, ఇదిని-దీని, ఎవనివేనియగుటకును ఈపరిణామమే కారణము. అవన్, ఇవన్ మొదలగు రూపములట్లే యితర సన్నిహితభాషలలో నిలిచియున్నవి. కావున నాభాషలనుండి తెలుగు విడివడిన తరువాతనే, యీమార్పీభాషలో ప్రత్యేకముగా గలిగినదని యూహింపగలుగుచున్నాము. ఈ మార్పునకు లోనైన యితరశబ్దము లనేకములు కలవు. కొన్నింటి మార్పు ఈ భాషలోనే-అనగా జ్ఞాతయుగముననే జరిగినట్లుకూడా తెలియును. ఏమనగా రెండురూపములకు గూడ నీభాషలో ప్రయోగము - వాడుక - గానవచ్చుచుండుటయే దీనికి గారణము.

అఱచు-ఱచ్చు-డచ్చు, అడగు > డాగు
అఱసినపాపంబు-దీని ఱచ్చువాస్తు.

త. అత్తై > టా-టాయి=శిల.
త. ఇరా-తె-రేయి.
త. ఇఱక్కై-తె-ఎఱక, ఱెక్క.
క. ఇఱయన్-తె-ఱే-ఱేడు.
త. ఉగిర్ / ఉగురు } తె-గోరు.
త. ఉళ్-తె లో-లోఁతు, లోపల మొదలగునవి.
త. ఇళై-ఎళె-తె-లేత; ఎలమావి>లేమావి.
త. ఇఴుంగు-తె-డిగ్గు, డిగు > దిగు.
త. ఇరండు-తె-రెండు.
త. ఉరల్-తె-ఱోలు.
క. ఉదుర్=తె-రుద్దు=ఉరుబు-తె-రుబ్బు.
త. ఉరోంగల్=తె-ఱోఁకలి.

పైవానిలో ఎఱక>తెక్క, ఎఱ>తే, అడగు >డాగు అనునవి భాషలో కనబడినను, పెక్కింటి మూలరూపములు తెలుగు భాషలో కనబడనే కనబడవు. కావుననే వీని పరిణామ మజ్ఞాత యుగమున కలిగినదని చెప్పవచ్చును. ఏమనగా, నీ తుదిరూపమును జూడుడు. ఇది-ఉరు(బు)+కల్ అను రెండు శబ్దముల కలయికచే నేర్పడిన శబ్దపల్లవము-లేదా సమాసము. తమిళమున నీ శబ్దము హలంతము (ఉరోంగల్). తెలుగున నిది 'రోంకలి-రోకలి-అని ఇకారాంతమైనది. 'రోంకల్' అని దీనికి భాషలో ప్రయోగమును గానము. తిరుగలి-కూడ ఇట్టిదె తిరు(గు)-కల్ (కల్లు) తుదిని ఇకారము చేరినది, తిరుగలియైనది. పిండి మొదలగువానిని "విసురు" కొనుటకుపయోగించునది ఇప్పటికిని 'తిరుగుకల్లు' తిరుగలియేయైనా,-ఆ కల్లును (రాతిని) విసిరి (=విసురుగా) త్రిప్పుటవల్లనే యిప్పటికిని మనము పిండి, పప్పు మొదలగువానిని తయారుచేసుకొనుచున్నా (ఈ కల్లును, రాతిని విసురుగా త్రిప్పుటవలననే-పిండివిసురుట-అను పలుకుబడి యేర్పడినదనుట స్పష్టము), ప్రస్తుతకాలమున మనము దంపుటకుపయోగించు "రోకలి"లో మాత్రము "కల్లు" రాయి కానవచ్చుటలేదు. ఈ కాలమున చాలవరకుపయోగములో నున్న "రోకళ్లు" కొయ్యరోకళ్లే. దేశమున గొన్ని ప్రాంతముల నెచ్చటనైనా-కొండప్రదేశములో-రాతిరోకళ్లుకూడ వాడుకలోనున్నవేమో కాని తొలుతటి కాలములో రుబ్బు-రోలు వలెనే. 'రోకలి'కూడా కొయ్యతో చేయబడినదిగాక, 'కల్లు'-రాతితో జేయబడినదిగానే యుండుననుటకు సందేహములేదు. రాతి రోకళ్లు ఎత్తి దంపుటకు బరువుగానుండును గనుక-కొయ్య రోకళ్లు వాడుకలోనికి వచ్చియుండును. రుబ్బు, రోలు-శబ్దములు రెండునుగూడ ప్రత్యేకముగా తెలుగుభాష తక్కిన జాతీయ భాషలనుండి విడివడిన తరువాత నేర్పడినవే. ఏమనగా పదాదిని రేఫముగాని శకటరేఫముగాని లకారముగాని వచ్చుట ద్రావిడభాషా సంప్రదాయమే కాదు. కాబట్టే-సంస్కృత శబ్దములు తమిళ కన్నడములలోనికి వచ్చునపుడు, పదాది రేఫలకారములముందు 'అ, ఇ, ఉ' అను వర్ణములు చేరుచున్నవి. వీనిని Prothetic vowels-అని ఆధునిక భాషా తత్త్వజ్ఞులందురు. కావుననే సం. రాజన్-త. అరశన్, క. అరసు (cf అరసు మనె) త. (అరసాంగం<రాజ్యాంగం), సం లోకం—త. క. ఉలగం - ఈరీతిగా మార్పునొందుచున్నవి. ఆంగ్లభాషలోని 'స్కూలు' అను శబ్దమును పలుకలేని-అనగా సంయుక్తాక్షరమును పదాదిని పలుకలేని-సామాన్యజనులు, దానిముందొక 'ఇ' కారము నూతనగా జేర్చికొని 'ఇస్కూలు' అని పలుకుచుండుట మనమందర మెరిగినదే. అయితే తెలుగుభాషాజనులు చిరకాలము క్రిందటనే సంస్కృతభాషా వర్ణోచ్చారణ రీతుల కలవడిపోవుట చేతను గాబోలు, పదాదియందు రేఫలకారోచ్చారము విషయమున వీరికి కష్టము తోచినట్లు కనబడదు. రాజు, లోకము మొదలగు వానినట్లే గ్రహించి పలుకగలుగుటయే గాక, మూలభాషలో నజాదులైయున్న పెక్కుశబ్దములను వర్ణవ్యత్యయముచే, రేఫలకారాది శబ్దములనుగాజేసి పలుకు సంప్రదాయమున కలవాటుపడిన వారుగాకూడ నైరి. ఈ కారణముచేతనే-త. అఱై-అనగా అరగదీయు-అనునర్థముగల ప్రాచీనభాషలోని ధాతువునుండి తెలుగులో "ఱాయి" అను నామవాచకశబ్దము. పదాదిని శకటరేఫము నేర్పడి వ్యవహారములోనికి వచ్చినది. అఱై-త. క. ఉఱై-ఉను (to rub-) అను ప్రాచీన ధాతువునుండి-తెలుగులో వర్ణవ్యత్యయము మూలముగా "రుబ్బు" అను ధాతువున్ను త. ఉరల్. క. ఉరులు = దొర్లు (to roll) అను మూలధాతువునుండి 'రోలు-' అను ధాతువును తెలుగులో నేర్పడినవి. పిండి మొదలగువానికి రుబ్బుకొనుటకు, ధాన్యాదులను దంచుకొనుటకు నుపయోగపడు పెద్ద రాతిని గుండ్రముగాజేసి దొర్లించుటయే సుకరము గావున నట్లు దానికి 'రోలు' అను పేరు వచ్చినట్లున్నది. కాని వాస్తవముగా దొర్లింపబడు కల్లు-రాయి-ఇదే గావున దీనికే-"ఉరోంగల్"-అను పేరు వచ్చియుండవలసినది. ఒకవేళ ప్రాచీనకాలమున నట్లేయుండి, "రోలు" అను పేరు దీనికిస్థిరపడినతరువాత, ఉరోంగల్-'రోకలి' అనుపదము దంచే సాధనమును సూచించునదైనదేమో! ఎట్లయినను నన్నిచోడుడు కుమారసంభవము రచించునాటికే ఆటవికులగు శబరకామినులు ముత్యెదురు బ్రాలు దంచుకొనుటకు పటికపుఱోళ్లు, గారుకొమ్మురోకళ్లు

వాడుచువచ్చినట్లు తెలియవచ్చుచున్నది.(కు.సం. 6 ఆ.47) కాబట్టి అప్పటికే 'ఉరోంగల్'-రో౯ కలి-లోని "కల్లు" సాధమును గొరుకొమ్మో, కొయ్యో, ఆక్రమించుట తటస్థించినట్లగుపడుచున్నది.ఇక నీరోకలి-తిరుగలి-శబ్దములవలెనే-కల్లు శబ్దముతో గూడిన 'వడగల్లు-ఓరుగల్లు-చెంగల్లు' మొదలగు వానిలో నీ పదబంధము ఇకారాంతము కాలేదు. 'కల్' అను హలంతపదము ఊతగా తుదినొక ఉకారమును గ్రహించి "కల్లు"-అని మాత్రము అయినది. మరికొన్ని పదబంధములలో-లేదా తెలుగు సమాసము లనదగినవానిలో నీ తుది ఇకారము కనబడుచున్నది. 'వాకిలి-' అనునదొకటి-ఇది-'వా+ఇల్" అను శబ్దముల కూడికచే నేర్పడినది. వాశబ్దము వాయ్-వాయి అనుదాని యవశిష్ట భాగంబై 'నోరు' అను నర్థము కలదు. కావున 'వాయిల్' అనగా - వాయ్+ఇల్=ఇంటి యొక్క వాయి (నోరు) అనగా ప్రవేశమార్గము అనునర్థము. వాయిల్ - అనునదే తమిళమున 'వాశిల్-వాశల్' అను రూపమున గానవచ్చుచున్నది. కాని తెలుగులో 'వాకిలి' అని 'క' కారము మధ్యవచ్చుటకు గారణమగపడదు. 'వాయి' శబ్దము శ. ర. కారుడన్నట్లు వైకృతమనుటకు గారణమగపడదు. వాకట్టులో 'వా' వైకృతమే కావచ్చును. ఇంతకూ 'వాకిలి' లోని 'ఇ' సంబంధార్థ ద్యోతకమేమో. 'వాయిల్' లేదా 'వాకిల్'యొక్క తలుపు వాయిలి తలుపు-వాకిలి తలుపు కావచ్చును. ఇట్లు విశేషణత్వద్యోతకములైన రూపములే విశేష్యములుగాగూడ వ్యవహారములోనికి వచ్చుటకద్దు. 'ఒకడు' నుండి 'ఒకటి' ఔపవిభక్తిక రూపముకాగా-ఆ 'ఒకటి'యే మరల అమహద్వాచక విశేష్యము-గా వ్యవహారములోనికి వచ్చినది. ఇట్లె మూడుకన్నులు కలవాడు "మూక్కణ్">ముక్కణ్. మూక్కణ్-మూడుకన్నులు గలవాడైన - దొర=ప్రభువు-దేవర = ముక్కంటిదొర, ముక్కంటిదేవర-అయినది కాని 'ముక్కంటి' యను నీ యౌపవిభక్తికరూపమే - విశేష్యముగా వ్యవహరింపబడుచు శివుడు అను నర్థమిచ్చుచున్నది. ఇందలి తుది ఇకారమును సమాసాంత విధిగాగూడ వైయాకరణులు గ్రహించుటకు వీనుదీయదు. అట్లే "అలరువిల్తుడు"-అలరు విల్లుగాగలవాడు అలరువిల్,విల్లు-కలవాడు-విల్తుడు ? తలవరి-తమి-తలైవర్. (Head-man) తె-తలవరి > తలారి. "మహాతలవర" అనునది ఇక్ష్వాకు రాజుల శాసనములలో 'మహాదండనాయక' అను బిరుదముతో సమానమైన యొక బిరుదముగా పేర్కొనబడియున్నది. దేశ్యశబ్దమైనను బిరుదముగా గ్రహింపబడుటచే గాబోలు సంస్కృత శబ్దముతో సమసించినది. "అవర్" అనుదానినుండి యేర్పడిన 'వరి' అను దానినుండి ఒక ప్రత్యయముగా విడదీయబడిన 'అరి' అను దానితో గూడినవే కావచ్చును.- నేర్పరి, కూర్పరి, వెరవరి, మేపరి, కాపరి, నీరుద్రిమ్మరి, నుడువరి, పొదుపరి మొదలగు శబ్దములు. మోవి అనునది-మో+వాయ్'అను శబ్దముల కూడికచే నేర్పడియుండును. ముఖమునకు ద్వారము వంటిది గావున "మోవి" ఇక్కడ 'వాయ్' అనునది 'వి' అయినది. మరికొన్ని పదబంధములలో నది 'వ' కారముగనే నిలిచినది. చిలువ-చిలుము (కిలుము)=విషము - వాయియందు గలది. ఆశీవిషము-పాము. పలవ=పలు+వాయ్ = బహుముఖములు గలది. నలువ=బ్రహ్మ - నలు+వాయ్=నాలుగు ముఖములు కలవాడు. నడవ=నడు+వాయ్=నడచుటకు మార్గము (మధ్యమార్గము) కడవ=కడు+వాయ్=పెద్ద (వెడలుపైన) నోరుగలది=బాన తెలువ=తెలు+వ = తెలుపియైననోరుకలది-స్త్రీ ఇట్టిపదబంధములలో 'వాయ్' శబ్దము 'వ' కారమై నిలిచినది. ప్రాచీనభాషలో హలంతము నీ 'వాయ్'-తెలుగులో 'వాయి'-అని ఇకారాంతమైనట్లే-ఇంక ననేకములగు హలంత శబ్దము లీ భాషలో ఇకారాంతములైనవి. ఉ. త. క. కడల్=సముద్రము-కడలి,త. కాల్-కొట్టు=గాలి, వే-వెయ్-వేయి=సహస్రము. నో. నోయ్=కన్న-నోవు=pain=నొప్పి. త, నాయ్=dog. నాయి. cf-కాక-కాకి=crow సర్వనామములలోని అవు, ఇవు, ఎద-తె.అది, ఇది, ఎది. ఇట్టి భాషలోని పెక్కుపదముల యొక్కయు పదబంధములయొక్కయు తుదిని ఇకారము బహుళముగా గానవచ్చుచున్నది. మరియొక విశేషమేమనగా నీ భాషలోని ప్రాచీనపదబంధములు సామాన్యముగా రెండిటికంటె హెచ్చుపదములతో గూడినవిగా గానరావు. అచ్చతెనుగు భాషారచనా సంప్రదాయము ప్రబలిన వెనుకనె దీర్ఘములైనదేశ్యసమాసములు వాడుకలోనికి వచ్చినట్లగపడుచున్నది.

# పాత్రలతీర్పులో ముక్కుతిమ్మన నేర్పు: రామభద్రునిశయ్యలో ఒయ్యారం

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు



పారిజాతాపహరణకర్త సింగనామాత్యుని కొడుకు తిమ్మాంబ తల్లి. ఈ కవికి ముక్కు తిమ్మన యని పేరు. పేరునకు వెనుక లొక పెద్దకథ. పనిలేని కథల కోటమరాజులు ఆ యపభాండమును భట్టుమూర్తిపైఁ బెట్టినారు. మన తిమ్మన ముక్కుపై వ్రాసిన యొక చక్కని పద్యమును రామరాజభూషణుడు మూల్య మిచ్చి కొని, తన పుస్తకమున నడికించెనఁట! ఆ కవిలో నిట్టికల్పనలు గడవెడు. రెండు గ్రంథములందును నీ పద్యములు గనుపించుట గమనించి, యెవఁడో తీరికయున్న బీరప్ప యీ జల్లెడ నల్లియుండును.

తిమ్మన కౌశికగోత్రుఁడు, ఆపస్తంబ సూత్రుఁడు మలయమారుత కవీంద్రుని మేనల్లుడు. అఘోర శివసుకుని శిష్యరికమున నెదిగినవాఁడు. శివపరాధనమతి. సకలవిద్యా వివేకచతురుఁడు. కృష్ణరాయకరుణా సమాలబ్ధ ఘనచతురంతయాన మహాగ్రహార సమ్మాన యుతుఁడు. అందఱు కవులును గ్రంథమున కాదియందే తమ 'భోగట్టా' నివ్వగా నితఁడు గ్రంథాంతమున జేర్చినాఁడు. అదియు నొక త్రోవ. నంది తిమ్మయ ఘంటసింగయలు వరాహపురాణమును వ్రాసి సాళ్వనరసింహున కంకిత మిచ్చిరి. వారిలో సింగయకు 'మలయమారుత కవి' యని చెలగిన బిరుదు. వీరిరువురు దొలుతన దయగిరి వారట!

ముక్కు తిమ్మన రాయలకు నరణమున వచ్చిన వాడని యొక జనశ్రుతి. గజపతుల బిడ్డ పేరే తెలియక చరిత్ర తూల్గుచున్నది. ఈ కథ యిక బునాదిలేని గోడయే. కాని యాకాలమున రాజులు రాజులు గ్రుమ్ములాడుకొనుచున్నను, కవిరాజులు మాత్రము, అన్ని సంస్థానములకును బోవుచున్నట్లే దోచును.

తిమ్మన కంటగట్టిన యరణపు వృత్తాంత మిటులున్నను, పారిజాతాపహరణమును జూచి నపుడు, ఆ కవిపై 'సమరాంగణ సార్వభౌముని కంటెను 'చతురాంతఃపుర' మునకే ఆదర మెక్కువయని తోచును. చిన్నాదేవి తిమ్మన్న పక్షమైనపుడు యెంత 'సమరాంగణసార్వభౌము' డైనను వట్టి రాయ లేమిచేయఁగలడు! ఈ మంత్రమాకవి చక్కఁగాఁ బఠించినవాఁడు. అవకాశము దొరకినపుడు అంతిపురపు దాసీలలో నట్టిట్టు గిల్లుకొని సరసములాడెడు వాఁడేమో!

పారిజాతాపహరణము గజపతిని రాయలు జయించుటకుముందే ముగిసి యుండునని నా యనుమానము. ఈ గ్రంథమునందు 'గజరాజు గలగి పరవ' కటకమును గాల్చిన ఘనవిజయము దడవఁబడలేదు గాని 'రాయ లెత్తివచ్చునేమో' యని దినదినమును వడ్డేరాజు వనరివంగురుచున్నట్లు మాత్రము, చెప్పఁబడినది (1-23). 'ఉత్కలభూమీధవదర్పహరణ భుజసార!' యని కృష్ణరాయునిని ముక్కు తిమ్మన సంబోధించినను, ఆనాటికి ఉత్కలభూమీధవుని దర్పము పూర్తిగా చావక తోకలో మిగిలి యున్నది. కాని తిమ్మనమాత్రము చచ్చినదాని క్రిందికే జముగట్టి, యామాటనని వేసెను. అతఁడింకను రాయలనుగురించి 'కోదండద్రోణ!' 'నిస్సామాన్యచాపాగమద్రోణాచార్య' ఇత్యాదు లెన్నియో పొగడినాడు. కాని, యివన్నియు నొకరీతిగా, జంబపుమాటలు. కారణమేమనగా, రాయల నాటికెన్నో వర్షములకుముందే అస్త్రశస్త్రములు యుద్ధభూమినుండి యస్తమించినవి. కాని తిమ్మన పలికిన 'చతురాంతఃపుర వధూప్రసాధవరసికా!' యను విశేషణము మాత్రము, నిజముగా స్వభావోక్తియైయుండును. రాయల యాచాతుర్యము పారిజాతాపహరణ కర్తకు దెలిసినంత, మఱెవ్వారికిని దెలియుటకు వీలులేదు.

కృష్ణరాయలు దనకుఁ గావ్యరచనకై కర్పూరతాంబూలము పెట్టినకథ తిమ్మన కవితలోఁ గానరాదు. ఆచోట గ్రంథపాతమై యుండె నని నాతలంపు.

రాయలు మొట్టమొదట నొనర్చినవి శ్రీరంగపట్టణ యుద్ధములు. వీరనరసింహుడు బ్రదికియున్నపుడే కృష్ణరాయఁడు వీరిపై నొకసారి యెత్తిపోయెను. మఱలఁ దాను గద్దెకు వచ్చినదే దడవు వారిపై దండు విడిసినాఁడు. ఈ కలహమును ముక్కు తిమ్మన బ్రహ్మాండముగ వర్ణించెను. పెద్దన యీ యుద్ధములను దడవనేలేదు. కృష్ణరాయని పట్టపురాణి తిర్మలదేవి. ఆమె తండ్రి వీరశ్యామలరాయఁడు. అతఁడు రాయలకోడి, మరియాదగ మామయైనాడు. ఒకవేళ దాత్కాలికముగా వీరశ్యామలుఁడు రాయల నెదిరించినను, అతని తండ్రితాతలు విజయనగరమును సేవించినవారు. ఆ యభిమానము పెద్దన హృదయమును బెద్దగా బట్టియుండును. అందుచే నాతఁడా యుద్ధమును దడవలేదేమో! ఇంతకును సాళ్వ తిమ్మరుసునకును, కవితా పితామహునకును, రాయల పట్టపుదేవిపై నభిమానమున్నట్లు చూచాయగాఁ దోచును. చిన్నాదేవి కృష్ణరాయఁడు కోరి తెచ్చికొన్న భార్య. ఈ యూహాలతో ముక్కు తిమ్మన చిన్నాదేవి కాశ్రితుఁడా యని యొక యనుమానము. రాయలనాటి ప్రబంధములలో పీఠికాభాగములు చాల వెలగలవి. వానిపై చారిత్రకదృష్టితోఁ గనుమలపి చూడవలెను. అట్లు చూచినపుడు అపురూపమైన విషయములు దోచును. ముక్కు తిమ్మన గ్రంథాదిలో రాయలను కృష్ణునకుఁ బోల్చి యాకాశమున కెత్తినది జూడఁగా, కేదైన నొక యంతఃపుర సంఘటనమే ముక్కు తిమ్మన కృతికి మూలాధారమా!-యనియు ననుమానము గలుగును. రాయలు ప్రతివర్షమునను వసంతములయందు కవితాగోష్ఠులు జరపుచుండెనట! అచ్యుతునకుగూడ నిదే యలవాటు. ఆయనయు సంవత్సరమున కొక క్రొత్త కావ్యమును వ్రాయించి 'తిరువేంగడముడైయానునకు' సమర్పించుచుండెడివాఁడు.

తిమ్మన చిత్తవృత్తి చాల లలితమైనది. పూవులు నలిపిన దట్టుకొనలేదు. దిగులాకు గందిన నోర్వలేదు. అందుకే యాతని కావ్యమంతయుఁ నొప్పింపక తానొవ్వక సాఁగిపోయినది. ఎక్కడో పాతాళలోకమునుండి భావములను చేదుకొనివచ్చి, శ్రమపడి, యితరులను శ్రమపెట్టుటన్న తిమ్మనకుఁ గంటగింపు. అట్లు వ్రాయువారిని జూచినను, అతనికి భయమే. లలితపేశలమైన తిమ్మన్న కల్పన లిట్టివి—

"మ. వనజ శ్రీధనపశ్యతోహరుడు, జీ
వంజీవజీవంబు, ప
చ్చని విల్కానికి మామ, చల్వగని, ప
శ్యత్ఫాల జూటాగ్రమో
హనరత్నంబు, సుధాకరుం డపుడు ప్రా
గద్రిస్థలీవీధి నొ
య్యన దోతెంచె వియత్తటీకషణలీ
లానీత శంఖాకృతిన్."

భావము క్రొత్తదైనపుడు భాషలోనో, భాష కష్టమైనపుడు భావముననో, లాలిత్యము నాతఁడు బాదిగించును. పెద్ద సంస్కృత మర్యాదలు, క్లిష్టాన్వయములు, కష్టములైన కల్పనలు ఆ కవిలోఁ జాల నఱుదు. కాని చిన్ననాఁడు వ్యాకరణము 'భట్టీ' పెట్టియుండుటచే గాబోలుఁ గొన్ని 'అముష్యాయణాది' శబ్దములఁ ఆయనకుఁ దెలియకయే దొరలును. అవియైనను, దెలియక దొరలినవే! అంతటి పెద్ద హిరణ్యకశిపుని యురమును నరసింహుడు హుంకరించి భేదింపగా, ముక్కు తిమ్మన్నకు 'కుంచికలతో కపాటము దెఱచినంతమాత్రమే' సవ్వడి వినవచ్చినది. ఇతర కవులైనచో నిచ్చోట దామే నరసింహులై, గద్దింపులతోనే మనల నామడదూరము బరువెత్తించి యుందురు. దేవేంద్రునితో ఉపేంద్రునకు జరగిన యుద్ధమును ముక్కు తిమ్మన, సుమారేబదిపద్యములతో వర్ణించెను. కాని, యది చాలమట్టుకు యుద్ధమే గాదు. అన్నదమ్ము లిద్దరును ప్రొద్దుపోవుటకై పూలతో నాడికొన్నట్లే యున్నది. యుద్ధమునకుఁ బెడమొగము పెట్టిన యసురుల సైన్యమువలెనే తిమ్మన కవితాలతాంగి 'జగడము'నకు రానని యీడిగిలఁ బడినది. వీరరసమును బోషించుట కాకవి యేమేమియోఁ బాధలు పడును. కాని, మనసునలేనిది మాటకు వచ్చునాయేమి? ఇంద్రుడు కైదువుగొని 'వేయుగన్నులతో గురి పెట్టి, కౌస్తుభ స్తబకితంబగు శౌరియురంబు' వ్రేసెనట! అపుడు లోకములు 'జలదళోదకోదకము' చాడ్పున నల్లలనాడినవి. ఈ పద్యమున

గవివాడిన 'కౌస్తుభ స్తబకితంబు' అను విశేషణమును, అందముగ నల్లిన యలంకారమును వీరరసమును తెలిపినవి. అతని వీరమున శృంగార మనువర్తించుచునే యుండును. ఆ కవి యుద్ధ నిబంధనము చూడుడు.

గీ. "వేల్పు మ్రానియందు వేడుక పడుగూర్మి
సతులకోర్కెఁ దీర్ప జాలియుఁబుడు
హరియుహరియుఁ బోరిరన్యోన్యజయకాంక్ష
నసుర జీవితాపహారకులు"

ఈ పద్యమునందు ఘోరమగు రణసంరంభమున్నదో, రమణీ పరిరంభ సంరంభమున్నదో మీరే చెప్పవలెను, కాని ముక్కుతిమ్మనగూడ ఉండియుండి యొకసారి సమరమున విజృంభించిన సత్యభామాదేవివలెనే అఱుదుగా పాండిత్యమును జూప నుద్యుక్తుఁడగును. సాత్రాజితి చూపిన ప్రత్యాలీఢ పాదమువలెనే బంధకవిత్వ మల్లును. ఏ మూలనుండియో భావములను దెచ్చును. అపుడారచన యిట్లుండును—

ఉ. "పాదపనూతనాంబుధర
పంక్తివిముక్త మరందవర్ష సం
పాదిత శక్రగోపముల
భావమునందుచు నో యదృష్టసిం
హోదర సన్నివేశ ! గడు
నొప్పెడుదాడిమబీజముల్ మదో
న్మాదిత రాజకీరవద
నత్రుటితోరు ఫలచ్యుతంబులై.'

కాని యిట్టిపోకడలు సత్యభామ యుద్ధములే. అఱుదులోనఱుదు. ముక్కుతిమ్మనకు గూడ నప్పుడప్పుడిట్టి సాహసము గలుగుటకు నాటికాలమే కారణము. ఎట్టి సాత్త్వికునైనను పిలిచి మెడపట్టుకు మేల్కొలుపు సాహిత్య వాతావరణ మానాడుండెను.

కావ్యమునందలి పాత్రలను ద్రుతతరముగ నడపించుట యాతఁడు జూపిన యొక నేర్పు. ఈ తీర్పులో కథ శరవేగమున నడచినది. పింగళి సూరన్నయు నీ పద్ధతిలోఁ జాల కుశలుడు. కొందఱిరచనలలో మహారాష్ట్రుల పాగాచుట్టువలె - ఏ వర్ణనమును - ఎంతకును ముగియదు. చదివిచదివి మనకు విసుగై చాలించికొనవలసివచ్చును. ద్వారకాపురము నాతఁడు వర్ణింపక మనల బ్రదికించినాఁడు. ప్రభాత వర్ణనముగూడ వందిమాగధుల స్తుతిలో నెట్టివేసెను. కాని 'గోపాలవల్లభుని' తలయంటు మాత్రము కొండంతయైనది. అది సత్యాదేవి భవనము. అక్కడ నింతకుముందే శ్రీకృష్ణుని శృంగారశీర్షముపై చిన్న భార్య పవిత్రపాదార్పణము నడచి పోయినది. అన్నియవమానములను గౌరవముగ నన్వయించికొని, ఆమె నాతఁడు ప్రసన్నురాలిని జేసికొనువేళకు మధ్యాహ్నము (2-3) పండ్రెండు గంటలయ్యెను. అప్పుడొక దలిరాకుబోడి 'వీణాకలకలముల గలకలనగు' పలుకులతో 'జలకములకు వేళయయ్యె'నన్నది. స్వామిస్నానమునకు లేచినాడు. లేచినదే తడవు అతనిచుట్టును ముసరికొన్నారు - ముద్దుగాడులు. ఇక నేమిచెప్పుట! ఒక్కొక్కతె దన యొయ్యారములన్నియు—ఇట్టి సమయ మిక ముందెప్పుడును రానట్లు—పందెములు వేసికొని కృష్ణునకు జూపినారు. ఆ గడబిడలో నెంత ప్రొద్దుగడచెనో సుఖించుకృష్ణునకుఁ దెలియక పోవుటన్యాయమే. సాగయించు పరిచారికలకుఁ దెలియకుండుటయు నిజమే. వచ్చిన బాధ యేమనగా మనకును దెలియదు. దీనికి గారణము ముక్కుతిమ్మన 'యెంతప్రొద్దయ్యె'నో చెప్పక పోవుట. మనవేధ యెట్లున్నను నారదుని కానాడు ప్రాణము కసిగిపోయినది. అతని కాపూట సత్య యింటనె భోజనము. తనమజ్జనాది మాధ్యందినకృత్యములు రుక్మిణీయంతఃపురమున జిటికెలో ముగించికొని వచ్చినాఁడు. అయిన నేమి! సత్యాకృష్ణుల స్నానమహోత్సవము ముగిసినగదా దనకు భోజనము! సత్య యొక నారదునకు చేసిన యపరాధమునకు శిక్ష యక్కడనే వడ్డీతోఁగూడఁ జెల్లిపోయినది. ఇంతకును, ఆనాడు గోపీజనవల్లభుడు తలంటును దొందరగ ముగించియున్న బాగుండెడిది.

స్వర్గలోక విషయమున గూడనంతే. సత్యభామాదేవితోఁ గృష్ణభగవానుఁడు అమరావతికి వెళ్ళినాడు. అక్కడ వారికిశాస్త్రప్రకారము పుష్పాపచయము, జలక్రీడలతో రెండురోజులు గలియకవే గడచెను. మూడవరోజు పారిజాతమును కృష్ణుఁడపహరించినాడు. ఆ మధ్యాహ్నమంతయు జంభారిలో యుద్ధము గానియుద్ధము నడచినది. ఆ సాయంకాలము 'పసులకాపరి' యింటికి వచ్చివేసెను. ఇచ్చోట నొక్క పద్యమున సంధ్యాకాలమును సూచించి యున్న బాగుండెడిది లేక ఆదినముననే పారిజాతమును నాటుటయు జరిగినదేమో! ఆ విషయ

మైనను గొంత వివరించియుండిన మన చిక్కవదలి యుండెడిది.

ఈ గ్రంథమున దశావతారస్తుతి యున్నది. దానిని గావించిన దతిలి. ఆమెకుఁ గుండలము లిచ్చు నెపముననే యాదవసార్వభౌముఁ డమరావతికి వెళ్ళినది. ఆపె గృష్ణునతోక రీతిగా జనని. 'అమరమాక్రికకు క్రి' పోయినవెంటనే గృష్ణుఁడు భార్యతోఁగూడ నదితికి నమస్కరించినాఁడు. ఆపె 'మే నిమిరి శిరసుమూర్కొని' యాశీర్వదించెను. తరువాత స్తుతి కొత్తిగొన్నది. అపుడు దేవేంద్రుఁ డచ్చటనే యున్నాఁడు. ఇంత బ్రహ్మాండమగు బ్రస్తుతిని చెవులు దెఱచి కొని విన్న దేవేంద్రుఁడు మాఁడవదినమే గృష్ణునిపైఁ గత్తిగట్టెనట! ఇంతకన్నను గవ్యమున నోడిన దేవేంద్రునిచే సాష్టాంగనమంతయుఁ జేయించియుండిన బాగుండెడిది.

తిమ్మన్నగారి హాస్యముగూడ వారి శృంగారమంత లలితమైనది. వ్రతమునుజేసి, సత్యాదేవి 'సత్యాభామా విధేయుని' 'సమర భోజనుని'కు దానమిచ్చినది. అపుడామె శ్రీకృష్ణులను 'వేల్పుమ్రానిపూదండల'చేఁ గట్టెను. అక్కడనే యున్న సత్యాదేవి దాసీలు లీలాయాదవుని నీరీతి మేలమాడిరట!

చ. "బలిదనుజేంద్రు గట్టితని
వల్కగ వినుదుముగాని నేడు మా
చెలియాపుష్పదామకము
చే నినుగట్టగఁ గంటిమింక నె
మ్మెలు పచారింపరా దనుచు
మేలములాడెడు సత్యబోట్ల
సన్నల నెస కొల్పుచుణ.."

ఈ మేలమున వామనక బురాణగాథను గూడ ద్రవ్వినారు. వాఁకును, అదితిలో న్యూము జదివికొన్నట్లున్నది. 'పరమముని' నవ్వుటాలకు శ్రీకృష్ణునితోఁ బసలు గొన్నఘట్టముగూడ చక్కని హాస్యమున కుదాహరణము. కాని పీరెవ్వరికిని తెనాలి రామకృష్ణునివలె 'హాస్యము'ను బోషించువిద్య దెలియదు. హాస్యపోషణమునందు తెనాలి కవికి పీసము దక్కవపింగళి సూరన్న.

ముక్కు తిమ్మన యే సన్నివేశమును జిత్రించినను, యే పదార్థములు వర్ణించినను, 'ప్రియాప్రియు' లెట్లో యక్కడఁ జోటుగలుగఁజేసికొందురు. శృంగారరసముపై నాతనికంత ముక్కువ. కాని తిమ్మనకవి భావము తెప్పునను అంతఃపురముల చుట్టునే, తుమ్మెదపూవునవలె చుట్టిచుట్టి తిరుగును. 'పాటలగంధి చిత్తమున బాటిలు కోపభరము' దీర్పలేక, ఆమె పాదముల 'పాటలకాంతి మౌళిమణి పంక్తులకు వన్నె కట్టగా', జగన్నాటక సూత్రధారి మ్రొక్కినపుడును, జలజాతాసన వాసవాది సురపూజాభాజనమైన గృష్ణుని శిరస్సును సత్యాదేవి వామపాదమున 'దొలగంద్రోసి నప్పుడు'ను, అతఁడా పాదమునే పట్టికొని 'నేను భవదీయదాసుఁడను. అయ్యో! నాయీపాదు పులకలతో నీ పదద్వయము నొచ్చెనే! యని నిట్టూర్చినపుడును, 'బాలపల్లవగ్రాస కషాయకంఠకలకంఠ వధూకలకాకలీధ్వని'తో సత్య యెయ్యాసపుటేడ్పు లేడ్చినప్పుడును, తిమ్మనార్యుని నిజమైన కవిత్వమున్నది. ఇతరకవులు 'సతులట! ప్రాణనాథులట! పారెకునైక్యములైన మోహసంగతులట! నేమిచెప్ప!' అని మూఁగలౌచోట, నీకవి వాచాలుఁడై వర్ణించును. శృంగారమును అంత నాజూకుగా, అట్టివై విధ్యములోఁ జెప్పగలవారు లేరు. అతఁడందుకై బుట్టెను.

కన్నడమున జగన్నాథవిజయ మనుకావ్యమున్నది. దాని రచయిత రుద్రభట్టు. అతఁడు తిమ్మనకంటె జాలప్రాచీనుఁడు. ఆ కవి 'పారిజాతాపహరణ' గాథను వర్ణించెను. దాని నీతఁడు దప్పకఁ జదివినాఁడు. అనేకస్థలముల ననుసరించినాడు గూడ.

అయ్యలరాజు రామభద్రుని 'రామాభ్యుదయము' ప్రసిద్ధమైన గ్రంథము. ఇతని తండ్రి యక్కయార్యుడు. ఇతనికిగూడ పెద్దనవలె నడుమంత్రపు వైష్ణవమే. 'పరిశీలిత రామానుజ సిద్ధాంతుఁడైన పరవస్తువంశ ముమ్మడి వరదాచార్యుల శిష్యుడు. రాయల యానతితో నీతడు 'సకల కథాసార సంగ్రహము'ను దెనిగించెను. ఆ పుస్తకము గన్నడమునుండి సంస్కృతమై, దానినుండి యాంధ్రీకృతమైనది. ఇంతకు నది ముద్రితము గాలేదు.

రామభద్రునికి 'పిల్లల రామభద్రుఁడ'ని మాఱుపేరు. అతడు పూర్వజన్మమున 'సంతాన గోపాలము'ను చక్కగా బురశ్చరణ చేసెనేమో! దండిగా బిల్లలున్నయింట దారిద్ర్యమును దండియే. అందుచే నాతఁడు నానాక

తిప్పలుపడియుండును. పిల్లలు పెరుగుకొలదియు భక్తిగూడ బెరిగియుండునని నాయూహ.

అతని విషయమునను — భట్టుమూర్తికి లంకె పెట్టిన యొక కథయున్నది.

సీ. 'మోహోపదేశతమోముద్రితములైన
కనుదమ్ముల హిమాంబు లునుపరాదు,
శ్రమబిందు తారకాగమభిన్న కుచకోక
ములఁ జంద్రనామంబు దలపరాదు,
శీర్యదాశావృంతశిథిలితాసులతాంత
మసియాడ వీవన ల్విసరరాదు,
పటుతాపపుటపాక పరిహీనతను హేమ
మింకఁ బల్లవపుటా ర్చిడఁగరాదు,
అలన కానంగకేళీకీలాకలాప
సంతతాసీధహృదయపాత్రాంతగళి
పూరితస్నేహపూరంబు పొంగిపొరలఁ
జల్లని పటీరసలిలంబు జల్లరాదు.''

రామభద్రుఁడీ పద్యమువ్రాసి శిష్యునిచేతి కొసఁగి విక్రయించుటకై బజారునకుఁ బంపెనట! కవుల పద్యములను దొంగలించుటయే కార్యముగఁ బెట్టికొన్న భట్టుమూర్తి వెంటనే దానిని గొని, యింకేమున్నది! — గ్రంథమున దగిలించికొన్నాడు. అసలిన్ని పద్యములు గొనుటకు అతని యింట నేమైన నవనిధులుండెనా? కాక విద్యానగరపు ప్రాత ఖజానాల ఆచోకీ యేమైన భట్టుమూర్తికిఁ దెలిసియుండెనా? అతఁడు 'స్వర్ణాకర్షణ గణపతి'నిగూడ జేసి యెఱుఁగఁడు. వాడు పట్టిన దైవము రామచంద్రుడు. ఆ దేవుడు గుంజాటలో నేర్చినంత మెలఁపు, యిచ్చుటలో నెఱుఁగఁడు. భట్టుమూర్తి యన్న - అపద్ధపు గాథలల్లువారికి బెల్లము దొరకినట్లు. పైపద్యములోని నాదశుద్ధిని గమనించినపుడు, యెవ్వడైనను—వాడు కవితారసికుడైనచో-నది సంగీత కలారహస్యనిధిదని స్పష్టముగఁ జెప్పఁగలఁడు. కానివాడు, అట్టి పద్యమును మఱియొకదానిని రామభద్రునిలో జూపవలెను. వసుచరిత్రలో' నట్టివి కొల్లలు.

ఇట్టిదే మఱియొక కథ. రామభద్రుడు ద్వితీయాశ్వాసమున,

'పృథులషడ్జస్వరోద్గీథ భిల్లపల్ల
వాధరాగీతి కాకర్ణనాతిభీతి
పరవశాత్మపటీరకోటరకుటీర
లీనఫణియగు నక్కాన గానవయ్యె.'
(2. 25)

అను పద్యము వ్రాసెను. దీనిని విని రామరాజభూషణుడు గానమునకుఁ బాములు బెదరుట స్వభావవిరుద్ధమని యాక్షేపించెనట! అపుడు రామభద్రుడు 'షడ్జస్వరము'నకు బాములు బెదరుట స్వభావమేనని సమర్థించెనట! ఈ కథను ఒకవేళ నాకవులే వినుట తటస్థించినచో-అట్లెన్నటికిని జరుగదనుకొనుడు—వారు పడి పడి నవ్వుకొందురు; లేక పగులబడి యేడ్తురు. ఈ గాథ ననుసరించి, యనేక నిఘంటువులు నేర్చిన రామరాజభూషణుడు 'షడ్జంమయూరో వదతి' అన్న యవరపుముక్క నెఱుగడనవలె. ఆ 'సంగీత కళారహస్యనిధి'కి స్వరజ్ఞానము గూడ లేదన్నమాట!

రాయలకాలములో బోతన్నను దడవిన పుణ్యపురుషుడు రామభద్రుఁడొక్కడే ఇతనికి గూడ నతని పిచ్చి కొంత యంటియున్నది గనుకనే, పోతనామాత్యుఁడు గవిగాఁ గనపడినాఁడు. ప్రాచీనకవులలో చాలమంది-అదేమి కర్మమోగాని-పోతన్న జీవితమును గౌరవించినంత రచనను గౌరవింపలేదు. పోతనామాత్యుఁడన్నంతనే, వారు దూరపుఁ మొక్కు మొక్కుదరు. ఇక నేఁడు, మనమందఱిని సమానముగ జూచితిమి. ఒక్క కవిజాతిలోనే పక్షపాతబుద్ధియేమని - మనమెవ్వరినిగాని పలుకరింపక వదలివేసినాము. ఈ విషయమున మనము ఘనులమే.

రామభద్రుని శయ్యాసౌభాగ్యము చాల యొయ్యారమైనది. ఆంధ్ర సంస్కృతములను సమానముగ, హాయిగా నడుపగలశక్తి గవులలోఁ జాలమందికి లేనిది. కొంతమంది మహాకవులు సంస్కృతమును జక్కగాఁ బొదిగింతురు. కాని వారు తెనుగులు వాడినపు డేదో తెనుగు గానిదానిని వాడినట్లుండును. ఉభయకవిమిత్రులే గొందఱు గీర్వాణమును వ్రాసినప్పుడు, 'అబ్బా! యీ ముక్కలఁగూడ వచ్చిన తెనుగునవే వ్రాసియుండఁగూడదా!' యనిపించును. రామభద్రు డట్లుగాక, రెండుభాషలను సమానముగు రీతితో నడపును.

క. ''ఆలోకించిరి వేల్పులు
వేలావేలానిరోధ విచలద్వీచీ
డోలాలీలాలోలము
రాశ్రీకరము, దుగ్ధరత్నాకరముఁ.''
(3. 34)

తెనుగు తెలుగు తోబుట్టువులు

# తమిళ వాఙ్మయ పరిచయం

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు



౧

తమిళ వాఙ్మయచరిత్రను తెలిసికొనుటకు పూర్వము 'తమిళ్' శబ్దవ్యుత్పత్తిని గురించి తమిళ భాషాపండితులు చేసిన రాద్ధాంతసిద్ధాంతములను తెలిసికొనుట సమంజసముగ నుండును. 'తమి' అను తమిళశబ్దమునుండి తమిళ్ యేర్పడి యుండవచ్చునని యొక వాదము కలదు. తమి యనగా ఒంటరితనము. కొందఱు తమ్+ఇళ్ అని తమిళశబ్దమున కర్థము చెప్పెదరు. ఇళ్ అనగా తీపి. కనుక తమిళ్ అను మాటకు తీయని అను అర్థమును చెప్పుకొనవలసియున్నది. ఈ యర్థముతోడనే తమిళ పండితులు తమిళ్ శబ్దమును వాడిరి. 'తేనుఱై తమిళ్'[1] 'తమిళ్ త్తీ ఇయళాయలవర్-'[2] అని యీరీతిగా ప్రాచీన తమిళ పండితులు తమిళమును ప్రశంసించిరి. పింగళాంతై అను నిఘంటువును కూర్చిన పింగళముని యిట్లు పేర్కొన్నాడు. 'ఇనిమైయుం (తీపి) నీర్మైయుం (కరుణ) తమిళెనలాగుం-'[1]. ఇచ్చట ప్రయోగింపబడిన తమిళ్ శబ్దమునకు తీపి, కరుణ యను నర్థములు ప్రయుక్తములై యున్నవి. కనుక తమిళము మధురమైన భాష యని స్పష్టమగుచున్నది. మఱియొక విషయముకూడ నిట పేర్కొనదగి యున్నది ప్రాచీన తమిళవాఙ్మయములో— అనగా తొల్కాప్పియం మున్నగు గ్రంథములందును - తమిళ్ శబ్దము వాడబడి యుండుటవలనను, తమిళ్‌లోని ళకారము సంస్కృతాద్యార్య భాషలందు మృగ్యముకనుకను, తమిళ్ శబ్దము తమిళభాషా శబ్దమేకాని పరభాషా శబ్దభవమనుట కేవలము హాస్యాస్పదముగనుండునని తమిళపండితులు నుడువుదురు

---

అని యాతడన్నపుడా గీర్వాణము నిండుగా, సర్వాంగ సుందరియగు స్త్రీవలె నుండును. అతడే తెనుగులు

చ. "మలచిన జాలు గాక మగ
మానిసి రూపులు బాలకైన జె
క్కులు పులకింపఁ జేసి యది
గో! వలపింతు మనస్వినీ గనం
గల మగరూపు నాయెదురు
కట్లకువచ్చిన నెంత గను ప్రే
మల వలరాచ మోమెఱుక
మానిసిఁ జేసిట జెత్తు మమ్మునిన్."
(12.88)

అని వ్రాసినపుడు-ఆ తెనుగు మనయింటికి నడచి వచ్చును. ఇంతటి రసికుడైనను యీ కవి యప్పుడప్పుడు

క. "నద్వల సికతిల పంకిల
శాద్వలశర్కరిలసీమ జనకజ నవలా
నుద్వధపవదన వదలన్
రాద్ధాంశయోధీధుడు రఘుపతి నంతన్."
(5.229)

అను దుష్కర ప్రాసలతో ఘోరముగ వ్రాయును. అది మన దురదృష్టము.

రామభద్రుడు మంచి యాలంకారికుడు. ఆ కాలమున నేకవులాలంకారికులు గారుగనుక యీ కవి గాకపోవును? అత డేయలంకారమును వాడినను, అది సుందరమై, మన పూరణముల నపేక్షింపనిదై యుండును. లలితమగు శ్లేష లీ కావ్యమం దెక్కువ. రాయలకాలమున పెద్దన 'రెండర్థంబుల'ను దిన్నగా నారంభించెను. తక్కినకవులు తాతగారి నందికొన్నారు. భట్టుమూర్తి శ్లేషాలంకార లక్ష్మిని స్వర్ణసింహాసనముపై గూర్చుండబెట్టి, విద్యానగరవీధులు త్రిప్పినాడు.

రామభద్రునిది మంచి పక్వమైన పురాణశయ్య. ఆ శైలిలో నతడు రామకథను విస్తృతముగ - వాల్మీకిజాడలో - వ్రాసియున్న నెంత బాగుండెడిదో!

1. తేనెవలె తీయగనుండు తమిళము 2. ఈ వాక్యము జీవకచింతామణి యందలిది.

ద్రావిడ భాషాకుటుంబమునకును, ప్రత్యేకముగా తమిళమునకును, చిరస్మరణీయమైన సేవ గావించిన కాల్డ్వెల్ మహాశయుడు తమిళ్ శబ్దము సంస్కృతశబ్దమైన ద్రావిడ శబ్దభవమని తీర్మానించెను. ఈ ద్రవిడశబ్దమునకు ప్రాచీన రూపము ద్రమిడం. సంస్కృత ప్రాకృత గ్రంథములలో ద్రవిడ, దమిలో, దామిళో, ద్రమిళ-అని తమిళము పేర్కొనబడియున్నది. ద్రవిడంలోని డకారము మొదట ళకారము గాను, పిమ్మట ఴకారముగాను రూపొంది యుండనోపునని కాల్డ్వెల్ గారి నమ్మకము. ద్రమిడ, దమిడ, దమిళ, దమిళ్—అని వేర్వేఱు కాలములలో వ్యవహరింపబడుచు నేటికి ఆ ద్రవిడరూపమే భాషాస్వభావము ననుసరించి తమిళ్ గా వ్యవహృత మగుచున్న దని నుడువదగును. కాల్డ్వెల్ గారి సిద్ధాంతములతో చాలమంది ఏకీభవించుచున్న తమిళ పండితు లీ విషయములో మాత్రము భిన్నాభిప్రాయులై యున్నారు. మీదుమిక్కిలి ద్రావిడ శబ్దముకూడ సంస్కృతశబ్దము కానే కాదని వాదించు తమిళపండితులు కొందఱు లేకపోలేదు. తిరు+ఇ(వి)డమ్[1] అను అరవ మాటను తమిళము తెలియని సంస్కృత పండితులు ద్రవిడ శబ్దముగా సంస్కృతీకరించికొని యుందురు. అంతేకాని సిరిసంపదలకు నిలయమైన యీ తిరువిడంలో నివసించు తమిళులు, ప్రాచీనమైన భాషావాఙ్మయములు కలిగిన తమిళులు తమ భాషను పరభాషా శబ్దముతో వ్యవహరింతురా? అని కొందఱు వాదించుచున్నారు. మఱికొందఱు 'తుఱై+విడు' అను అరవమాటను సంస్కృతీకరింపగా ద్రావిడ శబ్ద మేర్పడెనని పేర్కొన్నారు. ప్రాచీన తమిళులు సముద్రములమీద సబురులుచేసి విదేశములతో వర్తక వాణిజ్యములు చేయుచుండెడి వారని చరిత్ర సాక్ష్యమొసగుచున్నదిగదా! ఆ రోజులలో కొఱ్ఱ్కై, ముసిరిస్ (క్రాంగనూర్) పుహార్ (కావేరీ పూంపట్టణము) మొదలైనవి పేర్కొనదగిన రేవుపట్టణములు. రేవు స్థలమునకు తమిళములో 'తుఱైముగం' అని యందురు. రేవుస్థలములు కలిగిన దేశముకాన ద్రావిడ శబ్ద మేర్పడెనని పై వాద సారాంశము.

ఈ సందర్భమున నుడువదగిన మఱియొక విషయముకూడ గలదు. పంచద్రావిడ మను మాట మనకందఱికిని సువిదితమేగదా! తమిళులు, తెలుగులు, కన్నడిగలు, ఘూర్జరులు, మహారాష్ట్రులు పంచద్రావిడులని వ్యవహారము. అయితే యొక తమిళపండితు[2] డొక క్రొత్త వాదమును లేవదీసెను. తమిళము, ద్రావిడము-ఈ రెండును సమానార్థకములు కావట![3] తమిళమునుండి యేర్పడిన భాషలకు (వఴిమొఴిగళ్) ద్రావిడ భాషలని పేరు కలిగెనట. కనుక తమిళమునకును, పంచద్రావిడ భాషలకును జన్యజనకభావసంబంధము కలదని అతని విశ్వాసము.

తమిళ వాఙ్మయము చాల ప్రాచీనమైనది; స్వతంత్రమయినది. తెనుగు, కన్నడము-మున్నగు ద్రావిడ భాషలందు సంస్కృతవాణి స్వైర విహారము సలిపినట్లుగా తమిళములో విహరింపలేదు ప్రాచీన తమిళవాఙ్మయ మార్యగాథలను యథేచ్ఛగ స్వీకరింపలేదు. అయినను తమిళ వాఙ్మయముపైగూడ సంస్కృతభాషా వాఙ్మయముల ప్రభావప్రాబల్యము లున్నటుల మున్ముందు వివరింపబడును. మహాభారతముతో తెనుగు సాహిత్యచరిత్రకు రూపురేఖలు కలిగినవి. కన్నడమునందును భారతకథ నభివర్ణించునట్టి గ్రంథమే యాదికావ్యమయినది. మలయాళ సారస్వతములో రామచరితం, రామకథా పాట్టు గ్రంథములే మిక్కిలి ప్రాచీనములు. కనుక ఈ ద్రావిడభాషలలో బయలుదేరిన కావ్యములు ఆర్యగాథలను ప్రధానేతివృత్తములుగా కలిగియుండుటయేగాక సంస్కృత మహాకవులు చనిన త్రోవలందే నడిచినవి. కాని తమిళసాహిత్యము చాల విలక్షణమైనది. జైన బౌద్ధుల సంపర్కము కలిగిననాటినుండియు తమిళవాఙ్మయము తనప్రత్యేకతను కోల్పోయినదని నుడువదగును. సంగకాలపు వాఙ్మయములో తమిళసాహిత్య ప్రత్యేకత కండ్లకు కట్టినట్లుగ ద్యోతకమగును. అయినను, ఇతివృత్త స్వీకరణము, కతపోకడలు, వర్ణనలు—మొదలైన సందర్భములందు తమిళ కవిప్రవరులు తమ

1. శ్రీ మ. కార్తికేయ మొదలియార్ వ్రాసిన "మొఴినూల్" (1918) యను గ్రంథమును జూడుడు. 2. శ్రీ మ. కార్తికేయ మొదలియార్. 3. "మొఴినూల్-" పుట. 41.

ప్రత్యేకతను తెల్లగా ప్రదర్శించిరనియే చెప్పవచ్చును.

ఇక తమిళవాఙ్మయ ప్రాచీనతను పరిశీలింతము. ఒకానొకప్పుడు తమిళము భారతావనియందే కాక అసీరియా, బాబిలోనియా, మున్నగు దేశములందు గూడ వ్యవహరింపబడుచుండెడిదనియు, ఇటలీయందలి టాస్కనీలో వ్యవహరింపబడు భాష తమిళమాండలిక భాషయని చెప్పవచ్చుననియు, ప్రపంచ ప్రాచీన భాషలైన సంస్కృతము, గ్రీకు, హీబ్రూ భాషలలోనికి అరవమాటలు కొన్ని ప్రవేశించినవనియు తమిళపండితులు కొందఱు నుడివియున్నారు.[1] సుమారు 20,000 సంవత్సములకు పూర్వము భారతావనిలో వ్యవహరింపబడుచువచ్చిన భాషలు చాలవఱకు తమిళమునకు సన్నిహితముగా నుండెడివనియు, కనుక ఉత్తర భారతదేశమునందలి భాషలు ఆర్య భాషాకుటుంబమునకు చెందిన భాషలుగా నేడు వ్యవహృతము లగుచున్నను, ఒకానొకప్పుడవి తమిళమునకు సన్నిహితముగా నుండిన భాషలుగా గణింపదగుననియు[2] శ్రీ పి. టి. శ్రీనివాస అయ్యంగారు పేర్కొన్నారు. శ్రీ దామోదరం పిళ్లైగారు క్రీ. పూ. 12,000 లకు పూర్వమే తమిళ వాఙ్మయము ప్రచారమునందున్నట్లు విశ్వసించిరి. ఈ విషయమున పరిశోధనలు సలిపిన కనకసభాపతిపిళ్లై, కృష్ణస్వామి అయ్యంగారు, శ్రీనివాస అయ్యంగారు, సూర్యనారాయణ శాస్త్రి-ఇంకను పలువురు భిన్నాభిప్రాయులై యున్నారు. ఇటుల తమిళ పరిశోధకులు తమిళ భాషా ప్రాచీనతను క్రీస్తుపూర్వము కొన్ని వేల సంవత్సరములవఱకు తీసికొనివెళ్ళిరి.

ఇంకను తమిళపండితులు పేర్కొనిన కొన్ని విచిత్రవిషయములను[3] క్లుప్తముగా నుదాహరింతును. మనువు ద్రావిడ దేశాధిపతియట! అతని సంతతివారైన శిబి, ముచుకుందుడు మొదలైన రాజులు తమిళ భూపతులట! భాగవతమునందీవిషయము కలదట. మనువునకు సంబంధించిన యైతిహ్య మొకటి కలదు. అతనికి యముడను కుమారుడును, ఇళయను కుమార్తెయు నుండిరి. వృద్ధాప్యము వచ్చినపిమ్మట మనువు తన రాజ్యమును రెండు సమభాగములుగాజేసి వానిని కుమారునికి, కుమార్తెకు నొసగెను. ఇళై పరిపాలించిన దేశమునకే 'కుమరినాడు' అను పేరు నాటినుండియు నేర్పడినదట. అంతే కాదు. ఆ రాజ్యమును మహిళలే పాలింపసాగిరి. నేటికిని మలబారులో స్త్రీలకు గౌరవాధికారము లుండుటకు కారణము బహుశః ఇళై ప్రభావమేయని చెప్పవచ్చునట! కొంత కాలమునకు యముని రాజ్యము సముద్రములో మునిగిపోయెనట. ఇటుల తమిళనాడులోని కొంతభాగము సముద్రమున కలసిపోయెను. క్రీ. పూ. 9564 సం॥ ప్రాంతమున భూకంపముల వలనను, వెల్లువలవలనను ఈ ప్రపంచమందలి కొన్ని భాగములు నామరూపములు లేకుండ పోయినవట! ఆ సమయములోనే కుమరినాడునుకూడ సముద్రము తుడిచిపెట్టియుండనోపునని తమిళపండితులు సంభావించుచున్నారు. పూర్వము కుమరినాడునకు ఉత్తర సరిహద్దు వింధ్యపర్వతమట. హిమవత్పర్వతము, గంగా సింధు మైదానములును తరువాత కాలమున నేర్పడినవే యని యొక తమిళ పండితుడు పేర్కొనినాడు.

ఈ పైగాథలు సుస్పష్టమొనర్చు విషయములివి:—భారతావనియందొకనాడు తమిళము బహుళ ప్రచారమునందెను. మనువు, శిబి మున్నగువారు తమిళ మహీపతులు. తమిళ నాడెంత ప్రాచీనమైనదో తమిళ భాషావాఙ్మయములు నంత ప్రాచీనములు. ఈ విషయాదికములో సత్యమెంతవఱకు గలదో ఆ సర్వసాక్షికే యెఱుక! అయితే తమిళ భాషావాఙ్మయములు చాల ప్రాచీనములని మాత్రము నుడువదగును.

ప్రాచీన లాక్షణికులు తమిళవాఙ్మయమును మూడు భాగములుగా విభజించిరి. 1. ఇయల్ (పద్యము) 2. ఇశై (సంగీతము) 3. నాటకము - ఇవి ఆ విభాగముల పేర్లు. మఱల ఇయల్‌ను (1) ఇలక్కణం (లక్షణము) (2) ఇలక్కియం (లక్ష్యము) అని రెండు భాగములు చేసిరి. లక్షణ శాస్త్రములో (1) ఎழுత్తు (అక్షరము) (2) సొల్ (శబ్దము)

1. శ్రీ కందయ్యపిళ్లైగారి "తమిழగమ్." 2. చూడుడు - 'Dravidian India' by Sri T. R. Sesha Iyengar. Pages: 77 to 83.

3. 'తమిழగమ్'ను చూడుడు.

(3) పొరుళ్ (అర్థము) అను మూడు భాగములు కలవు. తమిళ వాఙ్మయము చాల ప్రాచీనమైన దైనను సంస్కృతశబ్దము లట్టి వాఙ్మయమున గూడ స్థానము సంపాదించుకొనినవి. తమిళ రాజులలో ప్రాచీనులు పాండ్యవంశస్థులు పాండ్యఅనునది సంస్కృతశబ్దము. అయితేయిది ప్రాత అను నర్థమిచ్చు పణ్డైయ (పఝైయ) అను మాటయే సంస్కృతీకరింప బడెనేమో యను సంశయమునకు తావు కలుగుచున్నది. ఇటులనే ఇలక్కణం, ఇలక్కియం (లక్షణ లక్ష్యములు) నాటకం-మున్నగునవి సంస్కృత శబ్దములకు తద్భవములుగా కనబడుచున్నవి.

తమిళ వాఙ్మయమును తద్భాషాపండితు లీ రీతిగా యుగవిభజన మొనర్చిరి.

1. సంగయుగము లేక అజ్ఞాతయుగము.
2. జైన బౌద్ధుల యుగము.
3. శైవ వైష్ణవ మతాచార్యుల యుగము.
4. మహాకవిత్రయ యుగము.
5. మఠాధిపతుల యుగము.
6. అధునిక యుగము.

## సంగయుగము :

సంగయుగపు తమిళ వాఙ్మయమును గురించి యింతవఱకు సుస్పష్టమైన విషయములు తెలియ రాలేదు. కొందఱు పరిశోధకుల దృష్టిలో సంగము కేవలము అభూతకల్పనముగా గణింపబడినది. ఇది కొంతవఱకు సత్యమే కాని ప్రాచీన తమిళగ్రంథములలో సంగప్రశంస కనబడుచున్నది. తొలుదొలుత ఇఱైయనార్ అను కవిచే రచియింపబడిన అగప్పొరుళ్[1] అను గ్రంథమునకు వ్రాయబడిన వ్యాఖ్యాన గ్రంథములందు సంగప్రశంస చేయబడినది. ఇఱైయనార్ అను శబ్దమునకు భగవంతు డను నర్థముండుటచే శివుడే యీ గ్రంథమును వ్రాసెనని తమిళ పండితుల నమ్మకము. ఈ గ్రంథ వ్యాఖ్యాత మూడు సంగములను విపులముగ నభివర్ణించెను. కాని యిందు వర్ణితములైన విషయములు విశ్వసనీయములు కానేకావు. పైపెచ్చు కేవలము కల్పితములు.[2]

సంగ మనుమాట సంస్కృతశబ్దమైన సంఘమునుండి యేర్పడినట్టిదే. దీనిని తొలుత జైన, బౌద్ధు లుపయోగించి ప్రచారములోనికి తీసికొని వచ్చిరి. మహావీరుని యనుయాయులగు శ్రావికా శ్రావకుల ధర్మబద్ధమైన సమూహమును జైనులు సంఘమని పేర్కొనిరి. అటులనే బౌద్ధ ధర్మావలంబకులైన సన్న్యాసినీ సన్న్యాసుల సమూహమును సంఘమని బౌద్ధులు వ్యవహరించిరి. ప్రప్రథమ జైనసంఘము క్రీ. శ. 470 సంవత్సరము మధురలో స్థాపితమయ్యెను. శైవము బహుళ ప్రచారము నందికొనిన పిమ్మట శైవులు జైన బౌద్ధులవలె సంఘములు స్థాపించుకొనిరి కనుక మతాచార్య సమూహమునకు సంఘమను నామము తొలుత నిర్దేశింపబడె ననియు, పిమ్మట శైవులు శివుని మహిమలను కొండాడుచు గీతములు కొన్ని పాడిరనియు నుడువదగును. సంగమునకు సమానార్థకమగు తమిళశబ్దము 'కూట్టం' అనునది మధురలో సంగము వర్ధిల్లిన హేతువుచే తన్నగరమునకు కూడల్ అను వ్యవహారనామ మేర్పడెను. ఇక పండితుల భిన్నాభిప్రాయములకు గుఱియైన సంగకాల నిర్ణయమును జిజ్ఞాసామాత్రముగ పరిశీలింతము.

సంగయుగము క్రీస్తుకు పూర్వమే యారంభమై క్రీస్తుకు వెనుక ఒకటి, రెండు శతాబ్దములలో ముగిసెనని కొందఱు తమిళ భాషాభిమానులు తలచిరి. ఇది కేవలము స్వభాషాభిమాన జనిత ఆవేశముచే నుడువబడినది. కాన చర్చనీయాంశము కాదు. పరిపాడల్, సిలప్పదిగారం-మున్నగు ప్రాచీన గ్రంథములందలి కొన్ని విషయములను పురస్కరించికొని సంగయుగము క్రీ. శ. 7, 8 శతాబ్దములకు చెందినదని యొక వాదము కలదు. క్రీ. శ. 7, 8 శతాబ్దులలో దక్షిణాపథమున పల్లవులు రాజ్యాధికారము నలుపుచుండిరి; శైవ వైష్ణవములు విశేషప్రచారము నందికొని యుండెను. కాని సంగవాఙ్మయమున, జైన బౌద్ధమత ప్రశంసయు, 'ద్రావిడ రాజత్రియము'నకు చెందిన పాండ్య, చేర, చోళ మహీపతుల విషయాదిక

1. ఇది ప్రేమకలాపమునకు సంబంధించిన గ్రంథము. ఇం దఱువదినూత్రములు గలవు. దీనిని కొందఱు కళవియల్ అనియు నందురు. రహస్యప్రేమ, వైవాహికప్రేమ - అనునవి కడు మనోజ్ఞముగ నిందు చిత్రితములు. 2. చూడుడు. శ్రీ పి. టి. శ్రీనివాస అయ్యంగారు గారి "History of the Tamils" పుటలు 226 & 251.

మును కలవు. ఈ కారణముచే 7, 8 శతాబ్దులందుగాక, అంతకు పూర్వమే సంగవాఙ్మయము వర్ధిల్లెనని పేర్కొనుట సహేతుకముగ నుండును. హారిసీన శాసనము నాధారముగా జేసికొని సంగయుగము క్రీ. శ. 5వ శతాబ్దము నుండి ప్రారంభమయ్యెనను మఱియొక వాదము కలదు. ఇదియును పండిత సమ్మతమును బడయలేదు. ఏలయన శాసనమున మంతరాజను నొకరాజు సముద్రగుప్త చక్రవర్తిచే పరాజితుడైనట్లుగా గలదు. ఈ మంతిరాజు సంగకాలపు గ్రంథములందు పేర్కొనబడిన 'మంతరం చేరల్' తప్ప తదితరుడు కాడని వాదము లేవదీసినవారి యభిప్రాయము. ఇది సరికాదనియు, సముద్రగుప్తుడసలు కాంచీపురమును దాటి దక్షిణదేశముపై దండెత్తలేదనియు ప్రతిపక్షమువారి వాదసారాంశము. పండితాదరమును బడసిన మూడవవాదమును గమనింతము. క్రీ. శ. మొదటిశతాబ్దమున సంగయుగము ప్రారంభమయ్యెనని వీరి మతము. వంజినగరమున పతిదేవతయైన కణ్ణకిదేవ్యాలయమును నిర్మించిన చేరభూపతి సెంగుట్టువానును, సింహళము నేలిన గజబాహు చక్రవర్తియు (క్రీ. శ. 173-195) సమకాలికులని సింహళద్వీప చారిత్రకలేఖనమగు మహావంశము నుడువుచున్నది. సెంగుట్టువానుని తమ్ముడగు ఇళంగో అడిగళ్ సంగయుగమునకు చెందిన సిలప్పదిగారమను రచియించెను. కాన సంగయుగము క్రీస్తుకు వెనుక మొదటి శతాబ్దమున ప్రారంభమగుచున్నది.

కవి సమూహమునకు సంగమని పేరు. ఇట్టి కవిసంఘములు మూడు వర్ధిల్లెను. వీనిని తలైచ్చంగం (తొలిసంగము) ఇడైచ్చంగం (మధ్య సంగము) కడైచ్చంగం (కడసంగము) అని పేర్కొనుదురు. వివిధకవుల గ్రంథములందలి బాగోగులను పరీక్షించి సద్గ్రంథనిర్ణయము సలుపుటయే సంగము చేయవలసినపని. సంగము యొక్క ఆమోదమును బడసిన గ్రంథమే ప్రచారములోనికి వచ్చుచుండెను. తమిళ వాఙ్మయ చరిత్రలో ఈ సంగయుగము చాల విశిష్టమైనది. సంగయుగమున పుట్టిన గ్రంథముల నన్నిటిని రెండు భాగములుగ విభజింపదగును. వీరగాథలు, మధురగాథలు-అనునవి యా విభాగములు. పురనానూఱు మొదటి వర్గమునకును, అగనానూఱు రెండవ వర్గమునకును జెందును. సంగకాలపు గ్రంథము లానాటి తమిళసంఘమును కన్నులకు కట్టునట్లుగా చిత్రించుచున్నవి. అలనాటి తమిళుల యాచార వ్యవహారములు, యుద్ధవిధానములు, పెండ్లి పేరంటములు-మున్నగునవి మనోహరముగ భిన్న వర్ణితములు. కాని తమిళుల రాజకీయ చరిత్ర మాత్రము తెలియుటలేదు. మొత్తము మీద సంగవాఙ్మయము తమిళ సంఘజీవిత దర్పణమని నుడువవచ్చును. ఇదియే సంగవాఙ్మయ విశిష్టత.

### 1. తొలి సంగము:

ఈ సంగము కూడల్ నామాంతరముగల మధురానగరములో వర్ధిల్లినది. ఇందు 549 మంది కవులుండిరనియు, శివుడు, మురుగన్, అగత్తి (స్త్య) యన్ మున్నగువారు సభ్యులుగా నుండిరనియు ప్రతీతి. ఈ సంగము 4,440 సం॥లు వర్ధిల్లినది. పిమ్మట మధుర సముద్రమున కలిసిపోయినది. పరిపాడల్, ముదునారై, ముదుకురుకు-ఇంకను మఱికొన్ని గ్రంథము ఈ కాలములో వ్రాయబడినవి. వీనిలో అగత్తియ మహర్షి వ్రాసెనని చెప్పబడు 'అగత్తియం' పేర్కొనదగినది. ఇది లక్షణ గ్రంథము.[1] ఇదియే తమిళ వ్యాకరణములకు ప్రాతిపదిక. తొలు కాప్పియనార్ కూడ అగత్తియము నాధారముగ జేసికొనియే లక్షణగ్రంథమును రచియించెను. అగత్తియం గ్రంథము సంపూర్ణముగ లభింపలేదు. కొన్ని సూత్రములు మాత్ర ముపలభ్యములు. వానిని దివాన్ బహద్దూర్ భవానందం పిళ్లైగారు ప్రకటించిరి. ఈ సందర్భమున అగత్తియ ఋషినిగూర్చి సంభావించుట సమంజసముగ నుండును.

మహేశ్వరుడు పాణినికి సంస్కృతవ్యాకరణమును, అగస్త్యునికి తమిళవ్యాకరణమును ప్రసాదించెనని యైతిహ్య మొకటి కలదు. కనుక అగస్త్యుడు పాణినికి సమకాలికుడగు

1. శంభురహస్య మను గ్రంథమున, 'అగస్త్యుడు మహేశ్వరుని యభిమతము ననుసరించి వ్యాకరణగ్రంథము వ్రాసె'నని కలదట. చూడుడు: శ్రీ గంటిజోగి సోమయాజిగారి "ఆంధ్ర

చున్నాడు.[1] (మహేశ్వరన్ పాణినికాక సిరియన్.) కాని అగస్త్యనామధేయులు పలువు రుండుటవలనను, పెక్కు కథ లతని నాశ్రయించి కొని యుండుటవలనను, అగస్త్య దేశాలపు వాడో యిదమిత్థముగ నుడువవీలుకాదు. మీదు మిక్కిలి యతిప్రాచీనమైన సంగవాఙ్మయ మున అగస్త్య ప్రశంస కానరాదు.[2] తుదకు అగస్త్యుని శిష్యుడుగా భావింపబడుచున్న తొల్కాప్పియనార్ కూడ తన లక్షణగ్రంథ మున అగస్త్యునిగురించి నుడువలేదు. ఇది శోచ్యము. ఇట్లనుటచే తమిళవాఙ్మయమున అగస్త్యునికి స్థానమేలేదని భావింపగూడదు. తమిళవాఙ్మయ జనకుడుగా కుంభసంభవుడు ప్రసిద్ధి వహించినాడు. ఈ మహనీయుని ప్రతిభావిశేషము వలననే తమిళనాడులో కావేరినది ప్రవహింప దొడగెను[3]. కావుననే నాడు నాటికిని అగస్త్యుడు సంస్మరణీయుడై తమిళ వాఙ్మయ చరిత్రలో నగ్రపీఠము నలంకరించినాడు.

అగస్త్యుడు చాల పొట్టివాడట! కావున తమిళ కవు లతనిని 'కుఱుముని' యని వ్యవహరింతురు. కుఱుముని మలబారునకు సమీపముగ నున్న 'అగాతి' యను ద్వీపమునకు చెందిన వాడగుటచే నితడు 'అగత్తియన్' అని వ్యవహరింప బడెనని తమిళులు పేర్కొనుదురు. అంతే కాని ఔత్తరాహుడగు అగస్త్యునితో దాక్షిణాత్యుడైన యితనికి సంబంధము లేదని వాదింతురు. ఏది యెట్లున్నను అగత్తియముని నాశ్రయించికొని యున్న కథలు కొల్లలుగా గలవు. ఇతడు పొదియ పర్వతముపై నివసించు చుండెనట. విదర్భ రాకుమారియైన లోపాముద్రను పరిణయమాడి అగస్త్యుడు సిద్ధుడను కుమారునిపొందెను. సిద్ధుడు సంస్కృత ద్రావిడ భాషలయం దారితేరినవాడనియు, అహత్తియం అను గ్రంథమును రచించెననియు ప్రతీతి[4]. ఇది కాక పెక్కు (250) వైద్యగ్రంథములు కూడ నితనిచే రచితము లయ్యెనట.

ఇక కుఱుమునికి తమిళవాఙ్మయమున గల స్థానమును తిలకింతము. తమిళమునకు సంస్కృత సంపర్కము కలిగినది కుఱుముని కాలమునందే యని తమిళపండితులు నుడువుదురు. ఇది సత్య దూరముకాదు. అగస్త్యునికి పూర్వమే తమిళ వాఙ్మయముండెననియు, తమిళకవులు పలువు రుండిరనియు పేర్కొందురు[5]. కాని వ్యాకరణ

1. పాణిని కాలనిర్ణయమున భిన్నాభిప్రాయములు కలవు. పాణిని క్రీ. పూ. 4 వ శతాబ్దమున నుండెనని పాశ్చాత్య విద్వాంసులును, క్రీ పూ. 7 వ శతాబ్దమున నుండినట్లు ఆర్. వి. భండార్కర్ మున్నగు ప్రాచ్యపండితులును తలచుచున్నారు. ఏది యెట్లున్నను పాణిని చాల ప్రాచీనుడనుట సర్వపండిత సమ్మతమే. కనుక అగత్తియమునికూడ చాల ప్రాచీనుడని నుడువుట అత్యుక్తి కానేరదు.

2. "Agastya in the Tamil land" by Sri K. N. Sivaraja Pillai: (Madras University Publication)

3. పూర్వము చోళమండలమును కవేరుడనురాజు పరిపాలించుచుండెను. అతని కాలములో తమిళనాడులో జీవనది యొక్కటియు లేమి, అతడు రాజ్యమును తన సుతుని యధీనమొనర్చి తపస్సుచేయ నారంభించెను. అనంతరము, కవేరుని కొమరుడు కుంభసంభవుని సందర్శించి, "స్వామి! తమరు తమిళవ్యాకరణము ప్రసాదించి మహోపకార మొనర్చినట్లుగా జీవనది నొకటి ప్రవహింపజేయుడు—" అని ప్రార్థించెను. పిమ్మట అగస్త్యుని దయవలన (కవేరుని పేరుమీదుగ) కావేరి ప్రవహింపసాగెను: "మణిమేకలై."

4. "Tamil Literature" by Sri M. S. Purnalingam Pillai. P. 20.

5. అగత్తియ మందలి యీ సూత్రము పయివిషయమును బలపఱుచుచున్నది.

"ఇలక్కియ మిన్ఱి ఇలక్కణమిన్ఱే, ఇలక్కణ మిన్ఱి ఇలక్కియ మిన్ఱే
ఎళ్ళిన్ ఎణ్ణై ఎడుప్పదు పోల ఇలక్కియత్తిన్ఱు ఎడుపడుమ్ ఇలక్కణమ్."

లక్ష్యము లేక లక్షణములేదు, లక్షణము లేకలక్ష్యములేదు, నువ్వులనుండి నూనె తీయ బడునట్లు, లక్ష్యమునుండి గ్రహింపబడును లక్షణము. కనుక కుఱుమునికి పూర్వమే వాఙ్మయము కొంత కలదని విదితము గదా!

గ్రంథ మొక్కటియు నున్నట్లు కానరాదు. అగత్తియమును వెలయించి ఈ కొఱతను తీర్చిన వాడే అగస్త్యుడు. ఈ లక్షణగ్రంథము తరువాతి కాలమున రచియింపబడిన వ్యాకరణ గ్రంథములకు ప్రాతిపదిక యైనది. ఇదే అగస్త్యునికి గల ప్రత్యేకత. అయితే పాణిన్యాచార్యుల వారి[1]ననుసరించి ఈ ముని రచన చేసెను. కావుననే సంస్కృత వ్యాకరణమునందు వలె ద్రావిడ వ్యాకరణము నందును ఏడు విభక్తులు, కర్మణ్యర్థము, మున్నగునవి ప్రవేశించినవి. సంస్కృత శబ్దములు కొన్ని తద్భవరూపములలో అగత్తియమునందు ప్రవేశించినవి. ఇలక్కణం, ఇలక్కియం మున్నగునవి లక్షణ, లక్ష్యములకు తద్భవరూపములే గదా[2]! అయినను అగస్త్యుడు తమిళ భాషా సంప్రదాయముల ననుసరించియే రచన సాగించెనని చెప్పుట సమంజసము.

మధ్యసంగము :

ఇది కపాడపురములో వర్ధిల్లెను. దీనికే అలైవాయ్, పుదలూర్, ముత్తుపూర్ అను పేర్లు కలవు. ఈ పురమును గూడ సముద్రము కుడిచిపెట్టి వేసెనట. అగస్త్యుడు, తొల్కాప్పియనార్ మున్నగువారు ఈ సంగములో సుప్రసిద్ధులు. ఇందు 59 మంది కవులుండెడివారనియు, కావ్యములు విమర్శింపబడినట్లును ప్రతీతి. అగత్తియం, తొల్కాప్పియం, మాపురాణం, భూతపురాణం మున్నగునవి యీ సంగమున వెలసిన యుద్గ్రంథములు. వీనిలో లక్షణగ్రంథమైన తొల్కాప్పియం పేర్కొనదగినవి.

తొల్కాప్పియమును రచియించిన తొల్కాప్పియనార్ మధురకు దక్షిణదిశలో నున్న తొల్కాప్పియక్కుడిలో జన్మించినట్లు చెప్పుదురు కావుననే యీపేరు కలిగెను[3]. జమదగ్ని వంశమువాడగుటచే నితనికి జననీజనకులు తిరనతు మాగిని యని పేరిడిరి. ఇతడు తమిళ మునియైన అగత్తియర్ యొక్క పండ్రెండుగురు శిష్యులలో ప్రముఖుడు. అగస్త్యుని వ్యాకరణము ననుసరించియూ, ఐంద్రవ్యాకరణము[4] నాధారముగ జేసికొనియు నితడు తొల్కాప్పియమును వెలయించెను. కావున సంస్కృత లక్షణ గ్రంథము లందలి కొన్ని సంప్రదాయము లిందునుగలవు. కాని యిది స్వతంత్రరచనముగా కనబడుచుండుట గమనార్హము.

'ప్రాచీనమగు గ్రంథము' అను నర్థము నొసగుచున్న యీ తొల్కాప్పియమునందు 1,612 సూత్రములు కలవు. ఇది క్రీస్తుకు తర్వాత ఒకటి, రెండు శతాబ్దులందు రచింపబడినట్లుగ కొందఱు తలచుచున్నారు. ఈ గ్రంథమున మూడు భాగములున్నవి. 1. ఎళుత్తు (అక్షరామ్నాయము) 2. సొల్ (శబ్దము) 3. పొరుళ్ (అర్థము) అనునవి యీ భాగములు. ఈ యొక్కొక్క భాగము మఱల తొమ్మిది భాగములుగా చేయబడినది. మొదటి రెండుభాగములును కేవలము వ్యాకరణ విషయములకు సంబంధించినవి. శబ్దపరిచ్ఛేదమున మాటలపుట్టుకయూ, వాని యర్థములును వివరింపబడినవి. శబ్దస్వభావము ననుసరించి లింగవివక్ష చేయబడియుండుట యీ లక్షణగ్రంథమందలి యొక ప్రత్యేకత.

1. 'History of the Tamils'—Page 209.

2. సంస్కృత 'క్ష' కారము ద్రావిడభాషలందు 'క్క'గా మాఱుట పండితులకు సువ్యక్తమే. లక్ష్మి-ఇలక్కుమి-లకుమి (లంబోదరలకుమికరా...) పిల్లారిగీతము—పక్షి-పక్కి

3. కాప్పియం - అనునది గోత్రనామమని కీ. శే. ము. రాఘవ అయ్యంగారు పేర్కొనిరి. కాప్పియ గోత్రోద్భవుడగుటచే తొల్కాప్పియనార్ అను పేరు కలిగియుండనోపునని శ్రీ అయ్యంగారు గారి యభిప్రాయము. 'గజశాస్త్ర'మును రచియించిన పాలకాప్పియర్ అను ముని తాను కాప్పియ గోత్రజుడని చెప్పుకొనెనట. "ఆరాయ్చ్చిత్తొగుది-" పుటలు 96-99.

4. "ఐందిరమ్ నిఱైంద తొల్కాప్పియం-" ఈ వాక్యమును తొల్కాప్పియనార్ యొక్క మిత్రుడైన అదన్గోట్టాశాన్ నుడివెను :

ఇక తొల్కాప్పియం యొక్క ప్రత్యేకతకు ధ్వజప్రాయముగా నున్న మూడవదైన (పొరుళ్) పదార్థపరిచ్ఛేదమును పరిశీలింతము. కామము, తత్సంబంధమగు విషయాదికము (అహత్తిణై) యుద్ధతంత్రము (పురత్తిణై) రహస్యప్రేమ (కళవు) సాంసారిక ప్రేమ (కర్పు) పదార్థము (Matter, పొరుళ్) సాత్త్వికభావములు (మెయ్‌పాట్టు) ఉపమానము (ఉవమై) ఛందస్సు (సెయ్యుళ్) లోకోక్తులు, ప్రయోగములు (మరపు) - అను తొమ్మిదిభాగము లీ పరిచ్ఛేదమునందు గలవు. ఈ విభాగములందు ద్రావిడ సామాజికజీవన విధానము మనోజ్ఞముగా చిత్రింపబడియున్నది. తమిళుల యభిరుచులు, ఆచార వ్యవహారములు, ప్రేమగాథలు, ఛందస్సంప్రదాయములు, జాతి వార్తాచమత్కృతులు - మున్నగునవి యన్నియు నీ పరిచ్ఛేదమువలన విదితములగును. ఇట్టి విశిష్ట లక్షణగ్రంథమునకు ఇళంపూరణార్, నచ్చినార్ కినియార్, పేరాసిరియర్ మున్నగువారు ప్రశస్తములగు వ్యాఖ్యాన గ్రంథములు వెలయించిరి.

తొల్కాప్పియనార్ నాటికే సంస్కృత భాషా వాఙ్మయములు దక్షిణభారతమున ప్రచారములో నుండెనని నుడువుటకు తొల్కాప్పియమే సాక్షి. ఇట్లు తలచుటకు ప్రబలములైన కారణములు కొన్ని లేకపోలేదు. తొల్కాప్పియనార్ అగస్త్యుని శిష్యుడు; జమదగ్ని వంశీయుడు. పాణిని వ్యాకరణ మప్పటికే ప్రచారములో నుండెను. ఐంద్రవ్యాకరణము నాధారముగ జేసికొని తొల్కాప్పియనార్ వ్యాకరణము రచియించెనని యతని మిత్రుడే నుడివెను. బ్రాహ్మణుల గ్రంథము (వేదము) (అన్దణర్ మఱై) ననుసరించి తొల్కాప్పియం వ్రాయబడెనని విశ్వసించువారును కొందఱున్నారు. మీదు మిక్కిలి తొల్కాప్పియనార్ తన రచనములో పలుతావుల బ్రాహ్మణ ప్రశంస చేసెను. సంస్కృతనాటకము లందలి విదూషకుని మనసులో నుంచుకొని కాబోలు తొల్కాప్పియనారుకూడా ప్రేమగాథలలో బ్రాహ్మణునికి తావు కల్పించెను. ఈ కల్పనము తమిళ కవులకు సంప్రదాయ బద్ధము కాదు. అగత్తిణైలోగాని, పురత్తిణైలోగాని యిట్టి కల్పన లేనేలేదు. కనుక సంస్కృతనాటక వాఙ్మయ వికాసమునకు పిమ్మటనే తొల్కాప్పియం రచింపబడియుండునని[1] శ్రీ పి. టి. శ్రీనివాస అయ్యంగారు పేర్కొనిరి. కనుక సంస్కృత వాఙ్మయ ప్రభావమీ తొలి తమిళలక్షణ గ్రంథమునందు సైతము కలదని నుడువదగును. కాని యితర భాషాకవులవలెగాక, తొల్కాప్పియనార్ తమిళకవి సంప్రదాయానుగుణముగ రచన సాగించెను. తుదకు తమిళ భాషోచ్చారణమున కనుకూలముగా మార్పుచెందిన సంస్కృత శబ్దములు కొన్నిటిని మాత్రమే (తచ, మీనం, మానం-మున్నగునవి) యతడుపయోగించెను. ఏ పట్టునగూడ తమిళ సంస్కృతములకు జన్యజనక భావసంబంధమును నిర్ణయింపలేదు. కేవలము స్వతంత్రరచన - అని యనిపించునట్లుగాను, తమిళ సంఘజీవిత దర్పణముగా నుండునట్లును తొల్కాప్పియనార్ తొల్కాప్పియమును రచియించెను. ఇదియే యీ గ్రంథమందలి పేర్కొనదగిన ప్రత్యేకత !



## తప్పులెన్నరు !

గీ. వ్రాలుసెబ్బలనుచు వర్జింపఁగానేల ?
వాఁడు నేర్చుకొలఁది వ్రాసెఁగాక !
అనుచుఁ దప్పులెన్న కవిలెస్సచేతురు
తజ్జ్ఞులైనవారు దయదలంచి.

---

1 [illegible]

# శ్రుతులు ఇరవై రెండే!

శ్రీ విస్సా అప్పారావుగారు



ఏ వస్తువు నందైనను స్పందనము (వైబ్రేషన్) కలిగినచో శబ్దము పుట్టును. చెవి కింపైన శబ్దములను సంగీతమందు వాడుదుము. ఒక సెకను కాలంలో ఎన్నిసార్లు కంపించునో దానిని శబ్దముయొక్క తరచుతనము (ఫ్రీక్వెన్సీ) అందుము. మాటాడునపుడు గొంతుకలోని పొరలు (వోకల్ కార్డ్స్) మగవారికి సెకనుకు 80 సార్లు, ఆడవారికి 120 సార్లు ఆడును. అందుచేత ఆడవారి గొంతుక మగ గొంతుక కంటె ఒకటిన్నర రెట్లు తరచుతనము కలది అందుము. తరచుతనము రెట్టింపు పెరిగినచో ఒక స్థాయి పెరిగిన దందుము.

సంగీతంలో మూడుస్థాయిలు ఉండును. ప్రతి స్థాయి మొదటను ఉండు శబ్దమునకు షడ్జస్వరమని (స) పేరు. పై స్థాయిలోని షడ్జస్వరమున స క్రింది స్థానములోని షడ్జము కంటె రెట్టింపు తరచుతనము కలిగి యుండును. ఈ రెండు షడ్జముల మధ్య వేర్వేరు తరచు తనములుకల శబ్దములెన్నో ఉండవచ్చును. అవన్నీ చెవికింపుగా ఉండవు: సంగీతమున కుపకరించవు. అందుచేత ఒక స్థాయిలోని 22 శబ్దములను మాత్రమే సంగీతమందు వాడు చున్నాము. వీటికి శ్రుతులని పేరు. వీటి నే మూలంగా ఏడుస్వరములుగా – స, రి, గ, మ, ప, ద, ని – అని గుర్తించుచున్నాము. ఇందు సపలలో భేదములు లేవు. రి, గ, మ, ద, ని–అనునైదు స్వరములలో నాల్గేసి భేదములు కలవు. అందుచేత $2+5\times4=22$ భేదములున్నవి. వీటినే ద్వావింశతి శ్రుతులని సంగీతశాస్త్రము చెప్పుచున్నది.

## శ్రుతులలో నవీనత్వం అవసరం కాదా!

ఈ ఇరవై రెండింటిని గుర్తించి, నిరూపించు టెట్లు–అనేదే ప్రధాన విషయము. వీటిని వీణ తీగల కొలతలనుబట్టి గ్రహించవచ్చునని శాస్త్ర గ్రంథములలో కలదు. కాని, ఆ కొలతలు సునిశ్చితముగా లేక భిన్నములుగా నున్నవి. ఇట్టి కొలతల ప్రమేయము లేకుండా ఉన్న ప్రాచీనమగు పద్ధతి ఒకటి కలదు. శ్రుతులు కలిగించు భావములను బట్టి ప్రాచీనులు వాటిని గుర్తించుచుండిరి. దీనికి నిశితమగు శ్రుతిజ్ఞానము గల సంగీతవేత్తల నిర్ణయం ప్రమాణము. అట్టి ప్రామాణికులకు గలుగు రసభావముల ననుసరించి ఇరవైరెండు శ్రుతులకు పేర్లు పెట్టబడినవి – ఛందోవతి, దయావతి, రంజని, రతిక, రౌద్రి–మొదలైనవి. వివిధ సంప్రదాయాలలో వీటికి వివిధరీతిని పేర్లు పెట్టబడినవి. ఇట్టిపద్ధతిని ఇంకను మనమనుసరించుటలో సారస్యంలేదు. కాలము మారినది. విజ్ఞానము పెరిగినది. నూతన పద్ధతులు వెలసినవి. వాటి నుపయోగించుకొని వ్యవహరించుచున్నాము.

షడ్జము కంటె ఒకటిన్నర (3/2) రెట్లు స్పందించుస్వరమును పంచమము (ప) అందుము. 4/3 రెట్లు తరచుతనము కలిగినదానిని మధ్యమము (మ) అందుము. రెండు స్వరము లొకే సారి పలికించినచో, అవి ఒకదానితో ఒకటి మేళవించినచో వినుట కెంతో ఆనందము కలుగును. ఇట్టి మేళనములో, కలిగే ఆనందములో అంతరములు కలవు. స–ప, స–మ, మేళనము మొదటి తరగతికి చెందియుండును. ఈ మేళనమును సంవాదిత్వ మందురు. స–ప, స–మ, లను సంవాదిస్వరములందురు. ఇట్టి సంవాదిస్వరముల భావము ననుసరించి శ్రుతులు నిర్ణయింపబడినవని శాస్త్రము చెప్పుచున్నది. ఈ భావములనే షడ్జ–పంచమ భావమని, షడ్జ–మధ్యమ భావమని అందురు. వీటి నాధారము చేసికొని శ్రుతులను నిర్ణయించుటను, లెక్కించుటను తెలుపుచున్నాను.

షడ్జము యొక్క తరచుతనము 100 అనుకుంటే పంచమముయొక్క–అనగా షడ్జమునకు స–ప భావముగల శ్రుతియొక్క–తరచుతనము $100\times3/2=150$. షడ్జముయొక్క తరచుతనము 100 అనుటకంటె 1 అనుటచేత పెద్దపెద్ద

అంకెలు కాక చిన్నచిన్న భిన్నాంకములు వచ్చును. లెక్కకు సులువుగా ఉండును.

## 1 స-ప భావము

(1) స=1 (2) 1×3/2=3/2 ఇది స, కంటె 3/2 రెట్లు తరచు తనము కలది. దీనికి పంచమమును లెక్కింతము (3) 3/2×3/2=9/5 ఇది రెండుకంటె ఎక్కువ గనుక పై స్థాయిలోనికి పోవుచున్నది. దీనిని సగము చేసినచో, 9/8 అనునది సరియైన క్రింది స్థాయిలోని శ్రుతి యగును. దీనికి పంచమము (4) 9/8×3/2=27/16 ఇట్లే (5) 27/16×3/2=81/32—క్రింది స్థాయికి దింపినచో ఇది 81/64 అగును. (6) 81/64×3/2=243/128 (7) 243/128×3/2=729/512. ఇది మిక్కిలి అపక్రమమైన భిన్నాంకము. దీనితో ఇంకను లెక్కించినచో ఇంతకంటె అపక్రమ భిన్నములు వచ్చును. అందుచేత దీనికి అతి సమీపముగా వున్న క్రమ భిన్నమును, 64/45 ను దీని బదులు వ్రాయుచున్నాము. ఇది 729/512 కంటె కొద్దిగా తక్కువ—729/512 లో 32768/32805 వంతు. సుమారు 90 లో ఒక భాగము తక్కువ. ఇట్లు తగ్గించుటచేత ముందులెక్క సులభముగా సాగును. మరియు ఈ భేదము వీణ తీగలమీద వాయించి చూచిన గుర్తింప వీలు లేనంతటి సూక్ష్మమైనది కూడా. ఇట్లే ప్రాచీనులు నిర్ణయించి యుందురు. (8) 64/45×3/2=32/15−16/15 (9) 16/15×3/2=8/5 (10) 8/5×3/2=12/5−6/5 (11) 6/5×3/2=9/5 (12) 9/5×3/2=27/10−27/20 (13) 27/20×3/2=1/40=81/80. 81/80 కి ప్రమాణ శ్రుతియని పేరు.

ఇంతకంటె తక్కువ భేదముగల శ్రుతులను గుర్తించుట కష్టము. ఇది షడ్జముకంటె ఒక ప్రమాణ శ్రుతి హెచ్చు అన్నమాట. 1×81/80=81/80. ఈ శ్రుతికి సంగీతములో వాడుక లేదు.

## 2 స-మ భావము

ఇక షడ్జ-మధ్యమ భావము ననుసరించి లెక్కింతము. ఇందటిది మధ్యమము.

(1) 4/3 (2) 4/3×4/3=16/9 (3) 64/27−32/27 (4) 128/81 (5) 512/243−256/243 (6) 1024/729. ఇది 729/512 వంటి అపక్రమ భిన్నాంకం. దీనిని 32805/32768 రెట్లు పెంచి 45/32 క్రింద సంస్కరించి క్రమ భిన్నముగా చేయుదము. (7) 45/32×4/3=15/8 (8) 5/2-5/4 (9) 5/3 (10) 20/9−10/9 (11) 40/27. 40/27 పంచమముకంటె ఒక ప్రమాణ శ్రుతి తక్కువ—40/27×81/80=3/2. ఇది సంగీతమందువాడుకలో లేదు.

1. పంచమ భావముతో లెక్కించిన పదమూడింటిలో చివరది, 2. మధ్యమభావముతో లెక్కించిన పదకొండింటిలో చివరది గానార్హములు గాకుండుటచేత వాటిని వదలి తక్కిన 12+10=22 టిని శ్రుతులుగా గ్రహించుచున్నాము. కొందరు ఆ రెంటిని చేర్చి, 13+11=24. శ్రుతులు ఇరవైనాల్గని లెక్కించవచ్చును. కాని, గానార్హములు కానివాటిని లెక్కించి శ్రుతు లనుట కూడదు. ఇరవై రెండు శ్రుతుల తరచుతనపు రెట్లను క్రమవృద్ధిగా వ్రాసి, వాటి పేర్లను దిగువ పట్టికలో చూపించుచున్నాను:—

| సంఖ్య | గుర్తు | పేరు | | తరచుతనపు ప్రమాణము | |
|---|---|---|---|---|---|
| 1 | స | శుద్ధషడ్జము | | 1 | |
| 2 | రి1 | ఏక శ్రుతి రిషభము | | 256/243 | 81/80 |
| 3 | రి2 | ద్వి శ్రుతి ,, | | 16/15 | |
| 4 | రి3 | త్రి శ్రుతి ,, | శుద్ధ రిషభము | 10/9 | 81/80 |
| 5 | రి4 | చతుశ్రుతి ,, | | 9/8 | |
| 6 | గ2 | శుద్ధ గాంధారము | | 32/27 | 81/80 |
| 7 | గ1 | సాధారణ ,, | షట్ఛ్రుతిరిషభము | 6/5 | |
| 8 | గ3 | అంతర ,, | | 5/4 | |

| | | | | |
|---|---|---|---|---|
| 10 | మ1 | శుద్ధ మధ్యమము | 4/3 | } 81/80 |
| 11 | మ2 | తీవ్ర ,, | 27/20 | |
| 12 | మ3 | తీవ్రతర, శేక, ప్రతి మధ్యమము | 45/32 | } |
| 13 | మ4 | తీవ్రతమ ,, | 64/45 | |
| 14 | ప | శుద్ధ పంచమము | 3/2 | |
| 15 | ధ1 | ఏక శ్రుతి ధైవతము | 128/81 | } 81/80 |
| 16 | ధ2 | ద్వి శ్రుతి | 8/5 | |
| 17 | ధ3 | త్రి శ్రుతి ,, శుద్ధ ధైవతము | 5/3 | } 81/80 |
| 18 | ధ4 | చతుశ్శ్రుతి ,, | 27/16 | |
| 19 | ని1 | శుద్ధ నిషాదము | 16/9 | } 81/80 |
| 20 | ని2 | కైశిక ,, షట్ఛ్రుతి ధైవతము | 9/5 | |
| 21 | ని3 | కాకలి ,, | 15/8 | } 81/80 |
| 22 | ని4 | చ్యుతషడ్జ,, | 243/128 | |
| | స | తారషడ్జము | 2 | |

## స్వర స్థానాలు

వీణలో అన్నింటికంటె పైనున్న మెట్టును మేరు వందురు. దానిని స్పృశించకుండనే తీగనంతను స్పందించిన — స — పలుకును. తరువాతి మెట్టువద్ద రి1, రి2 అను రెండు శ్రుతులను పలికింతుము. వ్రేళ్ళనొక్కుటచేత కలిగిన కొద్ది పాటి ఓగింపు భేదముతో ఈ మెట్టువద్ద ఈ రెండు శ్రుతులను పలికించవచ్చును. అందుచేత ఈ మెట్టు రి1 రి2 లకు స్థానమని చెప్పుదుము. ఇట్లే క్రమముగా రి3 రి4 | గ1 | గ2 | గ3 గ4 | మ1 మ2 | మ3 మ4 ప | ధ1 ధ2 | ధ3 ధ4 | ని1 ని2 ని3 ని4 | ఒక దాని తరువాత ఒక మెట్టు ఆయా శ్రుతులకు స్థానముగా నుండును. స—ప లకు మధ్య 6 మెట్లు ప—స లకు మధ్య 4 మెట్లు రెండేసి శ్రుతులకు స్థానములై యున్నవి. స, ప లకు ప్రత్యేకముగా ఒక్కొక్క మెట్టు, స్థానముగావున్నది. అందుచేత ఒక స్థాయిలో 12 మెట్లు కలవు. వీటిని స్వరస్థానములందురు. జంట శ్రుతులు గల స్థానముల పదింటివద్దను ప్రతి రెండు శ్రుతుల మధ్య గల అంతరము ఒక్కటే — 81/80 ప్రమాణ శ్రుతి అనగా రెండవది మొదటి దానికంటె 81/80 రెట్లు తరచుతనము కలిగి యుండును. కాని తీవ్రతర, తీవ్రతమ మధ్యముల మధ్యగల అంతరము 2048/2025 యై 81/80 కంటె భిన్నముగా నున్నది. దీనికి కారణము ఈ రెండు శ్రుతులు సంస్కరింపబడి యుండుటయే. ఈ సంస్కారమును తీసివేసినచో వాటిమధ్య అంతరము కూడ 81/80 అగును — 2048/2025 × 32805/32768 = 81/80.

మరియు

3 × 4 = 12 { శుద్ధ నిషాదమునకు, శుద్ధ షడ్జమునకు మధ్యగల శ్రుతులు నాల్గు
శుద్ధ గాంధారమునకు శుద్ధ మధ్యమమునకు మధ్యగల శ్రుతులు నాల్గు
శుద్ధ మధ్యమమునకు శుద్ధ పంచమమునకు మధ్యగల శ్రుతులు నాల్గు

ఇట్లే

2 × 3 = 6 { శు-స, కి శు-రి కి మధ్య మూడు శ్రుతుల అంతరము
శు-ప, కి శు-ధ కి మధ్య ,, ,, ,,

2 × 2 = 4 { శుద్ధ రిషభ గాంధారముల మధ్య రెండు ,, ,,

ఇవన్నియు చేరి ఒక స్థాయిలో 12+6+4=22 శ్రుతులు అగుచున్నవి. ఇవి ప్రప్రథమమున శుద్ధ మేళములోని సప్తస్వరలను నిర్ణయించుటలో పేర్కొనబడినవి. సంగీతము పెరిగిన కొలది వివిధరాగములలో ఈ 22 శ్రుతులూ ఉపయోగపడినవి. కాని, ఏ రాగలో ఏవి ఉపయోగపడుచున్నవి యని నిర్ణయించుటలో భేదాభిప్రాయము లున్నవి.

అట్టి భేదములు లేక ఏకాభిప్రాయము గల వాటిని ఉదహరించుచున్నాను:

| | | |
|---|---|---|
| రి$_1$ గౌళ | మ$_1$ శుద్ధ మధ్యమ రాగములలో చాలావరకు | ని$_1$ కాంభోజి, భైరవి |
| రి$_2$ మాయామాళవగౌళ, తోడి | మ$_2$ బేగడ | ని$_2$ ఖరహరప్రియ |
| రి$_3$ కాంభోజి, భైరవి | మ$_3$ పూరీ కళ్యాణి | ని$_3$ శంకరాభరణము మాయామాళవగౌళ |
| రి$_4$ కళ్యాణి | మ$_4$ వరాళి | |
| గ$_1$ భైరవి, తోడి | ధ$_1$ సావేరి | ని$_4$ కళ్యాణి, హంసధ్వని |
| గ$_2$ ఖరహరప్రియ, | ధ$_2$ మాయామాళవగౌళ, తోడి | |
| గ$_3$ శంకరాభరణము, కాంభోజి | ధ$_3$ కాంభోజి | |
| గ$_4$ కళ్యాణి | ధ$_4$ కళ్యాణి | |

ఏ రాగమునైనను గమకములతో పాడునప్పుడు స్వరముల స్పందనపు రేటులో కొద్దిపాటి మార్పులు పుట్టును. మరియు ఏదో ఒక స్వరమును వివిధ ఇతర స్వరములతో చేర్చి రాగసంచారము చేయునపుడు ఆరోహణావరోహణములలో ఆస్వరముయొక్క తరచుతనపు రేటు సూక్ష్మముగా మారుచుండును. ఈ స్వల్ప భేదములుగల స్వరములను ప్రత్యేక శ్రుతులని కొందరు భావించి, శ్రుతులు ఇరవై రెండే కావు చాలా ఎక్కువగా నున్నవి—అని అనుచున్నారు గమకములయందు, రాగసంచారమందు కలుగు సూక్ష్మ భేదములను గణింప నక్కరలేదు. అట్లు జేయుట ప్రారంభించినచో వాటి సంఖ్యకు మితి మేర యుండదు. గందరగోళము క్రిందకు దిగును. కనుక శ్రుతులు ఇరవై రెండేయని చెప్పవలెను.

## శ్రుతులు 24 కాదు

క్రింది స్థాయి షడ్జమునకు, పై స్థాయి షడ్జమునకు అంతరము 2. దీనిని పన్నెండు సమ భాగములుగా చేసినచో ఒక్కొక్క అంతరము $\sqrt[12]{2}=1.0595$ అగును. 1·0595 ను తిరిగి 2 వచ్చునన్నమాట. ఇట్టి సమ విభజన చేయుట పాశ్చాత్యుల సంగీత పద్ధతి. ఈ అంతరమును రెండు సమ భాగములు చేసినచో $\sqrt[24]{2}$ లేక $\sqrt{1.0595}=1.029$ వచ్చును. ఇట్టివి ఒక స్థాయిలో 24 వుండును. అందుచేత కొందరు శ్రుతులు 24 అందురు. ఇది పొరపాటు. మన శ్రుతులు సమానాంతరములు కావు. సమానాంతరములైన శ్రుతి విభజనము పంచమము యొక్క తరచు తనపు రేట్లు 1·498 అగును. మన శ్రుతిపద్ధతిని 1·5 అగుచున్నది. ఇట్లే అన్ని శ్రుతులయందు భేదము కలుగును. అందుచేత పాశ్చాత్య శ్రుతి విభజన పద్ధతిగల హార్మోనియము, పియానో మొదలగు వాద్యములు మన సంగీతమునకు సరిపడవు. అపశ్రుతులు పలుకును.

షడ్జ-పంచమ, షడ్జ-మధ్యమ భావములను మాత్రమే యుపయోగించుటచేత కలిగిన 22 శ్రుతులు మాత్రమే మన సంగీతమందు వాడబడుచున్నవనుట సరికాదు. నిశితమగు ప్రయోగముల మూలమున మన సంగీతమందు వాడబడు స్వరముల యొక్క తరచుతనము రేటు

**ఇతిహాసం:**

# ఆముక్తమాల్యద - ప్రక్షిప్తాలు

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు

---

కృష్ణదేవరాయలు రచించిన ఆముక్తమాల్యదలో పెద్దన రచించిన మనుచరిత్ర పద్యములు కొన్ని చేర్చుట కూటకరణీకము. ఆ ప్రక్షిప్త పద్యములు లేనిచో కృష్ణదేవరాయల అవతారికగాని, అవతార వర్ణనకాని కుంటుపడు నేమో! పరీక్షింపవలసియున్నది.

పద్యసంఖ్యలతో ఈ చర్చను సూచించుట కంటె, ఆ మూలపద్యముల నిట ఉల్లేఖించుట శ్రేష్ఠము.

'.....అప్పుణ్యా రాత్రచతుర్థయామంబున:

"తమ్మికేలుండఁ బెఱకేల
దండయిచ్చు
లేములుడిపెడు లేఁజూపు
లేమతోడఁ
దోలకుఁ దయఁదెల్పు చిఱునవ్వు
తోడఁ గలఁద
దంధ్ర జలజాక్షుఁ డిట్లని
యానతిచ్చె.'

ఈ రెంటి మధ్యనున్న ప్రక్షిప్త సీసము 'నీలమేఘముడాలు— ' లేకపోయినను, అన్వయము చెడలేదు. మూల మిట్లుండియుండగా, ప్రక్షిప్తకు లెవరో దీని నిచ్చట మార్చి కూర్చిరి. ఇట్టివే మరికొన్ని : '——విద్వజ్జనంబులు— అఖర్వ మహిమాతి ఘూర్వహుఁడగు తుగ్వసు వంశంబునం బుట్టిన నీకిట్టి శోభన పరంపరలే మద్భుతంబు, లవధరింపుము.

"తునియఁ దొమ్మిది యఁటపడు
సెనమంగ్రఁట మోచువార
నే కిపకిటి కూ
ర్మనగాహు లేటి లావరు
లని తావకబాహు వొకటి
యవని భరించెఁ.
"చిత్రము కృష్ణరాయ నృప
శేఖర నీదగు ధాటికోడి స
ర్వత్రని లింపి కామినుల
వాడకుఁ గాఁపులు వోయిరుత్కల
క్షత్రియ పాత్రులెల్లఁ గసు
గందని మేనులఁ దొంటి పెద్ద శే
షూత్రముఁ బన్నినారొ బల
సూదను వీఁటికిఁ గొండ వీఁటికిఁ.
"కూగిమిఁ గృష్ణరాయ నృప
కుంజర నేఁగఁ గళింగ [illegible]

---

యున్నవి. వాటిలో శ్రుతులు 22 కంటె ఎక్కువ కలవని నిరూపింపవచ్చును. ఉదాహరణకు: 25/24, 25/16 లను పేర్కొనవచ్చును. వివిధ రాగములయందు వీటిని ఇదమిత్థమని చెప్పుటకు రాగములను ఏకరీతిని పాడుట కష్టము. సంప్రదాయభేదములు కలవు. మరియు వీటిని ఇదివరకేర్పడిన 22 శ్రుతులలో దేనికో ఒకదానికి దగ్గరయని దానికి ముడిపెట్టవచ్చును. ఇట్లుసునిశ్చితముకాని విషయమేర్పడినది. అందుచేత శ్రుతులవిషయము స్థూలముగానే ఆలోచించవలసి వచ్చుచున్నది పాడుటచేత ఏర్పడు శ్రుతులను ప్రయోగముల మూలమున సునిశ్చితము చేయజాలనప్పుడు లెక్కగట్టితే వచ్చిన, స్థూలముగా సరిపోవుచున్న, 22 శ్రుతులనే ఆధారము చేసికోవలసి వచ్చినది

స-ప, స-మ భావముల పద్ధతికే భిన్నమైన మార్గముచేత కొందరు 7/6, 7/5, 7/4 అను తరచుతనపురేట్లు గల శ్రుతులు సంగీతములో పలుకుచున్నవని 243/1.8, 256/248 వంటి అపక్రమ భిన్నములు కల శ్రుతులు నోటితో పలుక వీలులేదని అంటున్నారు. పెక్కురు ఇది అంగీకరించటలేదు.

ఈ శ్రుతుల విషయము 1925 లో మద్రాసులోను జరిగిన సంగీత మహాసభలలో కొంత చర్చకు వచ్చినది. 1929, 1930 సంవత్సరములలో మద్రాసు మ్యూజిక్ అకాడమీలో విద్వాంసుల సభలో ఈ విషయము విపులముగా చర్చింపబడి, శ్రుతులు 22 కంటె తక్కువయుండుటకు వీలులేదని పైన నేను వివరించిన రీతిని నిర్ణయింపబడినది.

అందుచేత శ్రుతులు [illegible] కంటె.

శ్రీ రమణీలలామ నిను
మిన్నులుముట్టిన మోహాసాలతోఁ
గారణమట్లు లక్ష్మి గను
గందని వేడుకఁ గృష్ణరాయనిం
జేరుచుకొంక, వారిసెడఁ
జెందుసె సోదరుఁడైన చంద్రునిన్?
"కచసక్త ఫణికంచుకము మాళివీరకే
దారంపుఁ బాగ చందంబునొందఁ,
గలయ నంగమున మర్కటకీట కృతమైన
సగ్గంబు నేత్రసంపద వహింపఁ,
ధ్వాంతగహ్వరశిలా తాడితాళిక చిక్క
టాస్ర పంకము చంద్రమై పొసంగఁ,
దనుభృశ క్రాంతవేష్టనలగ్న బర్హిబ
ర్హాంబు మువ్వన్నెచుంగై చెలంగ,
నిద్రమేల్కాంచి, సెలయేట
నీడఁగాంచి,
గోపవేషంబు నెడి లోంటి
భూపవేష
మగుట యవ్వన మహిమఁగా
నలికి యచటు
విడుచు గజరాజు నీధాటి
వింధ్యవాటి.
"సనకాది దివిజమస్కరిఫాల గోపి చం
దన పుండ్రవల్లిక ల్నాకి నాకి,
సెలసి హాహాహూహూవుల దండియలతంత్రి
గ్రొవ్వ సింగిణిలుగాఁ దివిచి తివిచి,
సప్తర్షికృత వియజ్ఝర వాలుకాలింగ
సమితి ముచ్చెలకాళ్లఁ జమరిచమరి,
రంభాప్రధానాప్సరః పృథగ్నాళజకుం
భంబు లెచ్చటఁగన్నఁ బట్టిపట్టి,
తిరుగు హరిపురి సురతరు
సురల మరిగి
బహుళ హాళహాళి భృతకల
బరిగ నగర
సగర పురవర పరిబృఢ
జవన యవన
పృతన భవదసి ననిఁదెగి
కృష్ణరాయ.
"అలుకన్ఘోటక ఘట్టికాఖుర పుటీ
హల్యక్ ఖురాసాని పు
చ్చలు వోఁదున్ని, చలచ్చమూ గజమదా
సారప్లుతి స్గ్రీర్తి పు
ష్కల సస్యంబిడి, యేకధాటి బళిరా
కట్టించి తౌద్రృష్టి కే
ఘులఖానోగ్రకపాల మర్ధపహారి
ద్భుతాంగల శ్రేణికన్.
"సుమతిఁ బునఃపునారచిత
షోడశదాన పరంపరా వసం
తముల ననంత విత్తము సనం
తి ననంతమహాగ్రహార బృం
దమును నొసంగు నిన్నొనసి
తారెనరాకకదా నిలింప భూ
జములు వహించు దుర్యశము
షట్పదకోకిల కైతవంబునన్.
"ప్రబల రాజాధిరాజ వీ
ర ప్రతాప
రాజ పరమేశ్వరార్ధ దు
ర్గా నటీశ
సాహితీ సమరాంగణ
సార్వభౌమ
కృష్ణరాయేంద్ర కృతివి ని
ర్మింపు మనిరి.
అని విన్నవించినన్ బ్రహృష్టాంతరంగుండనై."

ఈ మూలపీఠికలో విద్వజ్జనులు కృష్ణదేవ రాయ కవిసార్వభౌముని 'తుర్వసు - తుళువ - వంశంబు' మాత్రమే ప్రస్తావించి, తద్వంశ చరిత్రను విడనాడిరనుట స్పష్టము. సుప్రసిద్ధ రాజకవి 'రాజాధిరాజ వీరప్రతాప రాజపరమేశ్వర' బిరుదములచేత నే తద్వంశము గుర్తింప బడును. కావున, పెద్దన మనుచరిత్ర పద్యము లిక్కడ చేర్చనక్కరలేదు. చేర్చదలచిన యెడ లా పద్యముల నక్లే చేర్చవలెను కాని, నూతన పద్యములను చేర్చనక్కరలేదు; పాఠాంతరము లను కూర్చవక్కరలేదు.

క్రీ. శ. 1512 ప్రాంతములో ఒకసారియు, క్రీ. శ. 1520 ప్రాంతములో ఇంకొకసారియు కల్బరిగ—సగర—దండయాత్రలు కావింప బడినవి. కావున, ఆముక్తమాల్యద పీఠికలోని 'కలబరిగ నగర...సగరపుర...యవన' దండ యాత్ర క్రీ. శ. 1512 ప్రాంతమందలి మొదటి దండయాత్ర గానే లెక్కించవలెను.

ఇట్లే పీఠికలోని 'ఖురాసాని...ఏదులఖాన్' బీజపూర్ మ్లేచ్ఛ దండయాత్రకూడ క్రీ. శ. 1510-11 ప్రాంత యుద్ధమనుటయే సహేతుకము.

మరియు, గ్రంథావతారికయందలి, 'బలసూదన వీటి (అమరావతి), కొండవీటి, వింధ్యవాటి, షోడశదాన (తులాదాన)' కాలము లన్నియు క్రీ. శ. 1515 ప్రాంతపు 'కళింగదేశ విజిగీష'కు చెందినవే కాని, తదన్యములు కావు. క్రీ. శ. 1515 తేది అహోబల శాసనములో 'కృష్ణదేవ మహారాయలు...కళింగదేశ దిగ్విజయార్థమై విచ్చేయుచు' ఉన్నట్లు చెప్పబడినది.

మనుచరిత్రమందలి 'చిన్నాదేవియు' శుభమతి తిరుమలదేవియు అంతఃపుర చరిత్రకును, ఆముక్తమాల్యదయందలి 'తిరుమలదేవియును నన్నపూర్ణాదేవియుఁ గమలాబ్జముఖియు' అంతఃపుర చరిత్రకును మధ్యవ్యత్యాసమున్నది. దీని నాధారముగా తీసికొని, కృష్ణరాయల భార్య చిన్నాదేవి జీవించియుండగా మనుచరిత్ర రచింపబడినదనియు, ఆమె మరణానంతరము ఆముక్తమాల్యద రచింపబడినదనియు, అందుచేతనే క్రొత్త దేవేరుల పేర్లు దీనిలో పేర్కొనబడినవనియు నిర్ణయింపవీలున్నది. కాని, శిలాశాసనాదులలో వీరి పేర్లెక్కడను పేర్కొనబడలేదు.

క్రీ. శ. 1514 తేది తిరుపతి శిలాశాసనములో 'చిన్నాదేవమ్మంగారు ... తిరుమలదేవమ్మంగారు' మాత్రమే రాయల దేవేరులుగా పేర్కొనబడియున్నారు. స్వప్న వృత్తాంత వివరణములో 'విద్వజ్జనంబులు—ప్రియోపభోగ పరిశిష్టభోగంబింపనుట యితోధిక బహుప్రేయసీ ప్రాప్తి'ని సూచించినప్పటికిని, కాలవ్యవధిలేకనే క్రొత్త దేవేరుల నా విద్వజ్జనులు వర్ణించుట చరిత్రసమ్మతము కాదు. కాబట్టి, కల్పిత ప్రక్షిప్త చరిత్రతో గ్రంథరచనాకాలము నిర్ణయింపకూడదు.[1]

'భువన విజయాఖ్యసంసత్' కంద పాద చరిత్ర పారిజాతములోను, మనువులోను, పోర్చుగీసు చరిత్రలోను వర్ణింపబడినదేకాని, రాయల ఆముక్తమాల్యదలో వర్ణింపబడలేదు. ఈ 'విజయభవన' చరిత్రను పీయసుక్రింది వాక్యములలో వివరించియున్నాడు.

'The feasts besgin ('in the House of Victory') on the 12 th September (1520), and they last nine days.'

ఈ నవరాత్రిపండుగ క్రీ. శ. 1520 తేదీనాటిదని చారిత్రకులు లెక్కించియున్నారు.[2]

కాబట్టి, క్రీ. శ. 1520 తేదికి పూర్వము రచింపబడిన ఆముక్తమాల్యదలో తదనంతరము రచింపబడిన మనుచరిత్ర పద్యములు చేరుటకు వీలులేదు.

స్వల్పవిజయములను వర్ణించిన రాయలు తన కావ్యములో 'విజయభవన' సుప్రసిద్ధచరిత్రను వర్ణించలేదనుట సహేతుకము కాదు. అవతారికలోని 'గజ (పతి) రాజు—వింధ్యవాటి' పలాయనము, కావ్యాంతమందలి 'జయసన్నాహోగ్రభటీవాద్యభీత్యుదితేభేశ్వరీ' పలాయనము తరువాతనే ఆముక్తమాల్యదా రచనయు, 'భువనవిజయ సంసత్తు' నిర్మాణమును ప్రారంభమై పూర్తికావింపబడినవని తోచుచున్నది.

'This house is called the house of victory as it was made when the king came back from the war against Oriya.'

ఉత్కల విజయానంతరమే 'విజయభవన' నిర్మాణము కావింపబడినట్లు పీయసు చెప్పియున్నాడు.

కథలోని దశావతారవర్ణనలో కూడ మను చరిత్ర పద్యములను చేర్చకూడదు. చేర్చనక్కర లేదు. మరియొక వ్యాసములో వీటిని పరిశోధింతము.

---

1. 'ఆ విభు ననంతరంబ ధరావలయముఁ బూని తీవు రహిమై దిరుమ
లేవియును చిన్నమాంబాదేవియుఁ గమలాబ్జముఖులు దేవేరులుగాఁ.'

ఇదియే చరిత్రానుగుణ్యమైన మూలపాఠము. కమలవదన తిరుమలదేవి చంద్రవదన చిన్నాదేవి పోలిక లోపుమాసిపోయి, విశేషణము వ్యక్తినామవాచకమైనది.

2. A Forgotten Empire. pp. 263-265.

ఛందస్సు, అలంకారం:

# కావ్యాలంకారసంగ్రహం, రసమంజరి, చంద్రాలోకం

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు

౧

సమగ్రముగను, ఛందో, వ్యాకరణ సాంకర్య రహితముగను రచింపఁబడిన యలంకార గ్రంథములలో మూర్తికవి గ్రథితమగు కావ్యాలంకారసంగ్రహమే మొదటిది; తుదిగ్రంథమునిప్పటి వఱకు నిదియే. దీనికిఁ బూర్వము వెలువడిన కావ్యాలంకార చూడామణి విషయాంతర సాంకర్యయుతము; రసాభరణము శృంగారరస స్వరూపమాత్ర ప్రతిపాదకము. మఱియు నిది విషయవివేచనమున మేలయినది.

దీనికి 'నరసభూపాలీయ' మను పేరు ప్రసిద్ధముగ నున్నది. ఆ పేరు గ్రంథమున నెచ్చటను గాన్పింప లేదు. 1ఏతన్మూల మనఁదగు 'ప్రతాపరుద్ర యశోభూషణము'నకు 'ప్రతాపరుద్రీయ'మను వాడుక కలిగినట్లే దీనికిని పయి 'నరసభూపాలీయ' నామము కలిగియుండవలెను. ఈ గ్రంథమందలి పంచమాశ్వాసాంత గద్యయందు మాత్రము 'నరసభూపాలీయ' పదము చేర్పఁబడినది. అది పయి వ్యవహారమునుబట్టి ప్రాచీనులు కాని, యిప్పటి వారుగాని చేర్చినది కావచ్చును.

ఏతద్గ్రంథకర్తృత్వముంగూర్చి కొన్ని యభిప్రాయభేదములు కలవు. దీనిని రచించిన మూర్తికవియు, వసుచరిత్ర హరిశ్చంద్ర నలోపాఖ్యానములను రచించిన రామరాజ భూషణుఁడు అభిన్నులను వాద మొకటియు, భిన్నులను వాద మొకటియు, చాలయేండ్లపాటు తెలుఁగు దేశమును కలవరపఱచినవి. ఇప్పటికి 'ఇరువు రభిన్నవ్యక్తులే' యను వాదమే నిలిచినది. అయినను వ్యతిరేక వాదులు లేకపోలేదు. పయి వాదముల సారాంశము క్రింద నీయఁబడును.

భేదవాదులు స్వాభిప్రాయ సమర్థకములని క్రింది ప్రమాణముల నొసంగుచున్నారు.

౧. మూర్తికవి తండ్రి వేంకటరాయ భూషణుఁడు; రామరాయభూషణుని తండ్రి సూరపరాజు.

౨. నరసభూపాలీయము గద్యభాగములలో '... శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసార ...' అనియు, వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యాన గద్యభాగములలో శ్రీరామచంద్ర చరణారవిందవందిత...' అనియు నున్నవి.

౩. నరసభూపాలీయ శైలి యప్రౌఢము; తక్కిన గ్రంథముల శైలి ప్రౌఢము.

అభేదవాదుల ప్రత్యుత్తరము లివి—

౧. మూర్తికవి తండ్రిపేరు సూరపరాజు; అతఁడు వేంకటదేవరాయల యాస్థానమునకు భూషణుఁ డగుటచే, 'వేంకటరాయభూషణుఁ' డయినాఁడు. ఆరీతిగనే మూర్తికవి కృష్ణదేవరాయల యల్లుఁడగు రామరాయల సభ కలంకార భూతుఁడగుటచే 'రామరాజ భూషణుఁ'డను బిరుద మాతని కబ్బినది. నరసభూపాలీయ రచనాకాలమున కాతనికి ఆ బిరుదము లేదు; కాన అందు మూర్తికవి తన పేరినే చెప్పికొనెను. తండ్రికి బిరుదమున్నందున ఆ బిరుదనామమునే యుపయోగించి మొదటి పేరి నుపేక్షించెను. వసుచరిత్ర రచనకుముందే అతనికి బిరుదలాభము కలిగినది. కావున పయి గ్రంథద్వయమున ఆనామమునే యుపయోగించి కొనెను. అప్పుడు తన తండ్రి పేరు 'సూరపరాజు' అని చెప్పుట దోషము కాఁజాలదు.

౨. మూర్తికవి తొలుత హనుమద్భక్తుఁడు. క్రమక్రమముగ ఆ హనుమద్భక్తి ఎక్కువయి అతఁడు శ్రీరామచంద్రుని భక్తుఁడయ్యెను. అప్పుడును మూర్తికవికి హనుమంతునియెడ భక్తి కొఱవడలేదు. కావుననే వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానముల గద్యలలో రామచంద్రునితో పాటు పవననందనుఁడును పేర్కొనఁబడి యున్నాఁడు. ఒక దేవతయందు భక్తియున్నచో వేఱొక దేవతయం దుండరాదని నియమము లేదు.

౩. నరసభూపాలీయము లక్షణగ్రంథము. శాస్త్రీయవిషయ వివేచనమునకే కాని కవితా చమత్కార ప్రదర్శనమున కది తగిన యవకాశము నీయఁజాలదు. తక్కినవి ప్రబంధము లగుటచే తత్ప్రదర్శనమున కత్యంతము ననుకూలములు. కావున శైలిభేదమును విభిన్న కర్తృత్వమున హేతువు కాఁజాలదు.

భేదవాదులలోఁ గొందఱు 'రామరాజభూషణ' పదము బిరుదవాచకము కాదనియు, భట్టుమూర్తి రామరాజసభకు భూషణప్రాయుఁడుగాని రామరాజునకు భూషణము కాఁజాలఁడనియు, పయిపదము బిరుదవాచకమే యైనచో 'రామరాజసభాభూషణ-' వంటిదేదో యొకటి యుండవలెననియుఁ జెప్పుచున్నారు. కాని యియ్యది యభేదవాదమును ప్రతిఘటించుటలో నసమర్థము. శాకప్రియుఁడగు పార్థివుఁడు శాకపార్థివుఁడును, దేవపూజకుఁడగు బ్రాహ్మణుఁడు దేవబ్రాహ్మణుఁడు నయినట్లు మధ్యమపదలోపి సమాసాశ్రయణమున 'రామరాజభూషణ' పదమునకు 'రామరాజ సభాభూషణ' అనురీతి నర్థమును గ్రహింప వీలగును. కాని పయిసమాసము-ఎచటనో, అగతికమగు నపుడే విధిలేక యాశ్రయింపఁబడును. అప్పుడు పయిపదము బిరుదవాచము కాక వ్యక్తి వాచకమే యనువారి మతమునఁ గూడ దాని యౌచిత్యము విచారణీయమే కదా!

మూర్తికవి రామరాజభూషణు లభిన్నులనుటకు ముఖ్యమగు కారణము లివి :—

౧. వసుచరిత్ర వ్యాఖ్యాతయగు సోమనాథకవి తత్కర్త భట్టుమూర్తియనియే చెప్పియున్నాఁడు. ౨. ఆంధ్రకౌముదీ వివరణమున '... ముప్రత్యయాభావస్యాల్లసాని పెద్దనార్యస్య శిష్యేణ భట్టుమూర్తి మహాకవి నా విరచితే వసుచరిత్రే[1] ' అని వసుచరిత్ర, భట్టుమూర్తి కృతమనియే చెప్పెను. ౩. 'అల్లసాని పెద్దన అటునిటు నేర్చె, ముక్కుతిమ్మన్న ముద్దుముద్దుగా నేర్చె, భట్టుమూర్తి బావురని యేర్చె' అని తెనాలిరామలింగని కర్తృకముగఁ జెప్పఁబడు కథాసంప్రదాయమునుబట్టి, భట్టుమూర్తి యేడ్పున కుదాహృతమగు పద్యము వసుచరిత్రములోని 'ఆ జాబిల్లి వెలుంగు' అనునదగుటఁబట్టి పయివాదమునకే బలము కలుగుచున్నది. పయి కథ యథార్థము కాకున్నను, దీనివలన భట్టుమూర్తియే వసుచరిత్రకర్తయని లోకుల వ్యవహారమని మాత్రము నిశ్చయింప వచ్చును.

మూర్తికవికిఁ దిరుమలరాయల యొక్కయుఁ, దదగ్రజుఁడగు రామరాయల యొక్కయు నాశ్రయము లభింపకపూర్వ మతఁడు వారి మేనల్లుఁడగు ఓబళ నరసరాజు నాశ్రయించి, తన కావ్యాలంకార సంగ్రహము నాతనికిఁ గృతినిచ్చి,తన్మూలముగ రామరాయలయాశ్రయమును సంపాదించి, యాతని దయకుఁ బాత్రుఁడయ్యెను. ఆ యనుగ్రహమే కవికి 'రామరాయభూషణ' బిరుదలాభమును—అనన్యసామాన్యమును లభింపఁజేసినది.

ఇతఁడు శ్రీకృష్ణదేవరాయల యాస్థానములోని యష్టదిగ్గజములలోనివాఁడని ప్రతీతి. కృష్ణరాయల సమకాలీనుఁడగు అల్లసాని పెద్దనామాత్యుఁ డీతనికి గురువని యాంధ్రకౌముదీ వివరణముఁబట్టి, కథలనుబట్టి తెలియుచున్నది. శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు 'జీర్ణకర్ణాటరాజ్య చరిత్రము'న రామరాజభూషణుఁడు కృష్ణదేవరాయల యాస్థానములోని వాఁడు కాఁడని వ్రాసియున్నారు.[2] 'అతని వసుచరిత్రయందలి

చ. తిరుమలరాయశేఖరుని
 దురవమూభటధాటి యాజిభీ
కరయవనేశ్వర ప్రహిత
 ఖాసబలంబుల జక్కఁజేయు ని
ద్ధరఁ బెనుగొండ కొండలును
 దర్వీపచర్మకపాల మాలికా
పరికర భూషితంబులయి
 బల్విడిఁగాంచె గిరీశభావమున్. [౧౫౯౭

అను పద్యముచే క్రీ. శ. ౧౫౭౭] సంవత్సరమున జరిగిన పెనుగొండయుద్ధము సూచింపఁబడుచున్నందున నంతకుఁబైగా నతఁడు జీవింపవలసి యున్నది. క్రీ. శ. ౧౫౩౦ నాటికే కృష్ణదేవరాయలు కీర్తిశేషుఁడయ్యెను. కానఅతని కాలమున భట్టుమూర్తికవి యుండుట పొసఁగదు' అని శ్రీ పంతులుగారి యభిప్రాయము. కాని మూర్తికవి క్రీ. శ. ౧౫౧౦ వ. సం. ప్రాంతమున పుట్టినాఁడనుకొన్నచో

1. ఆంధ్రకవుల చరిత్రము; ద్వితీయభాగానుబంధము. పు. ౧౯౭.

నతఁడు క్రీ. శ. ౧౫౩౦ సం. వఱకు రాజ్యమేలిన కృష్ణరాయల యాస్థానపండితుఁడగుట కాని, ౧౫౮౦ సం. కుఁబైగా జీవించియుండుట కాని యసంభవము కాజాలదు. సుమారెనుఁబది సంవత్సరముల వఱకు జనులు జీవించియుండుట యిప్పటికిని గలదుకదా! రామరాజు (కృష్ణదేవరాయల యల్లుఁడు) కృష్ణదేవరాయల కాలమందును, అంతకుఁ బూర్వమును వీరుఁడై సేనలను నడిపించినట్లు జీర్ణకర్ణాట రాజ్యచరిత్రమున నే (పుట ౨౫౦) కలదు. అళియరామరాజు క్రీ. శ. ౧౫౬౫ వ సంవత్సరపుఁ దల్లికోట యుద్ధము నాఁటికి సయితము సమర్థుఁడై యున్నట్లు చరిత్రకారులందఱును వ్రాసియున్నారు. అట్టిస్థితిలో నతని కాలపువాఁడగు భట్టుమూర్తి మాత్రము కృష్ణరాయల కాలమునఁ బండితుఁడు కాకుండుటయు, క్రీ. శ. ౧౫౮౦ కిఁబైగా జీవించకుండుటయు సంభవములు కావు.

కృష్ణరాయల కాలమునాఁటికి మూర్తికవి బాలకవి కావచ్చును. విద్యావ్యాసంగమున నుండుటచే నప్పుడతఁడే గ్రంథములను వ్రాయక పోయియుండవచ్చును. కృష్ణరాయల కాలమునాఁటి యతని చాటువులు చాల ప్రచారమున నున్నవి.

భట్టుమూర్తి రచించిన మూఁడు గ్రంథములే మనకు లభించినవి. అవి ౧. (నరసభూపాలీయము) కావ్యాలంకార సంగ్రహము; ౨. వసుచరిత్రము; ౩. హరిశ్చంద్ర నలోపాఖ్యానము. వసుచరిత్రము నందలి 'శ్రీ రామక్షితిపున్[1] అను పద్యముంబట్టియు, హరిశ్చంద్ర నలోపాఖ్యానము నందలి 'వనధిలంఘన'[2] అను పద్యపాదముంబట్టియు నితఁడు చాలకృతులను, గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. 'వసుచరిత్రాదికావ్యప్రీత' అనునపుడాదిశబ్దమున హరిశ్చంద్ర నలోపాఖ్యానమును గ్రహించిన బాధకము లేదు

రామరాజభూషణుఁడు సంగీత కళారహస్యవేది. తత్కళాభిలాషి. అతఁడు తన్నుగురించి 'సంగీత కళారహస్యనిధి' నని చెప్పికొనియున్నాఁడు. అతని పద్యము లనేకములు సంగీత విషయప్రచురములు; మఱియు రామరాజు గాన నాట్యాదిప్రియుఁడు; కావున తన యలంకారగ్రంథ కృతిపతియగు నరసరాజు నాశ్రయమున మూర్తికవి రామరాజు బ్రాపుఁ జెంది యాతని కభీష్టములగు 'బహు సంస్కృతాంధ్రకృతు'లను (పాటలను) రచించి యాతని వలన నసమాన గౌరవములను పొందియుండవలెను.

శ్రీ వీరేశలింగము పంతులుగారు రామరాజభూషణుని వసుచరిత్రమే తొలిగ్రంథమని, నరసభూపాలీయము రెండవగ్రంథమని చెప్పి, అందులకు 'హరిశ్చంద్ర నలోపాఖ్యానము' లోని 'వసుచరిత్రాది కావ్యప్రీత' పదము ప్రమాణీకరించి యున్నారు. వసుచరిత్రము తొలిగ్రంథమగుటచేత నే కవి దానినే తొలుతఁ జేర్కొనెనని వారి యభిప్రాయము. అట్టి నిర్దేశము కవికృత గ్రంథములలో నదియే ప్రధానమను నంశమును తేటపఱచునుగాని ప్రథమమను నంశమును తెలుపదు. శ్రీనాథుఁడు 'నైషధాది మహాప్రబంధములు పెక్కు' అని కాశీఖండమునఁ జెప్పికొనినాఁడు. అచట నిదేరీతి నైషధమతని రచనలలో నుత్తమమనవలెను. అదే మొదటిదనినచో 'చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర' మను స్వవచనమునకే వ్యాఘాతమగును.[3]

వసుచరిత్రమాఱాశ్వాసముల ప్రౌఢప్రబంధము; ప్రబంధములకెల్ల తలమానికము. కోలాహల పర్వతమునకు, శుక్తిమతీనదికిని గలిగిన గిరికయను కన్యను నుపరిచరవసువు వివాహమాడుట యిందలి కథాంశము. ఇది కల్పనలకు గని; అలంకారముల కాటపట్టు; సూక్తిరత్నములకు సుధాసింధువు; ఉత్తమోత్తమమగు

1. 'శా. శ్రీరామక్షితిపున్ మదగ్రజు జయశ్రీలోలు నానాకళా
పారీణుం బహుసంస్కృతాంధ్రకృతులం బల్మారు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహార హయవేదండాగ్రహారాది స
త్కారంబందితి రామభూషణకవీ! ధన్యుండ వీవన్నిటన్.' [౧-౧౪]

2. 'వసుచరిత్రాదికావ్యప్రీత బహునృపప్రాపితానేక రత్నప్లవుండ.' [౧-౫౩]

ధ్వనికావ్యము. కావ్యమయ్యును నాటకపద్ధతి నిందుఁ జాల కూర్పబడి సొంపు పెంపొందింపఁబడినది. ఈ ప్రబంధపు పోకడలను, వర్ణనా విధానములను గ్రహించి వ్రాయఁబడిన ప్రబంధములకుఁ బ్రాశస్త్యము కలిగి 'పిల్ల వసుచరిత్రము' లను బిరుదలాభము కలిగినది. దానింబట్టియే వసుచరిత్రప్రాశస్త్యము నందఱును గుర్తింపఁ గలుగుదురు.

హరిశ్చంద్ర నలోపాఖ్యానము ద్వ్యర్థి కావ్యము. శ్లేషకావ్యములలో నిది మిన్నయను పేరుపొందినది. ఇందు హరిశ్చంద్ర, నలకథలు రెండును ప్రతిపద్యమునను వచ్చునట్లు కూర్పఁబడినది. ఇది కేవలము శ్లేషకావ్యమే కాక వ్యంగ్యార్థము లనేకము లుండుటంబట్టి యుత్తమకావ్యముకూడ నగుచున్నదని పండితుల యాశయము.

౨

కావ్యాలంకార సంగ్రహమునకు విద్యానాథ పండితుడు సంస్కృతమున రచించిన ప్రతాపరుద్రయశోభూషణము మూలము ఈ 'తెలుఁగు నరసభూపాలీయము'నకు మూలము 'సంస్కృత నరసభూపాలీయ' మున్నదనియు, దానిని మూర్తికవి పితృవ్యపుత్రుఁడు రచియించెననియు, నా మూలగ్రంథము తమవద్ద నున్నదనియు, శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు చెప్పుచున్నారు. కవిగారు చెప్పినటులు దీనికి మూలము సంస్కృత నరసభూపాలమయినను, అది ప్రతాపరుద్రీయమునకు అనుకృతిమాత్రము కావలెను. తెనుఁగు నరసభూపాలీయమును పరిశీలించి చూచినచో నది ప్రతాపరుద్రీయము ననుసరించినట్లే తోఁచును. ఇంతకును శ్రీరామకృష్ణకవిగారు సప్రమాణముగ నిశ్చయించువఱకును దీనికి మూలము ప్రతాపరుద్రీయమే యనుకోనవలెను.

నరసభూపాలీయమునందుఁ బ్రతాపరుద్రీయమున లేని విషయములు కొన్ని చేర్పఁబడినవి; ఉన్నవి కొన్ని విడువఁబడినవి; కొన్ని మూలము రీతిని గాక వేఱొకరీతిని వివరింపఁబడినవి. నాయికాభేదములను తెలుపు సందర్భమున నింను మూలమున లేని ధీరాదిభేదములు చెప్పఁబడినవి; అట్లే కొన్ని క్షుద్రకావ్యభేదములు-కళికోత్కళికాదులు వివరింపఁబడినవి. మూలమునఁగల శాస్త్రవిషయక చర్చలు విడువఁబడినవి. కథ, ఆఖ్యాయికా భేదము నాటక ప్రకరణమంతయు త్యక్తములు. విద్యానాథుఁడు భోజుని మతము ననుసరించి యిరువదినాలుగు గుణముల నంగీకరింపఁగా మూర్తికవి యా విభాగమును విడిచి, కావ్యాదర్శాదులలో నున్నయట్లు పదిగుణములనే లెక్కించెను. లక్షణనిరూపణమున మాత్రము ప్రతాపరుద్రీయమునే యనుసరించెను. అర్థాలంకారములలో గీర్వాణ వ్యాకరణ సంబద్ధములగు భేదములను విడిచెను.

సంస్కృతమున రూపక వాఙ్మయము చాల ప్రాచీనకాలమునందే వెలసెను. లక్ష్యము ననుసరించి యాలంకారికులు లక్షణములను వ్రాసిరి. ఆంధ్రమునఁ బందొమ్మిదవ శతాబ్దపుఁ జివరి వఱకు దృశ్యవాఙ్మయము వెలువడలేదు. మూర్తికవి కాలమున నది లేదని వేఱుగఁ జెప్పఁబనిలేదు. లక్ష్యములేనందున లక్షణకరణ మనావశ్యక మైనది. కావున మూర్తికవి మూలమున నున్న నాటక ప్రకరణము నాంధ్రీకరింపక విడిచిపెట్టెను.

నరసభూపాలీయ మైదాశ్వాసముల గ్రంథము; మూర్తికవి దీనిని కావ్యముగను, ప్రబంధముగను చెప్పికొనినాఁడు.[1] ఇది కావ్యలక్షణము కాని కావ్యము కాదు. సంస్కృతమున 'ప్రబంధ' పదము గ్రంథసామాన్యపరముగ వాడఁబడుచున్నది. ఆంధ్రమున 'ప్రబంధము'నకుఁ గావ్యమను నర్థమే ప్రసిద్ధము. పద్యరచన 'ప్రబంధము' అదియే కావ్యము. కావున నిదియు నట్టిదే! కవి రచించిన దనుభావమే కావ్యమనుటకుఁ గారణమయి యుండవచ్చును.

ఇందుఁ బ్రథమాశ్వాసమున నాయకగుణములు మూలానుసారముగ వివరింపఁబడినవి. పీఠికయందే ప్రతాపరుద్రీయ పీఠికయందలి విషయములు కొన్ని చెప్పఁబడినవి. నాయకగుణ

1. ఉ. 'నీ వొనరింపఁబూనిన యనేక మహాకవివాఙ్మయోపహా
రావహమైన కావ్యము మదంకితమై వెలయంగ' [౧-౧౬]
'కావ్యాలంకార సంగ్రహం బను మహాప్రబంధంబునందు'

నిరూపణ మయిన పిదప నాయకస్వరూపము వివరింపఁబడినది. ద్వితీయాశ్వాసమున ధీరోదాత్తాది నాయకుల స్వరూపములు, భేదములు, దక్షిణాది శృంగార నాయకుల స్వరూపోదాహరణములు, స్వీయాది నాయికలయు, ముగ్ధాద్యవాంతర నాయికలయు, స్వాధీనపతి కాద్యష్టవిధనాయికలయు లక్షణోదాహరణములు, కావ్యస్వరూపము, అభిధాదివృత్తుల లక్షణము, వృత్తి, రీతి, పాక, ధ్వని, గుణీభూతవ్యంగ్య, క్షుద్రకావ్య స్వరూపములు వివరింపఁబడినవి. తృతీయాశ్వాసమున స్థాయిభావ, విభావానుభావ, సాత్త్విక, సంచారిభావములు, శృంగారావస్థలు, శృంగారచేష్టలు, భావోదయాదులు, రససంకరము లక్షణోదాహరణములతో సంగ్రహింపఁబడినవి. చతుర్థాశ్వాసమున పదవాక్యార్థ దోషములు, దశవిధగుణములు, శబ్దాలంకారములు, చిత్రము మొదలగు వానికి లక్షణోదాహరణము లీయఁబడినవి. పంచమాశ్వాసమునం దర్థాలంకారములకుఁగల పరస్పరసంబంధము, వాని భేదములు, మిశ్రాలంకారములు వివరింపఁబడినది.

నరసభూపాలీయ మిదివఱకుఁ బలువురిచేఁ బలుసారులు ముద్రింపఁబడినది. కాని యెవరును సవిమర్శముగఁ బరిశోధించి ముద్రించినట్లు తోఁచదు. ఇందలి తృతీయాశ్వాసమగు రసప్రకరణమును, ద్వితీయాశ్వాసములోని నాయికానాయక భేదములతోఁ జేర్చి సవిమర్శముగ, సవ్యాఖ్యానముగ బ్ర. శ్రీ. వెల్లాల సదాశివ శాస్త్రులుగారు ప్రకటింపించిరి. కాని యది యేకాశ్వాసమే. వ్యాఖ్యానమున నచ్చటచ్చట మూలమునందలి యసందర్భములు, నపపాఠములు బాగుగ విచారించి ప్రదర్శింపఁబడినవి. సమగ్రముగఁ బ్రకటింపఁబడిన ప్రతులలో శ్రీ వావిళ్లవారు ప్రకటించినది కొంత మేలు. వారు తగుమాత్రపు పీఠికతో (విమర్శతో) దానిని ప్రకటించినారు. ఒక ముద్రణమున దొరలిన స్ఖాలిత్యమును వేఱొక ముద్రణమున వారు సవరించుచునే యున్నారు. కాని పరిశోధన మసమగ్రము. కాని వాని పీఠికయందుఁ గల విమర్శనము ప్రబంధవిమర్శనముఁబోలి కవిత్వపాకమును, కల్పనలను, శబ్దద్వయమైత్రిని విమర్శించున దయియున్నది. ఈగ్రంథ మలం

ర్శింపఁదగిన యంశము లింద నేకము లున్నవని స్పష్టపడును.

మూర్తికవి కవులలో మిన్నయనుటకు సందేహ మేమియు లేదు. కాని పాండిత్యమున- అందును నలంకారశాస్త్ర పాండిత్యమునఁ గూడ నట్టివాఁడే యని చెప్పజాలము. కవిత్వము వేఱు; పాండిత్యము వేఱు. కవులని ప్రసిద్ధిఁ జెందినవారు శాస్త్రనిర్మాతలగుట యరుదు. శాస్త్రనిర్మాతలు కవిత్వమున జనులను రంజింపఁ జేయుటయు కష్టము కవులు వ్రాసిన శాస్త్రగ్రంథములలో సిద్ధాంతముల పట్టున లోపములు కన్పించుట సహజము. నరసభూపాలీయమునందుఁ గవిత్వము మంచి పాకమునఁ బడి సర్వజన హృదయావర్జకమయి యున్నది; కాని శాస్త్రీయ విషయ ప్రతిపాదనమునఁ గొన్ని లోపములు కానవచ్చుచున్నవి మచ్చునకుఁ గొన్ని —

౧. మూలగ్రంథకారుఁడగు విద్యానాథుఁడు "పూర్వేభ్యో భామహాదిభ్యః సాదరం విహితాంజలిః, వక్ష్యే సమ్యగలంకారశాస్త్ర సర్వస్వ సంగ్రహమ్." అని ప్రాచీనాచార్య నమస్కృతి నొనరించెను; కాని భామహాదు లేయే విషయములను ప్రతిపాదించిరో చెప్పలేదు. మూర్తికవి నామనిర్దేశమాత్రమునఁ దృప్తిపొందక 'సీ. నిజరూపమునకు వన్నెయు దెచ్చు వేస్రోక్కు, బెళుకొందు ధ్వని హీరకళికలమర,......... భామహాదుల ననిశంబు ప్రస్తుతింతు' [౧-౧౦] అని భామహాదులు యోగ్యము లొనర్చిన కావ్య సామగ్రినికూడ వివరించెను. ఈ నిరూపణ సరికాదు. భామహుని కాలమునాఁటికి ధ్వనివాదము పుట్టనేలేదు. అతఁ డలంకార మార్గవాది. మూలకారుఁ డీయంశముం జెప్పక తప్పుకొనెను; మూర్తికవి తప్పుదారింబోవఁ దలఁపడెను.

౨. ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంతులని నాయకులు నాల్గువిధము లగ నుందురు వీరందఱు విభిన్నులు. ధీరోదాత్తుఁ డెన్నఁడును ధీరోద్ధతుఁడుగాని, ధీరలలితుఁడు కాని, ధీరశాంతుఁడు కాని కాఁడు. మూలకారుఁడు ప్రతాపరుద్రుఁడు ధీరోదాత్తుఁడని, యుద్ధభటులు ధీరోద్ధతులని, కాకతీంద్రుఁడు ధీరలలితుఁడని, రాజాశ్రితబ్రాహ్మణులు ధీరశాంతులని యుదాహరణములతో వివరించెను.

తిరిగి 'ఈ......యింతుల రత్నహారముల సెల్ల ధనంబుల నిచ్చి కొల్వని, శ్చింతితదాల్చ నోబయ నృసింహుఁడు భోగకళాప్రవీణుఁడై.' [నర గ. ౨-౭] అని ధీరలలితునిగఁ జెప్పెను. ఇది సరికాదు.

౩. మూలమునం దనుకూల నాయక లక్షణము ఇట్లున్నది. 'ఏకాయత్తోఽనుకూలః స్యాత్ ఏకస్యాం నాయికాయాం విశేషానురక్తోఽనుకూలనాయకః' అనఁగా ఒక్క నాయికయందు విశేషానురాగము కలవాఁడనుకూలనాయకుఁడని యర్థము. అనుకూలునకు భార్యలు పెక్కు ఉండవచ్చు; అందరి యెడలను అనురాగ ముండవచ్చును; ఒక్క నాయికయం దందఱికంటె నెక్కువ యనురాగమున్నఁ జాలును. మూర్తికవి 'చ...యొక్క కాంతకే, వలచి గుణాభిరాముఁ డగువాఁ డనుకూలుఁడు.' అని చెప్పెను. ఈ యనుకూల లక్షణమును బట్టియు, '...నోబభూపసం, దనుఁడగు నారసింహుఁడిల దానరమాప్రియుఁడయ్యె నెంతయున్' అను నుదాహరణ భాగమునుబట్టియు, నాయికకు నాయకునియం దెక్కువ యనురాగ ముండవలెనను విపరీతార్థావగతి కెక్కువ యవకాశమున్నది.

౪. ఉపమానమును జెప్పి యుపమేయముం జెప్పక, యా రెండింటికి నభేదము చెప్పుట యధ్యవసాయము. దానితోఁ గూడిన లక్షణ సాధ్యవసాయలక్షణ. మూలమున దీనికి 'కాకతీయ వంశపారావారమున చంద్రుఁడు పుట్టె'నని యుదాహరణము కలదు. అచట నుపమానమగు చంద్రపదమే కలదు ఉపమేయ వాచకమగు ప్రతాపరుద్ర పదములేదు. చంద్రప్రతాపరుద్రుల కిచట నభేదము.

పయి లక్షణ కుదాహరణముగ మూర్తికవి 'క...పోచి రాజవంశ, స్థిరరత్నస్తంభమున నృసింహుఁడు పుట్టెన్.' [౨-౬౫.] అని వ్రాసెను. ఇచట 'నృసింహ'పదము శ్లిష్టము. అది యుపమానమును, ఉపమేయమును గూడఁ గావచ్చును. ఇది సాధ్యవసాయోదాహరణము కావలెనన్న నృసింహశబ్దము తీసివేసి వేఱొక శబ్దమును జెప్పుట యుచితము.

౫. వ్యంజకము శబ్దమువల్లనే గాక వాచ్యార్థముల వల్లను వ్యంగ్యార్థ ప్రతీతి కలుగును. కావున నట్టియెడ వ్యంగ్యార్థమున కర్థాంతర సమేతత్వము (వేఱొక యర్థముతోఁ గూడి యుండుట) కలదు. అది దానికి సామాన్య ధర్మము. లక్షణామూలవ్యంగ్యము అత్యంత తిరస్కృతము, అర్థాంతర సంక్రమితము నని రెండువిధములు ప్రకృతానుపయుక్తమగు నర్థము వ్యంగ్యార్థమున సంక్రమించినచో అర్థాంతర సంక్రమితమగును. రాముఁడు తన్నుగూర్చి చెప్పికొనునపుడు 'రాముఁడను గాన సర్వమును సహింతు'ననుచో, తాను రాముఁడనని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఆ పదమచట నుపయోగములేనిదయి 'సీతావియోగాదులనుసహించినవాఁడ'నను వ్యంగ్యార్థమున సంక్రమించుచున్నది. ఈ యర్థాంతర సంక్రమితము నరసభూపాలీయమునఁ జాలచోట్ల 'అర్థాంతరసమేత' మని చెప్పఁబడినది. వ్యంగ్య సామాన్యధర్మమగు నర్థాంతర సమేతత్వము వ్యంగ్యభేదమును తెలుపఁజాలదు.

౬. వాచ్యార్థానుపపత్తి, వాచ్యార్థముతోడి సంబంధముకల లక్షణ ననుసరించి వచ్చు వ్యంగ్య మత్యంత తిరస్కృతావివక్షిత వాచ్యమనఁబడును 'గంగయందు గొల్లపల్లె కల'దని చెప్పినపుడట్లుండుట యసంభవము; అచట గంగకుఁ, దీరమునకు సామీప్య సంబంధ మున్నది కావున 'గంగయొడ్డున గొల్లపల్లె కల'దను లక్ష్యార్థము కలుగును. దానివలన పల్లెయొక్క చల్లఁదనము, పవిత్రత మొదలగు గుణములు వ్యంగ్యములగును. మూర్తికవి పయిధ్వనికి 'క. ఖరఖుర...ఖరకర తురగోత్కరమై, కర మమరు నృసింహధాటి కాహంయ మనఁగన్' అని యుదాహరించి అతిక్రమింపఁబడిన సామ్యముగల సూర్యాశ్వములు కలదను బహువ్రీహి సమాసమున 'తిరస్కృత స్వార్థము' కలదని వ్రాసెను. [౨-౧౧౩, ౧౪౪.] ఇది సరికాదు ఇందలి వ్యంగ్యార్థమును కవి వివరింపలేదు. బహువ్రీహి యందు 'కలవాఁడు, కలది' అనునవి వాచ్యములు కాకపోవుటచే ఆ సమాసము లత్యంత తిరస్కృతములని కవి పొరపడియుండవలెను.

౭. శబ్దశక్తి మూలాలంకారధ్వనికి [1]'కోమలి పద్మిని; నరసరాజు ఇనుఁడు. తత్కర సంస్పర్శనమున నీ యామె చెలఁగును'

[illegible]

అని యుదాహరణము. ఇచటఁ బద్మినీ, ఇన శబ్దములు నానార్థకము లయినను [పద్మిని = కమలిని, పద్మినీజాతిస్త్రీ, ఇనుఁడు = సూర్యుఁడు, రాజు.] ఇది శబ్దశక్తిధ్వని కుదాహృతి కాఁజాలదు. దానియందన్ని పదములును శ్లిష్టములు కావలెను. అట్టి పదములు ప్రకృతార్థము నేగాక యప్రకృతార్థమునుగూడ తెలుపును. అప్రకృతార్థ కథనము అసంబద్ధము కాకుండుటకై వాచ్యప్రతీయమానముల కుపమానోపమేయ భావముగాని యభేదభావముగాని కల్పింపఁబడును. పయి యుదాహరణ పద్యమునఁగల 'కోమలి, నృసింహా! ఘనబలసింహా!' అను పదము లశ్లిష్టములు. ఇచట కోమలీ కమలినులకు, రాజసూర్యులకు నుపమానోపమేయ భావము వ్యంగ్యమువలనఁ గలిగినను, శబ్దశక్తిధ్వనిలక్షణా సంఘటితమగుట ధ్వని కాఁజాలదు. వ్యంగ్యమంతయు ధ్వనియే యగునను నియమము లేదు.

౮. స్వతః సిద్ధార్థ శక్తిమూలాలంకారకృత వస్తుధ్వనికి '(నరసరాజుగారి) - చాయయశోవధూమణికి సారసవైరి ముఖంబు; తారకల్ సారనఖాంకురంబులు; శంకరశైల, హిమాద్రులాత్మరక్షోరుహాముల్; సితాబ్జములు సొంపగు లోచన పంకజాతముల్.' [౨-౧౨౩] అని యుదాహరణ మీయఁబడినది. ఇచటఁ బరిణామము వాచ్యమగు నలంకారమనియు, దానివలన నరసవిభుని కీర్తి ముల్లోకములు నిండుననునది వ్యంగ్యమనియు సమన్వయము చేయఁబడినది. ఇచట వాచ్యమగు నలంకారము రూపకము; పరిణామముకాదు. కీర్త్యాదులగు నుపమేయములందుఁ గాంతాత్వాద్యుపమానత ఆరోపింపఁబడిన రూపకమని, ఉపమానమం దుపమేయత యారోపింపఁబడిన పరిణామమని యాలంకారిక సిద్ధాంతము. 'ఆమె దృగబ్జమున వీక్షించుచున్న' దనునపుడు ఉపమానమగు నబ్జము వీక్షణ క్రియోపయోగి కాఁజాలనందునఁ దత్ప్రయోజనార్థ మది దృక్కుగాఁ బరిణమించును. అది పరిణామమగును. కాన మీఁది వివరణము తప్పు. మఱియు 'సితాబ్జములు లోచనము' లన్నఁజాలును. 'లోచన పంకజాతముల్' అనఁ బనిలేదు.

౯. చిత్రకావ్యమున కుదాహరణముల నిత్తునని చెప్పియు ఈయనేలేదు.

౧౦. 'నాయికా నాయకులలో నొక్కరికే యనురాగమున్నను; ఆ యనురాగము ఉభయనిష్ఠమైన తిర్యఙ్మ్లేచ్ఛవిషయక మయినను; ఒక్క స్త్రీకి పెక్కుగు పురుషుల యం దనురక్తి యున్నను రసాభాసమగు'నని ప్రతాపరుద్రీయమునందలి రసాభాసలక్షణము. నరసభూపాలీయమునందు మాత్రము 'పలువుర కొకకామిని పయి వలపున్నను, ఒక్కవారసతికిఁ బలువురిపై వలపున్నను, మృగవిహాగాదుల వలపు నిబద్ధమయినను రసాభాసమగు'నని చెప్పఁబడినది. ఇది మూలముకంటెఁ జాల వేఱయినది. [౩-౧౪౪] మూలమందలి 'ఒక్కరికే ప్రేమయుండుట, అనురాగము మ్లేచ్ఛగతమగుట' నను భేదము లిందు విడువఁబడినవి. దీనింబట్టి వేశ్యకంటె యితరలగు స్త్రీలకు బహునాయక గతమగునను రాగము రసాభాసము కాదను విపరీతార్థము కలుగుచున్నది.

౧౧. [1]'ప్రకృతోపయోగముగ ఉపమేయమునందు ఉపమానత్వ మారోపించుట పరిణామాలంకార' మని యిందలి లక్షణము. ఇది వఱకు వివరింపఁబడిన (౮.) విషయవివేచనముం బట్టి యిది రూపకలక్షణమగును గాని పరిణామ లక్షణము కాదు. దీని కనుగుణముగనే 'దేవస్త్రీల కౌఁగిలికొఱకు స్వర్గమునకేఁగు శత్రురాజులకు నరసరాజు కత్తి నీలాలనిచ్చెన యయిన'దని యుదాహరణ మీయఁబడినది. ఇచట నుపమేయమగు కత్తియందు నిచ్చెన తన మారోపింపఁబడుటచే నిది రూపకోదాహృతి యగుట యుక్తము. ఈ గ్రంథమునందలి రూపకలక్షణము అస్పష్టముగ నున్నను చివఱకు దీనిలోని పరిణామలక్షణముతోనే సరిపడుచున్నది. పయి యుదాహరణమునకును, రూపకోదాహృతికిని భేదములేదు.

౧౨. అప్రస్తుత వృత్తాంతమువలనఁ బ్రస్తుత వృత్తాంతము గమ్యమానమగుచో నప్రస్తుత ప్రశంసాలంకృతి యగును. దాని కుదాహరణముగ నిందు [౫-౧౭౫.]

1. క. 'ధరలో నుపమేయమునను, నరయంగ నారోప్యమాణమగు నుపమానం

క. 'నవలు తొలుకరిత్రేఁ దేనెలు
చిలికెం జిగురాకు గండెఁ జెదరె నలితతుల్
చనువున నీపూఁదీఁగకు
ఘనమైననృసింహుపొందు కలుగఁగఁబోలున్.'

అని యుదాహరణ మీయఁబడినది. ఇచట పూఁదీఁగ వృత్తాంతమువలన నాయికా వృత్తాంతము తోఁచుచుండుట యుక్తము; కాని 'ఘనమైన నృసింహుపొందు కలుగఁగఁబోలున్' అని వాచ్యముకూడ నిందుఁ బ్రవేశించుటచే నిది సమాసోక్త్యలంకారమున కుదాహృతి కాఁజాలదు. 'నృసింహుపొందు'నకు అప్రస్తుతమగు నర్థమును కల్పించుట యసంగతము.

౧౩. నరసభూపాలీయమున అర్థాలంకార ప్రకరణములో రసవత్, ప్రేయ, ఊర్జస్వి, సమాహితములను నాలుగలంకారముల నామము లీయఁబడినవి; కాని, వాని లక్షణోదాహరణములు లేవు. మూర్తికవి వానిం గూర్చి వ్రాయుచు ఇవి 'అసమరసప్రకరణమున రసభావాద్యుపనిబద్ధ రసములు గానన్' ఇచట వివరింపలేదని వ్రాసినాఁడు. [౫-౨౩౦] దీని కర్థమేమో! కాని రసప్రకరణమున వీని సంగతియే లేదు.

౧౪. దోష నిరూపణ సందర్భమున సంస్కృతమునే యనుసరించి ఛందో, యతి భంగములను మాత్రమే తెల్పి, ప్రాసభంగమును నిరూపింపకుండుట అనుచితము; అది ప్రధాన దోషములలో నొకటి.

౧౫. పరస్పర విరుద్ధవిషయములకు రూపక, పరిణామాలంకార చర్చయుదాహరణము; మచ్చునకు మఱొకటి. మూలమందలి గల్ల, కటిశబ్దములతోఁబాటు ఇందు 'చన్నులు, కన్నులు' కూడ గ్రామ్యములేయని చూడామణి యనుసరింపఁ బడినది, కాని పయి 'దుష్ట' పదములతోఁ గూడిన చక్కని పద్యము-[1] స్వవిరచితము లాటానుప్రాసమను శబ్దాలంకారమున కుదాహరణముగ నీయఁబడినది. [౪-౭౮]

ఈ గ్రంథమునఁ గొన్నియెడల కొన్ని విషయములు చర్చింపఁబడి యీయఁబడిన లక్షణములు చాల అస్పష్టముగ నున్నవి. ఇది లక్షణగ్రంథమైనను పద్యకావ్య మగుటచే ఛందోయతిప్రాససంసిద్ధికొఱకు ఎక్కువలేని పెంపు, అవాచకముల కూరుపు ఎక్కువయినది. కొన్నిట సంప్రదాయములు కొఱవడినవి. మచ్చునకుఁ గొన్ని—

౧. కావ్యములు 'అంగనాజన విలాసాలాప లీలా సమప్రాదుర్భావములు' [పుట ౧౧.] అని యిందుగలదు. 'కావ్యములు కాంతా సమ్మితము' లని దీనింపిడితార్థము. కాంత తన యభీష్టము నుప్రియునకు మాటలచేఁ గాక చేష్టలచే తెలియఁజేసిన నేచమత్కారము. కావున వ్యంగ్య ప్రధానమగు కావ్యమే యుత్తమము. అలంకారికులందఱి మతము నదియే. అట్టికావ్యమే కాంతాసమ్మితమగును. ఇందు దానికి విరుద్ధముగ 'ఆలాపలీలాసమ ప్రాదుర్భావ' అని చెప్పఁబడినది.

౨ రసస్వరూప నిరూపణ సందర్భమున మూర్తికవి 'వారిరి దుఃఖమైన సుఖవైభవమైన విటీవిటాళియుం, దావలపూర్ణమై సహృదయాత్ములఁ గేవలహర్షమై తగున్' [పుట ౬౩.] అని చెప్పెను. నటులందుఁ గాన్పించు సుఖదుఃఖ భావములవలన సహృదయులకు విగళిత వేద్యాంతరమగు నానందము కలుగునని యాలంకారికుల మతము. దీని మూలము 'సుఖంవా దుఃఖంవా నిబిడయతుయూనోః, సహృదయేత్వమందానందాత్మా పరిణమతి పూర్ణోరసభరః' అని యున్నది. విటీవిటాళియందే సుఖదుఃఖములు కలుగవు; అవి యందరియెడను కల్గును. మూలమందలి 'ఆనందము' మూర్తికవి యనువాదమున హర్ష' మయినది. హర్షము సంచారిభావము; అది సంతోషమను నర్థముననే ప్రసిద్ధము. విగళిత వేద్యాంతరమగు నర్థమునకిది యవాచకము.

గ్రంథలోపములతోఁ బాటు పెనుకటి ముద్రణములలో ముద్రణ స్ఖాలిత్యము లనుమెండుగ గలవు. కాని నూతనముగ వెలువడిన సటీకాప్రతి (వావిళ్లవారిది)లో మాత్రము చాలవఱకు లోపములు సవరింపఁ బడినవి.

1. 'చ. ఘనత నృసింహుఁ జూడఁగల కన్నులు కన్నులు; వాని కౌఁగిటం
జనువున నేపుచూపఁగల చన్నులు చన్నులు; వానిమోవికిం
జొనిపిన పాటలాధరము జాణలు జాణలు: వానిమేనఁ జే

## గుడిపాటి కోదండపతి

౧

కేవలము రససామగ్రీ నిరూపకములగు గ్రంథములలో రసమంజరి యొకటి. దీనిని రచించినవాఁడు గుడిపాటి కోదండపతికవి. ఇతఁడు నందవరీకవంశ నియోగిబ్రాహ్మణుఁడు. ఈ నందవరీక వంశమును గుఱించి యొక చిత్రమైన గాథకలదు. దానిని శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ కవులచరిత్రమున (3 వ భాగము. పుట ౪౨౦.) వివరించియున్నారు. దాని సంగ్రహమిది—

"పూర్వము కర్ణాటమును పాలించుచుండిన నందుఁడను రాజు తన యోగమహిమచే యోగపాగముల నెక్కి ప్రతిదినము కాశికిఁబోయి గంగాస్నానముచేసి వచ్చుచుండెను. ఈ రహస్యము బాతని భార్య కనిపెట్టి తన్నుగూడఁ గాశికి దీసికొనిపోవలెనని వేడుకొనఁగా రాజట్లే యొనర్చెను. కాని యచట నామె బహిష్ఠ యగుటచే మైలపడిన యోగవాహనములు తిరిగి కదలలేదు. అంత రాజేమిచేయుటకును దోఁచక గంగాతీరముననున్న సద్బ్రాహ్మణుల సాయము కోరఁగా వారు తనకుఁ గర్ణాటరాజ్యమున వృత్తుల నొసంగునట్లు చండీశ్వరి సన్నిధిని ప్రమాణము చేయఁగోరిరి. రాజట్లే ప్రతిజ్ఞ చేసెను. వారు తమ మంత్రప్రభావమున రాజభార్యను పవిత్రురాలినిగా నొనరించిరి; యోగవాహనములను నడిపించిరి. పిదపఁ గొన్నియేండ్లకు కాశీ ప్రాంతమున క్షామము సంభవింపఁగా ఏనూఱు కుటుంబములవారు కర్ణాటదేశమునకేఁగి తమకు వాగ్దానమొనర్చిన వృత్తుల నీయ రాజును కోరిరి. రాజు కోరికపయి వారు చండీశ్వరిచే సాక్ష్యమిప్పించిరి. రాజు వారి మహిమ కచ్చెరువంది తనపేరిట 'నందవర'మను గ్రామమును కట్టించి దానిని వారి కగ్రహారముగ నిచ్చెను. నందవరమునం దుండువారగుటచే వారు నందవరీకు లయిరి. వీరినే కరణకమ్మలనియుఁ జెప్పుట కలదు."

ఈ కథ యెట్టిదయినను, నందవరీకు లార్యావర్తమునఁ గాటకము సంభవించినపుడు దక్షిణాపథమునకువచ్చి తెలుఁగుదేశమున వృత్తులను సంపాదించుకొన్నది మాత్రము నిజము కావచ్చునని శ్రీ వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము. అలసాని పెద్దన్న, రాయని భాస్కరుఁడు మొదలగువారు కోదండపతి తెగకుఁ జెందినవారే. నందవరీకు లార్యావర్తము నుండి కర్ణాటమునకు వచ్చిరనుటలోఁ బ్రమాణము లింకను కావలసియున్నవి.

కోదండపతి యాశ్వలాయన సూత్రుఁడు. భారద్వాజ గోత్రుఁడు. వేంకశమంత్రి పౌత్రుఁడు. రంగనామాత్యునకును, వీరమాంబకును పుత్రుఁడు. పయి యంశములు రసమంజరి తృతీయ గుచ్ఛపుఁ జివఱనున్న పద్యమునుబట్టి తెలియున్నవి.[1]

కోదండపతికాలము సరిగాఁ దెలియదు; కాని యితఁ డిన్నూఱు సంవత్సరముల క్రిందటివాఁడేమోయని కవులచరిత్రలోఁ గలదు. ఆ యూహకుఁ దగిన యాధారము కావలెను.

౨

రసమంజరి మూఁడుగుచ్ఛముల గ్రంథము; సంస్కృతమున భానుదత్త మిశ్రుఁడు రచించిన కృతి కిది తెలుఁగుసేత. ఇందు మొదటి గుచ్ఛములో ముగ్ధాదినాయికా లక్షణము, ధీరాదుల లక్షణము వివరింపఁబడినవి. రెండవ గుచ్ఛమున స్వాధీనపతిక మొదలగు ఎనిమిది విధముల నాయికలు, ఆ నాయికలలోని ముగ్ధాద్యంత ర్భేదములతోకూడ చెప్పఁబడిరి. మూఁడవ గుచ్ఛములో నాయకలక్షణము, వారియందలి భేదములు స్పష్టపరుపఁబడినవి.

ఈ గ్రంథ మొకసారి చాలకాలముక్రిందట ముద్రింపఁబడినదఁట! కాని ప్రతులెచ్చటను లభింపలేదు.

## అడిదము సూరకవి

౧

తెలుఁగునం దర్థాలంకారములను వివరించు లక్షణగ్రంథములను రచించిన ప్రాచీనులలో 'చంద్రాలోకము' నాంధ్రీకరించిన అడిదము సూరకవి ముఖ్యుఁడు. అడిదమువారిది వసిష్ఠ గోత్రము; సూరకవి తాత చినలచ్చనమంత్రి;

1. [illegible]

తండ్రి భాస్కరామాత్యుడు.[1] ఇతడు క్రీ. శ. ౧౭౨౦ ప్రాంతమున విజయనగర సమీపమునఁ గల భూపాలరాజుపేట యను గ్రామమున జన్మించెను.

ఈకవి కాలనిర్ణయమునుగూర్చి శ్రీఅడిదము రామారావుగారు తమ 'అడిదము సూరకవి' చరిత్రమునందు ప్రమాణముల నిచ్చుచున్నారు. 'సూరకవిగారి మనుమఁడు సూరన ౮౫ సంవత్సరములు జీవించి పోయిన చిత్రభాను సంవత్సరమునఁగాక యిటుక్రిందటి చిత్రభాను వత్సరమునకు ముందటి చిత్రభాను సంవత్సరము ఆషాఢ బహుళపాడ్యమినాఁడు (౧౮౨౩ సం. న) కీర్తిశేషుఁడయ్యెను. దీనింబట్టి ఇతఁడు క్రీ. శ. ౧౭౭౮ సం. న జీవించియుండవలెను. ఇతఁడు తన తండ్రికి ౨౫ వ యేట జన్మించెనఁట! అట్లయిచో సూరకవి కుమారుఁడు బాలభాస్కరకవి క్రీ. శ. ౧౭౫౦ ప్రాంతమున జన్మించియుండవలెను. సూరకవికి ౨౫ సం. ల వయస్సు మించిన తరువాత సంతానము కలిగినట్లు వాడుక. ఈరీతిగా అడిదమువారి కుటుంబము కంబడిదచ్చుచున్న సమాచారములంబట్టి చూచినచో సూరకవి క్రీ. శ. ౧౭౨౦ ప్రాంతమున జన్మించియుండవచ్చునని తోఁచుచున్నది.'

సూరకవి విశాఖపట్టణము మండలములోని విజయనగర సంస్థానమునకు ప్రభువులును, సూర్యవంశ క్షత్రియులునగు శ్రీ పూసపాటి వంశ మహారాజుల కాశ్రితుఁడు; సంస్థానపండిత కవి. శ్రీ విజయనగర ప్రభువులు దుర్గాసాక్షాత్కారమును పొంది తన తపఃప్రభావమునఁ దా నేలు రాజ్యమున నేడుగడియలకాలము సువర్ణవృష్టి కురిపించెనని ఖ్యాతినిగన్న శ్రీమాధవ వర్మ సంతతివారు. ఈ ప్రభువులలోని వారగు శ్రీ పెదవిజయరామ మహారాజులుంగారి కాలమునను, శ్రీ చినవిజయరామ మహారాజులుంగారి కాలమునను సూరకవి జీవించియుండెను. ఇందు మొదటివారగు శ్రీ పెదవిజయరామ మహారాజు గారు బొబ్బిలియుద్ధమున వీరస్వర్గమ నలంకరించిరి. అప్పటికి సూరకవి నిండు జవ్వనమున నున్నట్లు, చాటువులవలన నిశ్చయింపవచ్చును. సూరకవి యొకపద్యములో క్రీ. శ. ౧౭౫౭ సం. న పెదవిజయరామరాజునకును, బాదుల్లా ఖానునకును జరిగిన యుద్ధమునుగూర్చి ప్రసంగించెను. దానింబట్టియు నతఁడు ౧౭౨౦. ప్రాంతమున జన్మించె ననవచ్చును. శ్రీ పెదవిజయ రామరాజుగారు కీర్తిశేషులయిన పిదప నానంద గజపతిరాజుగారు రాజ్యమునకువచ్చి కొలఁది కాలముమాత్రమే రాజ్యముచేసిరి. వారు స్వర్గస్థులయిన తరువాత శ్రీ చినవిజయరామ గజపతి మహారాజులుంగారు రాజ్యమునకువచ్చి క్రీ. శ. ౧౭౬౦ మొదలు ౧౭౯౪ వఱకును రాజ్యము చేసిరి. ఈ మహారాజులుంగారి కాలముననే సూరకవి ప్రతిభ యతిశయించియుండెను.

శ్రీ వత్సవాయి తిమ్మజగపతిరాజుగారి రాజ్యకాలమునఁ బెద్దాపురమున నొకప్పుడు రాజులందఱును సభతీర్చియుండఁగా సూరకవి యొక[2] పద్యమునుచెప్పి తన ప్రభువును స్తుతించెనని వాడుక. శ్రీ తిమ్మజగపతిరాజుగారు క్రీ. శ. ౧౭౫౯ మొదలు ౧౭౯౮ వఱకు నుండినందున శ్రీ చినవిజయరామ మహారాజులుంగారికిని, సూరకవి సమకాలీనుఁడని చెప్పవలెను.

శ్రీ చినవిజయరామ మహారాజుగారి సమకాలికుఁడును, శృంగవరపుకోట జమీందారును ముఖ్యీ కాశీపతిరాజుగారి రెండవ కుమారుఁడును అగు రాజభూపాలరాజు తన బలమును, ఎదిరి బలమును నెఱుఁగక విజయ నగరముమీఁదికి దాడివెడలివచ్చెను. అప్పుడు

1. క. చినలచ్చ మంత్రితనయుని, ననఘుని మజ్జనకు భాస్కరామాత్యమణిన్
గొనియాడెద శ్లాఘాలంఘనజాంఘిక కవనధాటి కలిగిన మేటిన్.

[కవిసంశయవిచ్ఛేదము]

2. ఉ. రాజుకళంకమూర్తి; రతిరాజు శరీరవిహీనుఁ; డంబికా
రాజు దిగంబరుండు; మృగరాజు గుహాంతరసీమవర్తి; వి
భ్రాజితపూసపాడ్విజయరామనృపాలుఁడు రాజుకాక, ఈ

సూరకవి వాని యవివేకమును పరిహసించుచు[1] నొక పద్యము చెప్పెను. దీనింబట్టియు సూరకవి శ్రీ చినవిజయరామమహారాజులుంగారి కాలమున నుండెనని చెప్పవలెను. సూరకవి క్రీ. శ. ౧౭౨౦ ప్రాంతమున జన్మించి, తన యిరువదియైదేండ్ల వయసు వచ్చువఱకును తండ్రిగారియొద్ద భూపాలరాజు రేగయందే కాలము గడపెను. వారి యనంతరము విశాఖపట్టణ మండలములోనిదే యగు చీపురుపల్లికి సమీపమునఁగల రామచంద్రపురమునకు (గుళివిందాడకు) కాపురముమార్చి యామరణాంతము నచటనే యుండెను. అతఁ డాగ్రామమున నివసించినను, శ్రీ విజయనగరప్రభువులనే యాశ్రయించి, వారిచ్చిన యినాముభూముల ననుభవించెడివాఁడు. క్రీ. శ. ౧౭౯౪ వ సం॥న పద్మనాభమున ఆంగ్లేయులతో జరిగిన యుద్ధమున వీరస్వర్గమలంకరించిన తన ప్రభువు, శ్రీ చినవిజయరామగజపతిమహారాజుగారికంటెఁ దొమ్మిదేండ్లు ముందుగా-అనఁగా-౧౭౮౫ ప్రాంతమున నీ కవిశేఖరుఁ డస్తమించెను.

సూరకవి నివాసస్థానమగు రామచంద్రపురము ప్రస్తుతపు తూర్పుగోదావరిజిల్లాయందలి కోటరామచంద్రపురమనియు, నతఁ డప్పుడప్పుడు విజయనగరమునకు వచ్చి తన్మహారాజుల యాశ్రయమును సంపాదించి యాస్థానకవియయ్యెననియుఁ వీరేశలింగముగారు వ్రాసియున్నారు. సూరకవి చాటుపద్యములు చాలవఱకును విజయనగర ప్రాంతములకే సంబంధించియున్నవి. వేఱొక కవితోఁ బద్యరూపముగ సూరకవికి జరిగిన సంభాషణను బట్టి యతఁడు చీపురుపల్లి నివాసియనుట స్పష్టము.[2] చీపురుపల్లి రామచంద్రపురము (గుళివిందాడ) కలిసియేయున్న గ్రామములు. ఆరెండిటను చీపురుపల్లియే పెద్దది. కావున సూరకవి ఆ పేరే చెప్పెను.

అడిదమువారిది పండితవంశము. పూర్వము ఈ వంశపురుషులు ఏనుఁగులపయి గ్రంథముల నుంచుకొని దేశాటనము చేసెడివారఁట! అందుచేఁ దొలుత వీరి ఇంటిపేరు 'గ్రంథవారణము' వారు. వీరి వంశములో నొకఁడగు నీలాద్రికవి యొకయుద్ధమునఁ దన ప్రభువుతోఁ గూడ రణరంగమున కరికి పగతురను గెలిచెనఁట! రాజు సంతోషించి యతనికి 'అడిదము'ను (కత్తిని) బహుమతిగా ఇచ్చెనఁట! అప్పటి నుండియు నీ వంశమువారికి 'అడిదమువా'రని యుపనామము కలిగినది. సూరకవి వేషముకూడఁ బండితులరీతి కాక మొంగలాయీ పద్ధతి నుండెడిదఁట! అతఁడొకచేత గంటమును, వేఱొకచేత బాకును ధరించి 'ఇదం బ్రాహ్మ్య, మిదం క్షాత్ర'మ్మను నీతిని వెల్లడించెడివాఁడు.[3]

సూరకవి శాపానుగ్రహసమర్థతలు కల గొప్ప కవీశ్వరుఁడు. ఈ సామర్థ్యములు కల యాంధ్రకవులు వేములవాడ భీమకవి, మొదలగువా రల్పసంఖ్యాకులు. తిట్టుకవిత్వమున సూరకవికిఁగల సామర్థ్యమును 'సూరకవి తిట్టు కమసాలి సుత్తిపెట్టు' అను పెద్దలవాడుకయే తెలియపఱచుచున్నది.

సూరకవి సమకాలికు లతనింగూర్చి చెప్పిన చాటువులఁ బట్టి[4] యితఁడు పదునెనిమిదవ శతాబ్దిలో నుండిన ప్రౌఢకవులలోను, లాక్షణికులలోను పేరుపడినవాఁడని తెలియుచున్నది. ఇతఁడట్టి యనన్యలభ్యమగు వైదుష్యము కలిగియుండుటచేతనే తమ పోషకులగు విజయనగరప్రభువులను లక్ష్యముసేయక[5] యొల్లపుడును

1. గీ. విజయరామమహారాజ విరుఁజేలు పట్టములికించె రాజభూపాలరాజు,
కడుపుమాటలకేమి? యీ కాలమందుఁ బుట్టెనవ్వేమ పులిగొంతు గొఱ్ఱె కఱచె.
2. క. ఊరెయ్యది? చీపురుపలి, పేరో? సూరకవి; యింటిపే? రడిదమువార్,
మీ రాజు? విజయరామమహారా; జతఁడేమి సరసుఁడా? భోజుఁడయా!
3. 'అడిదము సూరకవి.' ప్రథమ, ద్వితీయ ప్రకరణములు.
4. క. రవియెఱుఁగును భువితత్త్వము భువిలో పలనుండు జనులఁ బోషించు సదా
శివుఁ డెఱుఁగు నాట్యతత్త్వము, కవితాతత్త్వంబు సూరకవికే తెలియున్.
5. చ. గరిసెలు ప్రాఁతగాని మఱిగంటెఁ డెఱుంగము, మన్యదేశముల్
తిరిగి యభీష్టవస్తువులఁ దెచ్చి భుజింతుము సార్వకాలమున్;
సుకవిర సత్కవితానిధి సూరక వింబుదువ కేలఁగల కం

దేశాటన మొనర్చుచు వర్షాశనములను సంపాదించి కాలము గడపెడివాఁడు. సూరకవి జీవితకాలములోఁ జాలభాగము దేశాటనముల కయి వినియోగింపఁబడుటచే, నితఁడు 'గడియకు నూఱుపద్దెములు గంటములేక రచించు' దిట్టయయ్యును, విశేషముగ గ్రంథములను రచింపలేక పోయెను; ఇతని చాటువులు-హృద్యములు, సర్వజనాకర్షకములగునవి అసంఖ్యాకములు కలవు.

అఱిదము సూరకవి ఆఱుగ్రంథములను రచించెను. అవి కవిజనరంజనము, కవిసంశయవిచ్ఛేదము, ఆంధ్రనామశేషము, ఆంధ్రచంద్రాలోకము, రామలింగేశ శతకము, శ్రీరామ దండకము అనునవి.

౧. కవిజనరంజనము—దీనికిఁ జంద్రమతీ పరిణయమను నామాంతరము కలదు. ఇందుఁ జంద్రమతీ, హరిశ్చంద్రుల వివాహకథ మూఁడాశ్వాసములలో ముద్దుగ వర్ణింపఁబడినది. ఇతని గ్రంథములలోనెల్ల నిదియే మిన్నయయి కవికి మిగులఁ బ్రఖ్యాతిని కూర్చిపెట్టినది. ఇతని గ్రంథముల పౌర్వాపర్యమును నిర్ణయింప వీలులేదు; కాని కవి తన లక్షణగ్రంథమగు కవిసంశయవిచ్ఛేదమున నీ ప్రబంధమును బ్రస్తావించుటచే నిది దానికంటెఁ బ్రాచీనమని తెలియుచున్నది. ఇందు వసుచరిత్రపుఁ బోకడలు చాల కలవు. కవిత్వ ప్రాశస్త్యమునుబట్టియే దీనికి 'పిల్లవసుచరిత్ర' మను ఖ్యాతి కలిగినది.

౨. కవిసంశయవిచ్ఛేదము- ఇది మూఁడు ప్రకరణములలక్షణగ్రంథము. ఇందలి ప్రకరణములకుఁ దరంగములని పేరు. కవి తనకుఁ బూర్వమున వెలువడిన, వ్యాకరణములచే సాధింపఁబడని రూపముల నిందు సాధించెను. ఇందుఁ జాల కఱకును కవుల ప్రయోగములందలి సంశయములు విచ్ఛేదింపఁబడినవి. శకటరేఫ, తద్భవముల చర్చ కలదు.

౩. ఆంధ్రనామశేషము—ఇది పద్యరూపముగ నున్న చిన్న నిఘంటువు. పైఁడిపాటి లక్ష్మణకవికృతమగు నాంధ్రనామ సంగ్రహమునకుఁ బూరకగ్రంథము.

౪. రామలింగేశ శతకము—శ్రీ విజయనగర ప్రభువులగు చిన విజయరామగజపతి మహారాజులుంగారి రాజ్యకాలమున దివానుగానుండిన సీతారామరాజుగారి చండశాసనత, తద్ద్వారమున దేశమునఁ గలిగిన ప్రజాపీడ, నాఁటి సాంఘికార్థిక రాజకీయ పరిస్థితులు నిందు అన్యాపదేశముగఁ జక్కని దృష్టాంతములతో వెల్లడింపఁబడినవి.

౫. శ్రీరామదండకము—ఇందు రామాయణ కథ సంక్షేపముగ వర్ణింపఁబడినది. శైలి చాల ప్రౌఢము. ఉత్తమదండకములలో నిదియొకటి. ఇది కవికిఁగల యుభయభాషాపాండిత్యమును వెల్లడిచేయుచున్నది.

౨

సూరకవి రచించిన 'చంద్రాలోక' మను నర్థాలంకార లక్షణగ్రంథము సంస్కృతమునకనువాదము.

సంస్కృతమునఁ బీయూషవర్ష (జయదేవ) మహాకవి 'చంద్రాలోకము'ను రచించెను. అందుఁ గేవల మలంకారములేకాక చక్కని కావ్యసామగ్రియుఁ జాల ప్రకరణములలో వివరింపఁబడినది. అందలి 'అర్థాలంకారము' లను ఆధారముగఁ జేసికొని అప్పయదీక్షితులు 'కువలయానంద' మను గ్రంథమును రచించెను. కువలయానందము కారికా, వృత్తిరూపముల నున్నది. అందలి కారికలు ప్రత్యేక గ్రంథముగఁ బ్రకటింపఁబడి జయదేవకృతమగు చంద్రాలోకముగఁ బ్రచారమున నున్నది. జయదేవుని గ్రంథము ననుసరించి[1] రచింపఁబడుటచే ఆకారికలకు నా వ్యపదేశము కలిగి యుండవచ్చును.

ఈ చంద్రాలోకమునకు మూలము జయదేవ చంద్రాలోకార్థాలంకార ప్రకరణమని కొందఱు, దీక్షితుల కువలయానందకారికలే యని కొందఱు తలంచుచున్నారు. సూరకవి మాత్రము తన గ్రంథమునకు మూలము కాళిదాస కృతమగు చంద్రాలోక[2] మని వ్రాయుచున్నాఁడు. కాళిదాసమహాకవి చంద్రాలోక

1. శ్లో. యేషాం చన్ద్రాలోకే దృశ్యన్తే లక్ష్యలక్షణశ్లోకాః
ప్రాయస్త ఏవ తేషా మితరేషా మభినవా విలిఖ్యన్తే. [కువలయానందము]

2. గీ. బాలుఁగవులైనఁ దెలియఁగాఁ గాళిదాసు, మునురచించెఁ జంద్రాలోకమును ద్రిలింగ,

మును రచించిన ట్లెచటను ప్రసిద్ధి లేదు. ఒకవేళ సూరకవికి లభించిన గ్రంథముపై 'కాళిదాస కృతచంద్రాలోక' మని పేరున్నను, అది లేఖక ప్రమాదమనియు, ఆ వ్రాఁతయందలి యథార్థమును బరిశీలింపక సూరకవి యిటులఁ బొరపడి యుండవచ్చుననియుఁ దోఁచుచున్నది.

సూరకవి తెలిఁగించినది దీక్షితుల కువలయానందకారికలు కాని, జయదేవుని చంద్రాలోకము కాదు. అనువాదము దీక్షితకృతికే సరిపడుచున్నది.[1] ఉపమాలంకారాదులయందు అతఁడు దీక్షితు ననుసరించెను గాని జయదేవు ననుసరింపలేదు. దీక్షితుల లక్షణములు కొన్ని జయదేవుని లక్షణములకంటె విభిన్నములు. ప్రసిద్ధోపమానమున కుపమేయత కల్పింపఁబడి నపుడు 'ప్రతీపాలంకారం' మగునని దీక్షితుల లక్షణము. జయదేవుఁడు దానిని ప్రత్యేకాలంకారముగాఁ బరిగణింపక 'ప్రతీపోపమ' అను నుపమాభేదముగ లెక్కించెను. దీక్షితుల ననుసరించి సూరకవి ప్రతీపమును బ్రత్యేకాలంకారముగ గ్రహించెను. ఇట్లే సూరకవి దీక్షితుల ననుసరించి యప్రస్తుత ప్రశంసాలంకారమున 'స్వరూపసంబంధ నిబంధన'మను నొక్క భేదమును యుదాహరించెను; కాని, జయదేవునివలెఁ గార్యకారణ, సామాన్య, విశేష భేదముల నుదాహరింపలేదు. ఇట్టి భేదము లింకను గలవు మఱియు సూరకవి చెప్పిన యలంకారక్రమము దీక్షితుల పద్ధతి ననుసరించుచున్నది కాని జయదేవుని మార్గమును ద్రొక్క లేదు. ఉదాహరణములు కూడఁ జాలవఱకు జయదేవుని గ్రంథమునండి భేదించుచున్నవి.

శ్రీ యొనమంద్ర వేంకటరామయ్యగారు, శ్రీ తాడూరి లక్ష్మీనరసింహారావు పంతులుగారును శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావుగారు చంద్రాలోకమును కాళిదాసే వ్రాసెనని అభిప్రాయపడిరి. శ్రీ అడిదము రామారావుగారు సూరకవి జయదేవుని చంద్రాలోకమునే ఆంధ్రీకరించెనని తలఁచిరి. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమున 'అలంకారములు' అను శీర్షికలో 'సూరకవి జయదేవుని చంద్రాలోకమునందలి ౫వ మయూఖము నాంధ్రీకరించె'నని వ్రాయఁబడియున్నది. పైయభిప్రాయములు సరియైనవి కావు. సూరకవి చంద్రాలోక మేకాశ్వాస గ్రంథము. మూలగ్రంథమునఁగూడ నధ్యాయ విభాగము లేదు. మన సౌకర్యముకొఱకు విభజింపఁదలఁచినచో నొక్కొక్క యలంకారము నొక్కొక ప్రకరణముగ విభజింపవచ్చును. దీక్షితులవారి కువలయానంద మట్లే విభజింపఁబడినది.

కువలయానందకారికలలో నూఱలంకారములకే లక్ష్యలక్షణములు కలవు. ఈ చంద్రాలోకమునందును నట్లే కలవు. దీని నింతవఱకును విశాఖపట్టణమునందలి 'అర్ష' ముద్రాక్షరశాలవారును, ఏలూరిలోని 'మంజువాణీ' ముద్రాలయాధిపతులును, చెన్నపురియందలి 'వావిళ్ల' ముద్రణాలయాధికారులును ముద్రించి ప్రకటించిరి. అర్ష ముద్రాక్షరశాలవారి గ్రంథము పీఠికను బట్టిచూడ, సూరకవి రచించిన గ్రంథములోఁ గొంత గ్రంథపాత మున్నట్లును, శ్రీమాన్ పరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలుగారు దానిని స్వరచిత లక్ష్యలక్షణములచేఁ బూరించినట్లును తెలియుచున్నది. కాని యీ గ్రంథపాత మన్నిప్రతులయందును, అదే స్థలమున నుండుటవల్ల, అది నిజముగ గ్రంథపాతము కాదనియు, సూరకవి ఆయా యలంకారములను విడిచెననియు తలంపవచ్చును.

చంద్రాలోకమును ఏలూరు మంజువాణీ ముద్రాక్షరశాలలో ముద్రించిప్రకటించిన శ్రీ భుజంగరావుగారు చంద్రాలోకమున విడువఁబడిన యలంకారములను చేర్చుచు, ఉత్తర, ఉల్లేఖ, ఛేకోక్తి, పరికరాంకుర, భ్రాంతిమద్, విశేషోక్తి, సందేహ, సముచ్చయ, స్మృత్యలంకారములను జేర్చిరి. కాని యవియన్నియు గ్రంథమునందే యున్నవి. ఉల్లేఖ, స్మృతి,

1. శ్లో. ఉపమాయత్ర సాదృశ్య లక్ష్మీ రుల్లసతి ద్వయోః।
హృదయే ఖేలతోరుచ్చైస్తన్వ్యాస్తనయోరివ. [జయదేవుఁడు]
ఉపమాయత్రసాదృశ్య లక్ష్మీ రుల్లసతి ద్వయోః।
హంసీవకృష్ణ తే కీర్తిః స్వర్గంగా మవగాహతే. [దీక్షితులు]
గీ. వర్ణ్యముపమాన ముపమాన వాచకము సమానధర్మము సంఘటింపనగు నుపమ

భ్రాంతిమ, త్సందేహాలంకారములిందుఁ బరిణామ భేదములుగను, పరికరాంకురము పరికరభేదము గను, విశేషోక్తి విభావనాంతర్భూతముగను, సముచ్చయ లక్ష్యలక్షణములు వికల్పభేదములు గను, ఉత్తరాలంకారము విశేషాభిన్నముగను, ఛేకోక్తి లోకోక్త్యంతర్భూతముగను, ఇందు వివరింపఁబడినది. అపహ్నుతిభేదములు, అతిశయోక్తి భేదములును ప్రత్యేకాలంకారములుగ లెక్కింపఁబడినవి. ౬వ విభావనా భేదమున, విభావనాలక్షణమును, విశేషోక్త్యుదాహరణమును మేళవింపఁబడినవి.

ఇప్పటికి వెలువడిన చంద్రాలోక ప్రతులలో శ్రీ అక్కిరాజు ఉమాకాన్తముగారిచేఁ బరిష్కరింపఁబడి శ్రీ వావిళ్లవారిచేఁ బ్రకటింపఁబడినదే యుత్తమము. శ్రీ ఉమాకాన్తముగారు సవిశేషముగు 'చంద్రాలోక వృత్తాన్తము'తోను, 'చంద్రాలోక వివరణము'తోను దానికిఁ గొంత వన్నెగూర్చి యాంధ్రులకుఁ గొంత యుపకారమొనర్చిరి.

శ్రీ ఉమాకాన్తముగారు సవిమర్శముగఁ జంద్రాలోకమును బ్రకటించుటచేఁ జాల విషయములందు బాగుగఁ జర్చింపఁబడియున్నవి. కాని అందును కొన్ని లోపములు కానవచ్చుచున్నవి — గమ్యోత్ప్రేక్షాలక్ష్యము మూలమున నున్నను సూరకవి విడిచెనని వారు వ్రాసిరి. కాని కువలయానందకారికలలోఁ జాల ప్రతులలో గమ్యోత్ప్రేక్షాలక్ష్యములు లేవు; లక్షణమును లేదు. మంజువాణీ ముద్రాక్షరశాలవారు విభావనా భేదముక్రింద నిచ్చిన లక్ష్యలక్షణములనే వీరు 'విశేషోక్తి' క్రింద నిచ్చి 'కారణము కార్యమువలనఁ గలిగెనేని' అను దానిని 'కారణంబుండి కార్యంబు కలుగదేని' అని సవరించిరి. పయి లక్ష్యలక్షణములకు నడుమ నొక పద్యము పోయినది; ఆ పద్యములోని సగముభాగము విభావనోదాహరణముగను, విశేషోక్తి లక్షణములై యుండును.

వక్త యొక యభిప్రాయమునఁ జెప్పఁగా శ్రోత వేఱొక యర్థమును గ్రహించుట వక్రోక్తి. చంద్రాలోకమునందు వక్త 'ముంచ మానం దినం ప్రాప్తం' (తెల్లవాఱినది. ఇఁకనైన కోపమును విడువుము) అని నాయకుఁడు పల్కఁగా, 'ప్రాప్తం నందినం మా ముంచ' (వచ్చిన నందిని 'నేహ నందీ హరాంతికే' (నంది యిక్కడ లేదు; శివుని సమీపమున నున్నది) అని సమాధానము చెప్పినట్లు ఉన్నది. సూరకవి యిచ్చిన 'సూరకవి వేలు పెవ్వఁడు? 'సోముఁ; డతఁడు చంద్రుఁడా? కాఁడు; శివు'డను ఉదాహృతి సందేహనివారణ రూపమున నున్నది. ఇది వక్రోక్తి కుదాహరణము కాఁజాలదు.

ముద్రితప్రతులనుఁబట్టి సూరకవి యాంధ్రీకరింపక విడిచిన యలంకారములు పది. అవి ౧. ఆవృత్తిదీపకము; ౨. వ్యాఘాతము; ౩. ప్రత్యనీకము; ౪. వికస్వరము; ౫. సూక్ష్మము; ౬. పిహితము; ౭. వ్యాజోక్తి; ౮. గూఢోక్తి; ౯. వివృతోక్తి; ౧౦. యుక్తి అనునవి. ఇవికాక కొన్ని యలంకారములలోఁ గొన్ని భేదములు విడువఁబడినవి. తుల్యయోగితాలంకారమున 'వర్ణ్యములకుఁగాని, అవర్ణ్యములకుఁగాని ధర్మైక్యముండుట' అను ప్రథమ భేదము, 'స్వక్రియచే మంచిచెడ్డలను లోకమున కెఱుకపఱచుట' అగు నిదర్శనాలంకారతృతీయ భేదము, 'ఒకచోటఁ జేయఁదగిన పనిని మఱొకచోటఁ జేయుట, ఒక్కటి చేయఁబోయి వేఱొకటి చేయుట' అను అసంగతి భేదములు రెండు, ఉల్లాసభేదోదాహరణములు మూఁడు, విశేషముచే సామాన్య సమర్థనరూపమగు నర్థాంతరన్యాసభేదము, సాకూతగూఢోత్తరరూపము, ప్రశ్నద్వయమునకేకోత్తరరూపమునగు నుత్తరాలంకార భేదములు నిందుఁ గానరాకున్నవి.

సూరకవి యాంధ్రీకరణము మూలమునకుఁ జాల అనుగుణముగ నున్నది. కాని కొన్ని పట్టుల నిందును గొన్ని లోపములు కన్పించుచున్నవి.

౧. ఉత్ప్రేక్షాలక్షణము మూలమున 'సంభావనా స్యాదుత్ప్రేక్షా' (ఊహించుటయుత్ప్రేక్ష) అని కలదు. ఇందు లక్షణములేదు. క. 'విదితములుత్ప్రేక్షలు పెంపొదవెడుఁ గావ్యములయందు నుక్తానుక్తా, స్పదమును సిద్ధాసిద్ధా, స్పదమున నన్ వస్తు, హేతు, ఫలరూపమునన్.' అని తద్భేదపరిగణనమే చేయఁబడినది.

౨. కారికలలో నసంబంధాతిశయోక్తి లక్షణము 'యోగేఽప్యయోగోఽసంబంధాతిశయోక్తిరితీర్యతే' అని యున్నది. 'సంబంధమున్నను లేకుండునట్లు చెప్పుట'యని దాని

శయోక్తిగఁ బరిగణించుచు 'యోగ మొందవుచు నుండి సుయోగ మొందక, కున్న మును చెప్ప నదియరైు యుప్పాగ్కృతుల' అని చెప్పినాఁడు. మును చెప్పనది యనఁగా ముందు చెప్పిన సంబంధాతిశయోక్తి. అయోగమున యోగకల్ప నము సంబంధాతిశయోక్తి.

3. కార్యకారణముల పౌర్వాపర్యము విపర్యస్తమయిన నత్యాంతిశయోక్తి. దీని యుదాహృతి 'అగ్రేమానోగతః పశ్చాదను నీతా ప్రియేణ సా' అని సంస్కృతమునఁగలదు. సూరకవి దీనిని 'క...మానము, పయనం బాయెను; ప్రియుండు పదపడి చనియెన్.' అని తెనిఁగించెను. మొదట నాయికకుఁ గోపము పోయినదని, ఆపిదప ప్రియుఁడామెం బ్రతి మాలు కొనెననియు మూలాభిప్రాయము.

౪. ప్రకృతార్థమును దెలియఁజేయు పదము లచే సూచ్యార్థమును సూచించుట ముద్రా లంకారమగును. దీనికి మూలమున 'నితంబగుర్వీ తరుణీ దృగ్యుగ్మ విపులాచసా' అని యుదా హృతి కలదు. ఇచట 'దృగ్యుగ్మవిపులా' అను సమస్తపదములోని 'యుగ్మవిపులా' పదము సంస్కృతానుష్టుప్ఛందో విశేషమగు 'యుగ్మ విపుల'ను సూచించుచున్నది. సూరకవి యౌచి త్యమును బాటింపక పయిలక్ష్యమునె 'గీ. కృతుల ముద్ర నితంబగుర్వి యగు తరుణి, యతి విలోచన విపులయు నన్నయట్లు' అని తన యిచ్ఛవచ్చినట్లు పదములను తారుమారుచేసి యాంధ్రీకరించినాఁడు. సూరకవి వ్రాసినది తెలుఁగు తేఁటగీతి పద్యముగాన దానిని సూచించు పదముకల యుదాహృతి యే యపేక్షితము.

౫. మూలమునం దుత్తరాలంకార భేదములన్నిటి యందును అలంకారనామ ముత్తరముగానే చెప్పఁబడినది. సూరకవి 'క. పరగుఁ గృతు లందుఁ బ్రశ్నోత్తరమనఁగ నలంక్రియా వతం సము —' అని పయిదాని పేరు 'ప్రశ్నోత్తర ము'గ మార్చినాఁడు.

౬. నాల్గవ విభావనాలంకార భేదము మూల మున 'అకారణాత్కార్యజన్మ చతుర్థీస్యా ద్విభావనా' అని యున్నది. అనఁగా 'కారణము కాని కారణమునుండి కార్యము పుట్టుట' అని యర్థము. దీనికి 'కారణములేక కార్యంబు కలిగెనేని' అని యాంధ్రీకృతి కలదు. విభావన తొలిభేదముకూడ ఈ రీతిగ నేయున్నది. 'కార ణములేక కార్యంబు కలుగఁజెప్ప' అని యచటి లక్షణము. అది 'విభావనా వినాపిస్యాత్కారణం కార్యజన్మచేత్.' అను మూలమునకు సరిగ నేయున్నది. తెలుఁగు లక్షణములలో మొదటి, నాల్గవ భేదములకైక్యము కాన వచ్చుచున్నది.

౭ మూలమునఁ బ్రౌఢోక్తి లక్షణము 'ప్రౌఢోక్తి రన్యహేతూక్త్యా సాక్షాల్లాభః ఫలస్య యః' అనియున్నది. అనఁగా 'ఉత్కర్ష హేతువుకాని అన్యకారణము నుత్కర్ష కలుఁగఁజేయు కారణముగ నిబంధించుట' అని యర్థము. దీనికి తెలిఁగింపు 'గీ. ఎసఁగుఁ బ్రౌఢోక్తి యుత్కర్ష హేతు వమరు, దాని కతిశయ కారణత్వము నుడివిన...' అని యున్నది. ఇది మూలమునకు విరుద్ధము.

చంద్రాలోకమున ముద్రణస్ఖాలిత్యములు చాల తక్కువ. ఉన్నవి కొన్ని విపరీతార్థమును గలుగఁజేయుచున్నవి; అవిదిద్దను సాధ్యములు.

వ్యాజస్తుతి లక్షణమున '...నదియు వ్యాజ స్తుతి' అని కలదు; దీనింబట్టి యింకొక వ్యాజ స్తుతియున్న ట్లర్థమగును. కాన నీ సముచ్చయ మును అవధారణముగ మార్చి 'అదియ వ్యాజ స్తుతి' అనుట యుక్తము.

పయిదాని ద్వితీయోదాహరణమున 'అతి నిశిత నఖదంతలూనాంగివైతి, పెందుకలనమద ర్థమునందు నహహా!' అనునది 'ఎందుకలనమద ర్థమ యంచుకలన' అనుదానికి బదులుగాపడినది.

---

## కొమ్మల నమ్మరాదు

చక్కెర పూఁతబూసిన విషంబులు భామల వాక్యవైఖరుల్,
చక్కఁగ వెన్నమెత్తిన శిలల్ విరిబోఁడుల చిత్తముల్, మణుల్
చెక్కిన సంకెళుల్ ...

# మొదటిగేయశాసనం

## శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారు.



'గిడుగు రామమూర్తి పంతులుగారి వ్యాస సంగ్రహ సంపుటంలో (806 వ పుట) మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పొట్లదుర్తి-మాలెపాడు శాసనాన్ని ప్రకటించారు. ఇప్పటికి దొరికిన శాసనాలలో పూర్తి తెలుగు భాషగల మొదటి శాసనం (క్రీ. శ. ఆరోశతాబ్దం) అదే! ఈ శాసనం పైకిచూస్తే వచనంలాగు కనబడుతుంది. కాని దీనిలోని రెండు పంక్తులలో ద్విరదగతిరగడ[1]లక్షణం కొంతవరకు గర్భితమై ఉంది' అని దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు తెలియజేశారు.[2] కాని ఈ శాసనమంతా గేయశాసనమని తోస్తుంది. దాని విశేషాలను తెలియజేస్తాను.

ఈ శాసనంలోని తొలిమాట 'స్వస్తి' శాసనాలను సాధారణంగా ప్రారంభించే పద్ధతే ఇది. లేఖను శ్రీరస్తు, శుభమస్తు అని మొదలు పెట్టడంవంటిది. 'స్వస్తి' అనుమాట ఈ శాసనాంశంలోని విషయంకాదు. (యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనంలో స్వస్తి అనుమాటకూడ పద్యంలోనె చేర్చబడింది). పైన చెప్పిన శాసనంలోనిగేయరూపం (నాలుగు చరణాలు) మాత్రాదులను ఇక్కడ తెలియజేస్తాను. చిన్న అడ్డగీటు ప్రక్కనున్న అక్షరం యతిస్థానం.

| | మొత్తం మాత్రలు |
|---|---|
| [3] 1. శ్రీ సోజు[5] మహారా[5] జుల్లోలన[5] — ఇన్నప్రోలి[6] | 20 |
| 2. ఆణపోతుర్లు రేవణ[5] కొలుపు[5] — ద్దణకొల్ల[5] | 20 |
| 3. ఇచ్చిన పన్నసపెన్నా[6]త్రె ఇశె[3] — ఱణికిన్ — తేసి[5] | 20 |
| 4. ఱచ్చిన వాస్తు[6] పంచ[4] వహాపా[5] — తకున్ఱ తున్[16] | 21 |

పైదానిలో నాలుగు చరణాలున్నాయి. పాటలలో ఒక్కొక్కప్పుడు ఒకటి రెండు మాటలు అసలు చరణాలకు వెలుపల ఉండడం కద్దు. ఈకింద ఉదాహరించిన గేయంలో 'వచ్చె, పేరు, జూచి, గొంటు, మా' అను మాటలు చరణాలకు వెలుపల ఉన్నాయి—

శృంగరము మీర సింగడు—వచ్చె
సింగని వెదకుచు సింగడు.
బంగారు మేడల వెంటను — పేరు
బాడుచు సింగను గొంటను.
రాజవీథుల వెంట వచ్చెను — జూచి
రాజాధిరాజులు మెచ్చను.

---

1. ద్విరదగతి రగడకు ఉదాహరణం—
శ్రీయువతి నిజయువతిశేసి యెంతయు మించి
కాయజుని దనతనయుఁగా నెలమి బాటించి
సకలదేవతలఁ బరిజనులుగా మన్నించి
ప్రకటగతి శ్రుతుల నుతి పాఠకులగావించి
వారిరొప్పునననొప్పు నవతారలఘు విరతిః
శరధి తగనలల భసల తరల ద్విరదగతి (ఉదాహరణ వాఙ్మయచరిత్ర, పుట. 67)

2. పరిశోధన పత్రిక ప్రథమసంచిక, పుటలు 5,6.

3. [శాసనంయొక్క అర్థం—చోళమహారాజు నధీనతయందున్న ఇనప్రోలి అణపోతులు రేవణగారు, వుద్దణగారు, పెద్ద బ్రాహ్మణుడు ఇశెతేనికి ఇచ్చిన పన్నస; దీనిని చెడగొట్టిన

గుండుగొండులగొల్ల దూరుచు—గొండు
గుండడికొని పరువుబారుచు,
శృంగారవతులార యెరుగరే —మా
సింగిసెరింగిన జూపరే ![1]

ఇట్లే పై శాసన గేయంలోగూడ మూడో చరణానికి వెలిగా 'తేని' అను మాట ఉంది.

జతలు, ప్రాస గురించి—ఈ శాసనంలోని మొదటి రెండుచరణాలు ఒక జత, తర్వాతి రెండుచరణాలు మరొక జత. రగడలలోకూడ ఇట్టి జతలుంటాయి. మొదటి రెండుచరణాలలో పాదాది ప్రాసలేదు గాని పాదాంత ప్రాస ఉంది—'త్రోలి-కొలు'. తర్వాతి రెండు చరణాలలో పాదాది, పాదాంత ప్రాసలున్నాయి- 'ఇచ్చి-తిచ్చి' 'తికిన్-న్తకున్'.

యతినిగురించి—ప్రతి చరణంలోను యతి స్థానం నాలుగో మాత్రగణంలోని మొదటి అక్షరం. చరణాలలోని యతి మైత్రులు—

(1) శ్రీ — ఇ
(2) అగ — ద్దగ
(3) ఇ — రే
(4) మైత్రి లేదు.[2]

ఇట్లు ఈ గేయంలో చరణనియమం, ప్రాసలు, యతులు చాలవరకు పాటించబడ్డాయి.

గణాలు, మాత్రల విషయం—మొదటి చరణంలోను ఆఖరి చరణంలోను ఇరవై యొక్క (21) మాత్రలున్నాయి. రెండు, మూడు చరణాలలో ఒక్కొక్క దానిలో ఇరవై (20) మాత్రలున్నాయి. ప్రతి చరణంలోను యతిస్థానానికి ముందు పదిహేను మాత్రలు కచ్చితంగా ఉన్నాయి. ఈ పదిహేను మాత్రలు మూడు ఐదేసి మాత్రల గణాలలోని మాత్రల మొత్తం అని చెప్పవచ్చు. కాని ఈ అయిదేసి మాత్రాగణాలను ప్రత్యేకంగా విడతీద్దామంటే కొన్ని అక్షరం మధ్యవడి సరిగా తెగకుండా ఉన్నాయి. కాబట్టి ఒక విషయం చెప్పుకోవలసి వస్తూంది. గణానికి మాత్ర లయిదుక్రింద మొత్తం లెక్క సరిపోయినచాలు; ఏగణానికి ఆ గణంతాలూకు అక్షరాలు విడిగా నుండ నక్కరలేదు. కాని ఈ పద్ధతి ఇటీవల అమలులో లేదు. గణాలు తెగని ఆరకం చరణాలు ఎప్పుడోగాని తగలవు. పై శాసనంలో ప్రతి చరణంలోని ఆఖరిగణంలోని మాత్రలసంఖ్య కచ్చితంగా లేదు. రెండు మూడు చరణాలలో అయిదేసి మాత్రలేఉన్నా, మొదటి, నాల్గవ చరణాలలో ఆరేసి మాత్రలున్నాయి. గేయాలలో ఒక మాత్ర ఎక్కువయినా తక్కువయినా పట్టుదల ఇటీవల లేదు. ప్రాచీన కాలంలో కూడ అట్లే ఉండేదని శాసన గేయాన్నిబట్టి చెప్పుకోవలసి వస్తూంది. దానిని గురించి మరికొంత ముందుముందు తెలియజేస్తాను. ఇటీవలి పాటలలో కచ్చితంగా ఇరవై మాత్రలున్న చరణాలు ఏరి ఇక్కడ చూపిస్తున్నాను. చరణానికి అయిదేసి మాత్రల గణాలు నాలుగున్నాయి. గణాలు చాలవరకు కచ్చితంగా తెగుతున్నాయి.

(1) నివ్వాళి పాట

శ్రీ మహాదేవ వందిత నీకు నివ్వాళి
కరుణాలవాల శంకర నీకు నివ్వాళి

(2) వైభోగపు పాట

శ్రీ ఇందిరాదేవి శ్రీ విష్ణు సరిజోలి

(3) ధ్రువతాళము

కనుగొను మీ విధము రాజకంఠీరవేంద్ర[3]
(పుట 7)
వెలయు నేర్చినయంత విడిగ వినిపించంగ
కవిదానరాధేయ కనుగొనుము దయతోను[4]
(పుట 12)

పైన ఉదహరించిన గేయాలన్నిటిలోను యతిస్థానం పదకొండోమాత్ర, అనగా—మూడో గణంలోని మొదటి అక్షరం. ఈ విషయంలో శాసనగేయం భిన్నంగా ఉంది. దానిలో యతిస్థానం పదహారోమాత్ర, అనగా—నాలుగో గణంలోని మొదటి అక్షరం. శాసనకాలానికి ఇటీవలి కాలానికి ఒత్తిడి (Stress) భేదమే ఇట్టి మార్పులకు కారణం.

---

1. అమంచర్ల కోదండరామయ్య రచించిన నలచరిత్ర యక్షగానంనుండి తీసిన పాట.
2. యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనంలో 'త్రచ్చిన' అను మాట ఉన్నది. దీనిలో 'తిచ్చిన' అని కనబడుతూంది.

మధ్యాక్కరలో యతిస్థాన విషయమై రెండు మతాలున్నాయి. నాలుగోగణం ప్రారంభంలో యతి అని కొందరు, అయిదోగణం ప్రారంభంలో యతి అని కొందరు. ఈ భేదాలకు కారణం ఆ లక్షణం పాడబడేటప్పుడు ఉండిన ఒత్తిడి (Stress) లో భేదం అనే చెప్పవచ్చు. ఒక కాలంలో ఉండే ఒత్తిడి ఆ తర్వాతి కాలంలో లేకపోడంబట్టే ఇట్టి చిన్ని భేదాలు కలుగుతాయి.

పూర్వకాలంలో కావ్యరచన అంతా రెండు రకాలు (1) గద్యం (2) పద్యం —

గద్యానపద్యకావ్యము
గద్యము పద్యమని చెప్పగా ద్వివిధమగున్.
(రేచన కవిజనాశ్రయం పుట 4)

గద్యం అనగానే వచనం అని భ్రమ పడతాం. కాని అది ఎంతమాత్రమూ కాదు. అప్పటివారు వచనం (Prose) అను మాటను విడిగా వాడేవారు. గద్యం మళ్లీ రెండు రకాలు. నిర్దిష్టంగా మాత్రాగణాలు గలవి, అట్టి నిర్దిష్టతనం లేనివి. నిర్దిష్టతనంలేని రచన పాటలలోను, గేయాలలోను ఉంటుంది. నిర్దిష్ట మాత్రాగణాలు గల రచనలు ఉదాహరణ కావ్యాలలో కొన్ని ఉదహరించ బడ్డాయి—కళిక, ఉత్కళిక, రగడలు ఇత్యాదిలక్షణాలు. నిర్దిష్ట గణాలుగల గద్యకిక్కడ ఉదాహరణ ఇస్తాను. క్రీ. శ. 1150 ప్రాంత మతనైన మల్లికార్జున పండితుడు వ్రాసిన మల్లికేశ్వర గద్యము[1]లోని తునక—

అఖిలలోకాధార
ఆనంద రసపూర
ఇనచంద్ర శిఖినేత్ర
ఈడితాములగాత్ర

* * *

ఇట్లు నిర్దిష్టగా గణాలున్న చరణాలనే కొన్నిటిని (పాటలను) వెనక ఉదహరించేను. కాని ఇట్టి నిర్దిష్టతనం సాధారణం కాదు. చోడమహారాజు శాసనంలోకూడ అక్షరగణాలు మొదటి నాలుగో చరణాలలో కచ్చితంగా లేవు. కాబట్టి ఇది గేయ పద్ధతిని రచింపబడ్డ శాసనమని చెప్పవచ్చు. దీని కాలం క్రీ. శ. ఆరోశతాబ్దం అని వెనకే తెలియజేశాను. 'క్రీ. శ 5,6 శతాబ్ది ప్రాంతముననే ఆళ్వారులు, నాయన్మారులు భక్తిప్రబోధ గీతము లను పాడియున్నారు.'[2] తెలుగులో కూడ ఇట్టి గేయాలు ఆ కాలమందే వేనవేలు పుట్టుండాలి. వాటిని జాగ్రత్తపెట్టిన మహానుభావు లేరీ! చోడమహారాజు శాసనంలో ఆనాటి గేయ రచన ఒకటి దక్కింది అని చెప్పవచ్చు. అటు తర్వాతికాలంలో జాతి పద్యాలలోను, వృత్తాల లోను శాసనాలను ఎట్లు రచించేవారో, అట్లే ఆ కాలంలో గేయాలలో శాసనాలను రచించే వారా? అప్పటికి శాసన కావ్యరచనా క్రమం గేయాలు, జాతి పద్యాలు, వృత్తాలు అని చెప్పనగునా?

(రెండవపుట తరువాయి)

చెవులు దిమ్మెక్కేటట్టు శబ్దం! వేడి బుస బుసలు! ఆమడకుపైగా పరుగుతీశాడు, నగరంలో అంతటా వంకరటింకరగా దౌడు తీశాడు. బుక్కసాగరం సమీపించేవేళకు అనుమానం కలిగింది-కలకల్ల కాదు కదా-అని. వెనక్కు తిరిగి చూచాడు. సహస్రఫణామండలంలో ఆదిశేషుడు భూమ్యాకాశాలు ఏకంగా లోకపై నిలబడివున్నాడు; రాయల వెనక్కు చూడగానే అంతర్ధానమయ్యాడు. తాటిచెట్టు లోతున కాలువ పడివుంది. రాయలు పశ్చాత్తాప పడ్డాడు. కాలువను బుక్కసాగరంలో కలిపించాడు. బుక్కసాగరం గట్టున నాగ ప్రతిష్ఠ చేశాడు. నేటికీ ఈ నాగప్పమాహాత్మ్యం కేయివిధాలుగా చెప్పుకుంటారు.

ఆ కాలువకు మాత్రం బుక్కరాయల కాలువని కాని, నాగప్పకాలువనికాని కాక, 'తుర్తకాల్వ' అనీ నేటికీ పేరు. తుర్తా అనేది అక్కడి బోయవారు పెట్టుకొనే పేర్లవంటిది. ఆ పేరుగల బోయనాయకుడు - వాస్తుశాస్త్ర నిపుణులు - రాయల ఆజ్ఞపై దీనిని తవ్వించి వుంటాడు.

1. నిడదవోలు వేంకటరావుగారు రచించిన వీరశైవ వాఙ్మయం (భారతి రజతోత్సవ సంచికలోని వ్యాసం)

2. [illegible]

అముద్రితరచనలు :

# లీలావతీగణితము

## వల్లభార్యప్రణీతము

(గతసంచిక తరువాయి)



గీ. [1]మూర లెనిమిది దైర్ఘ్యంబు మూఁడు వెడలు
పైన నెనిమిది వెలపట్ల కరయ నూఱు
గాఁగ పాత్రిహస్తదైర్ఘ్యమ్ము సార్ధ
విస్తృతిం గల్గు నొకటికి విలువ యెంత?

ఒడ్డు ౮ ౫ లబ్ధద్రమ్మాలు ౧౪; పణాలు ౯;
౩ ౨ కాకి ౧; గవ్వ ౧; గవ్వపాళ్లు
౮ ౧ ౨
౧౦౦ ౨ ౩
౧
౦

తొలుతటి విలువ టంకాలు చేసిన ద్రమ్మాలు ౪౩. పిన్నపైకాలు ౩.

ఇది సప్తరాశికము.

నవరాశికోదాహరణము —

చ. [2]దళ మినసమ్మితాంగుళము,
దైర్ఘ్యము వాసవసంఖ్యహస్త, మం
గుళులు పదాఱు విస్తృతిగఁ
గొల్చినబల్లలు ముప్పదింటికిన్
వెల శతమైన నేర్పుఱుపు
[ [3]వేగముతోడ] వెడల్పు దైర్ఘ్యమున్
దళముఁ జతుశ్చతుర్ద్విరహితంబులుగాఁ
బదునాలుగింటికిన్.

ఒడ్డు ౧౨ ౮ లబ్ధటంకాలు ౧౦
౧౪ ౧౦ ద్రమ్మాలు ౩౨
౧౬ ౧౨
౩౦ ౧౪
౧౦౦

ఇది నవరాశికము.

ఏకాదశరాశికోద్దేశకము —

గీ. [4]మొదలఁ జెప్పినబల్లలు మోచి తేగ
నర్ధయోజనమునకు ద్రమ్మాష్టకంబు
భాటకం బైనఁ బిదప నేర్పడఁగఁ జెప్పు
మట్టిబల్లల కెంత మూఁడామడలకు.

భాటక మనఁగాను బాడిగ; అదే అద్దె.

ఒడ్డు ౧౨ | ౮
౧౪ | ౧౦
౩౦ | ౧౨
| ౧౪
౩౫

లబ్ధభాటక దమ్మాలు ౮

ఇది యేకాదశరాశికము.

[5]భాండప్రతిభాండోదాహరణము —

క. [6]ద్రమ్మం బొకటికి మాకం
దమ్ములు మున్నూఱుగాఁ, బణమ్మునకుఁ గపి
త్థమ్ములు ముప్పదిగాఁ గర [యగుగా.
ణమ్ములు! పదిటికిని దధిఫలము లెన్ని

మామిడిపండ్లు ౩౦౦కి ద్రమ్మం బొక్కటి గాఁగాను మామిడిపండ్లు పదింటికి నెంత యని యొద్దు—

ప ౩౦౦ ప్రద ౧ ఇచ్ఛ ౧౦ ఇచ్ఛాఫలద్ర $\frac{౧}{౩౦}$ రెండవ త్రైరాశిక ద్రమ్మ ౦ $\frac{౧}{౧౬}$ వీనికి

వెలగపండ్లు ౩౦ గాఁగా ద్రమ్మ $\frac{౧}{౩౦}$ కి యెన్ని

---

1. 'విస్తారే త్రికరాః కరాష్టక' మిత్యాది శ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. పుట 140.
2. 'పిండే యేఽర్కమితాంగుళాః' ఇత్యాదిశ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. పుట 141.
3. వెలతొమ్మిదింటి-అని వ్రాఁతప్రతి. అర్థము కుదురదు. గణభంగము.
4. 'పట్టాయే ప్రథమోదితప్రమిత' ఇత్యాది శ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. పుట 143.
5. మూలమున దీనికిఁ బూర్వము భాండప్రతిభాండసూత్రము కలదు. తెలిఁగింపున నది కానరాదు.
6. 'ద్రమ్మేణ లభ్యత ఇహామ్రశతత్రయంచేత్' ఇత్యాది శ్లోకమున కాంధ్రీకరణము.

అని ఒడ్డు ప్రమాణద్రమ్మం ౧/౧౬ ఫలరాశి కపిత్థాలు 3 కి ఇచ్ఛారాశి ద్రమ్మం ౧/౩౦ ఇచ్ఛాఫలము మార్చిన వెలగపండ్లు ౧౬.

ఇది భాండప్రతిభాండకము.

ఇది శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య ప్రబోధానంద శ్రీచరణ సద్గురుచ్ఛాత్ర హారిత గోత్ర కోదూరు యొజ్జియామాత్యపౌత్ర రాఘవసూరిపుత్ర కవిదేవేంద్రాపరనామధేయ సుజనవిధేయ సహజధైర్య వల్లభార్యవిరచితంబైన లీలావతి యనుపాటీగణితంబునందు త్రైరాశికంబు సమాప్తము.

వ. అనంతరంబ మిశ్రవ్యవహారంబునందు గరణ
సూత్రము—

గీ. [1]ప్రమితి గుణితప్రమాణ [కాలము] విమిశ్ర
కాలనిహతఫలము నిజైక్యమునం బాలు
వుచ్చి వేర్వేఱ మిశ్రఘ్నములుగఁ జేయ
నగుఁ గ్రమంబున మూలకలాంతరములు.

క. [2]అనువుపడు నిష్టకర్మం
బున మూలం బదియు మిశ్రమునలోపలఁ బు
చ్చినఁ దత్కాలాంతరంబై
చను నొందు...దద్జ్ఞజను లౌనా ననఁగన్.

ఉద్దే—

క. [3]నెల [నొక] నూటికి సాయక
ములుగా నేఁటికిని వృద్ధిమూలము వేయౌఁ
దెలియం జెప్పుము మూలము [మెచ్చన్.
కళాంతరములు బొమ్మలాటకాఁడు

ఒడ్డు – ప్రమి ౧౦౦, ప్రమాణకాలము నె ౧, మిశ్రకాలము ప్రమాణకాలముతోడి సమజాతీకరించిన నెల ౧౨ ఫలరాశి ౫ మిశ్రము ౧౦౦౦,

అవే ౧ ౧౨
౧౦౦ ౦ ౧౦౦౦
౫ ౦

క్రమాలబ్ధ మూలకళాంతరాలు ౬౨౫, ౩౭౫.

ఇష్టకర్మముచేత నెట్లన్నను కల్పితేష్టం ౧, 'కణఁగి యుద్దేశకోక్తమార్గమున' నన్నసూత్ర క్రమానఁ జేయఁగా ౧, యేడాదికి వడ్డి ౩/౫ దీనితోడ ౧ గూడిన ౮/౫ దీనిచేత దృష్టము ౧౦౦౦. ఇది యొకటిచేత గుణించి పాలుఁగొనఁగాను వచ్చినలబ్ధము మూలధనము ౬౨౫. ఇది మిశ్రములోఁ బుచ్చిన కళాంతరము ౩౭౫.

కరణసూత్రము—

క. [4]ప్రమితి సమాహత నిజకా
[లము]లు గతకాలహతఫలములుఁ గాఁగ నై
క్యమున విభజించి మిశ్ర
ఘ్నములుగఁ జేయఁగఁ బ్రయుక్తఖండంబు
[లగున్.

ఉదాహరణము—

సీసములోని పాదములు నాలుగు—

సీ. [5]వరుస నూటికి నెల వడ్డి నాలుఁగు మూఁడు
నైదును జేసి తోయములు మూఁట
ఖండితంబులుగ నొక్కఁడు ప్రయోగించినఁ
బసిఁడిటంకములు తొంబదియు నాల్గు
వడ్డి యొక్కంతగా వచ్చెఁ దత్ఖండత్ర
యంబులవలనను మాసంబు లైదు
పదియు నేడును నైనఁ దుదకు నిక్కమునత
త్ఖండంబు లెంతేసి కవిమహేంద్ర!

ఒడ్డు— ౧ ౫ ౧ ౧౦ ౧ ౭.
౧౦౦ ౦ ౧౦౦ ౦ ౧౦౦ ౦
౪ ౦ ౩ ౦ ౫ ౦

మిశ్రధనము ౯౪, యథాక్రమ లబ్ధఖండాలు ౪౨, ౨౮, ౨౪. క్రమవృద్ధి - ౮, ౧౨, ౫

కరణసూత్రము—

క. [6]ప్రక్షేపంబులు మిశ్రధ
నక్షుణ్ణంబులుగఁ జేసి నైపుణి యొసఁగన్
బ్రక్షేపయోగమునఁ గొనఁ
బ్రక్షేపంబులకు నెఱుఁగఁబడు లబ్ధంబుల్

1. 'ప్రమాణకాలేన హతం' ఇత్యాది శ్లోకమున కాంధ్రీకరణము చూడుఁడు. పుట 148. సూత్రము 52. 2. 'యద్వేష్టకర్మాఖ్య' అను శ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. 149. సూత్రము 58 3. 'పంచకేన శతేనాబ్దే'. అను శ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. పుట 151. 4. 'అథ ప్రమాణైః' అను శ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. పుట 154. సూత్రము 54. 5. 'యత్పంచకత్రికచతుష్క' యను శ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. పుట 155.

ఉదాహరణము—

తొల్లిటి సీసములోని కడమగీతి—

గీ. [1]ఏఁబదొకటియు నెనుబదియేను మఱియు
అఱువదెనిమిదియును గలయంగ వైచి
ముగురు వాణిజ్య మాడంగ [మూఁడు] నూఱు
లయ్యె నిం దిరుపాటి సేయంగవలయు.

ఒడ్డు-౫౧, ౮౫, ౬౮ మిశ్రధనంబు ౩౦౦ లబ్ధ పృథక్ఫలాలు ౭౫, ౧౨౫, ౧౦౦ వీనిలో మూలధనాలు పుచ్చిన లాభాలు ౨౪, ౪౦, ౩౨; ఒండేని మిశ్రధనములో మూలధనయోగం పుచ్చిన సర్వలాభయోగము ౯౬.

ఉదా—

క. [2]ఊరి రొంరి నలుగు రత్తుగు?
వారక పాకశరార్ణవరసాంశములన్
వారలు శరవసుకరముల
కౌరయ నెన్ని... సేయఁగవలయున్.

ఒడ్డు—

౧/౩ ౧/౫ ౧/౪ ౧/౬ మిశ్రధనము ౨౮౫. లబ్ధాలు ౧౦౦, ౬౦, ౭౫, ౫౦.

కరణసూత్రము—

క. [3]హారములు భాగంబులచే
హారియించునదిపిదపఁ దత్సమయోగమునన్?
హారియింపఁ బడినరూపము
పరిపూర్తికిఁ దగినకాలపరిమాణ మగున్.

ఉద్దే—

గీ. [4]ఓలిఁ గాలువలను ద్రవ్వి రొంకట విడువ
దినదినార్ధషడంశతృతీయములకుఁ
బిక్కటిలు బావి యవి యెల్ల నొక్కపెట్ట
విడువ దివసంబులో నెంతవడికి నిండు.

౧/౧ ౧/౨ ౧/౬ ౧/౩ లబ్ధ పరిపూర్తి సముచితకాల దినాంశము ౧/౧౨.

కరణసూత్రము—

గీ. [5]తెలిసి పణ్యోత్తనిజమూల్యములు నిజాంశ
హతములుగఁ జేసి తద్యుక్తి నవియు భాగ
ములను భాగించి మిశ్రకంబున గుణింప
మూల్యములుఁబణ్యములుఁ గ్రమంబునను దోఁచు.

ఉద్దే—

సీ. [6]మంచిబియ్యముమూఁడుమానికల్ నర, పెస
లెనిమిదిమానిక లిప్పరమున
దమ్మంబునకు నిట్టిధారణం బరుమూఁడు
గాకిణికలకు ముద్గంబు లొక్క
పాలు బియ్యము రెండుభాగములుగఁ జేసి
బేహారిచేత నిప్పింపు మఱియుఁ
గర్పూరఫలము నిష్కద్వయంబునకు ద్ర
మ్యాష్టభాగమునకు నగరు వర
గీ. పలము చందనంబు పలిమెఁడు ద్రమ్యాష్ట
మాంశమునకు నైన నాక్రమమున
నేకనిష్కమునకు నేకాష్టషోడశ
భాగములకు నేఱుపఱుపు మాకు.

ఒడ్డు — ద్ర ౧ తండులాలు ౭/౨ ముద్గాలు మా ౮

మిశ్రధనం ౧/౬ ౩/౪ వినియోగాన ౩/౫ ౯/౬

ఇవిన్ని ౭౪ ౧/౮ భాగములున్ను ౨,౧ పాలు

గాని మిశ్రధనము ౧/౬ ౩/౪ గుణించగా నైన

తండులమూల్యము లబ్ధం ద్ర ౧/౬ ముద్గమూల్యం

౭/౧౯౨ బియ్యము మా ౭/౧౨ పెసలు ౭/౨౪ తండుల

మూల్యము కాకిణికలు ౧౦, గవ్వలు ౧౩, తద్భాగము ౧౩, ముద్గమూల్యం కాకిణికలు ౨, వరాటకాలు ౬. తద్భాగం ౨/౩ ఒడ్డు ౩౨

కర్పూరఫలాలు ౧ ద్ర ౧/౮ చందనము ౧, కర్పూర భాగము ౧, అగరుభాగాలు ౮, చందనభాగాలు ౧౬, మిశ్రధనం ద్రం ౧౬;

1. 'పంచాశ దేకసహితా' యను శ్లోకమున కాంధ్రీకరణము. చూడుడు. పుట 161.

2. మూలములో లేదు. 3. 'భజే చ్ఛి దోంశైః' ఇత్యాది శ్లోకమున కాంధ్రీకరణము, చూడుఁడు — పుట 168. సూత్రము 57. 4. 'యే నిర్ఝరా దినదినార్ధ' యను శ్లోకమున కాంధ్రీకరణము, పుట 164. 5. 'పణ్యైః స్వస్వమూల్యాని' అను శ్లోకమున కాంధ్రీకరణము. పుట 165. సూత్రము 58. 6. 'సార్ధం తండుల', 'కర్పూరస్య వరస్య' యను రెండుశ్లోకముల కాంధ్రీకర

అబ్ధకర్పూరాది మూల్య ద్రమ్మములు $\frac{౧౨౮}{౯}$

$\frac{౮}{౯}$ $\frac{౮}{౯}$ కర్పూర ఫలాలు ౩ $\frac{౨}{౯}$, ౬ $\frac{౪}{౯}$.

కరణసూత్రము —

క. [1]వణిగాహతదానోనిత
మణిశేషపృథగ్విభాజ్యమా నేష్ట మగున్
మణిమూల్యము లొండేనియు
మణిశేషపదంబు శేషమానములఁ గొనన్.

వణిక్కు లనఁగాను రత్నాలు గల మనుష్యు లనుట—

ఉద్దే—

చ. [2]ఎనిమిది పద్మరాగమణు,
లింద్రమణుల్ పది, నూఱు ముత్యముల్
ఘనతరవజ్రపంచకము
కాళ్ళఁడు నల్వర కీయ వానితో
నొనరినప్రేమ నొండొరున
కొక్కటి యొక్కటి యిచ్చి నల్వురున్
ధనసము లైరి సత్కవులు
తన్మణిమూల్యము లెవ్వి చెప్పుమా.

ఇక్కడను కవులు వణిక్కులు. ఒడ్డు కెంపులు ౮, నీలాలు ౧౦, ముత్యములు ౧౦౦' వజ్రాలు ౫, కవులు ౪, దానము ౧, వణిగాహతదానము ౪. దీనిచేత పూని తావైన మణుల శేషాలు ౪, నీలాలు ౬, ముత్యాలు ౯౬, వజ్రము ౧, వీనిచేతం గల్పితేష్టము ౯౬, వేఱేవేఱేపాలు గొన్న లబ్ధమూల్యాలు కె ౧ కి ౨౪ నీ ౧ కి ౧౬ ము ౧ కి ౧ వ ౧ కి ౯౬.

ఒంటేని —

మణిశేషధనము ౨౩౦౪ శేషాలచేఁ బాలు గొన్న లబ్ధమూల్యాలు క్రమాన నే ౫౭౬, ౩౮౪, ౨౪౨, ౨౩౦౪; ఇవి ద్రమ్మాలుగాని, నిష్కాలు గాని, మాడలుగాని, టంకాలుగాని యేవి యయినను సరేను. ఇష్టము శేషాలం గొన్న భిన్నమై గాని అభిన్నమై గాని వచ్చును. శేష ధనము పాలుగొన్న అభిన్నమై వచ్చును.

సువర్ణగణితంబునందుఁ గరణసూత్రము—

ఉ. [3]కాంచనవర్ణఘాతయుతి
కాంచనయోగమునన్ భజించినన్
గాంచనయోగవర్ణ మగు
గ్రక్కున శోధితకాంచనంబునన్
బంచినవర్ణమానమునఁ
బ్రాఁతిఁ బుటం బిడి తెచ్చి లెక్క చే
యించిన వన్నెచేత భజియించిన
శోధితకాంచనం బగున్.

ఉద్దే—

గీ. [4]పదియుఁ బదునొకండుఁ బండ్రెండుఁ
నైన వన్నియ లవి యబ్ధినేత్ర [బదమూఁడు
వసధిదిక్ప్రమాణకనకకర్షంబులు
పైచి కరఁగఁ బుయిదవన్నె యెంత?

గీ. ఉక్తకర్షంబు లిరువదియును బదాఱు
గాఁ బుటం బిడ్డ నెంత రొక్కంబు వచ్చుఁ
బుయిద పదియాఱువన్నె గాఁ బుటము వెట్ట
నెన్ని యగు నుక్తకర్షంబు లిరువదియును.

$\frac{౧౦}{౪}$ $\frac{౧౧}{౨}$ $\frac{౧౨}{౪}$ $\frac{౧౩}{౧౦}$ ఇవి కలయఁ గరఁగఁగా నైన వన్నెలు ౧౨ యొత్తు కర్షాలు ౨౦ యివే పుటము పెట్టఁగాను వన్నె ౧౬ అయినప్పటికి కర్షాలు ౧౫.

కరణసూత్రము—

క. [5]స్వర్ణైక్యము యోగోద్ధృత
వర్ణాభ్యస్తమును వర్ణవర్ణహతియు...
...ర్ణకము బుయిదవర్ణను
వర్ణాప్తంబుగను బుయిదవర్ణము వచ్చున్.

---

1. 'వరఘ్నదానోనిత' యిత్యాదిశ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. పుట. 172. సూత్రము 59. 2 'మాణిక్యాష్టక మింద్రనీలశకలం' అను శ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. పుట 178. 3. 'సువర్ణవర్ణాహతి యోగరాశౌ' యిత్యాది శ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. పుట 178. సూత్రము 60. 4. 'విశ్వార్కరుద్ర', 'శే శోధనే యది' యనుశ్లోకముల కాంధ్రీ ... 179. 5. 'స్వర్ణైక్యనిఘ్నా' యిత్యాదిశ్లోకమున కాంధ్రీకరణము.

ఉదా—

గీ. [1]అనవరతవర్ణకర్షంబు లాఱుఁ బదియుఁ
బదునొకండును వన్నె లెన్మిదియు రెండు
పైచి కూడినఁ బండ్రెండువన్నె అయ్యెఁ
బసిఁడి యెంతయు యెఱుఁగంగఁబడనివన్నె.

ఒడ్డు $\frac{౦}{౬}$ $\frac{౧౦}{౫}$ $\frac{౧౧}{౨}$ లబ్ధజాతవర్ణ ప్రమాణము. ౧౫.

కరణసూత్రము—

మత్తకోకిల—

క. [2]స్వర్ణయోగము యోగజస్ఫుట
వర్ణనిఘ్నము హేమత
ద్వర్ణమానవధైకతారసి
తంబ హేమకవర్ణక
స్వర్ణసంయుత వర్ణకాంతర
సంవిభక్తము గాఁగఁ ద
త్స్వర్ణ మేర్పడు నా
సువర్ణముసంఖ్య...దెలుంగఁగాఁ.

ఉదా—

క. [3]దశమనువర్ణము లగు గుణ
శశిఫలములు గొంత షోడశకవర్ణము ద్వా
దశవర్ణ మయ్యెఁ గూడిన
వశ మగునే తెలియ భూప! వర్ణగుణంబుల్.

ఒడ్డు $\frac{౧౦}{౩}$, $\frac{౧౪}{౧}$, $\frac{౧౬}{౦}$ లబ్ధషోడశ వర్ణ హేమఫలము ౧.

కరణసూత్రము—

గీ. [4]అధికవర్ణంబులోన సాధ్యంబు పుచ్చి
సాధ్యవర్ణంబులోన సూత్మంబు పుచ్చి
శేషకము లిప్తమున గుణించినఁ గ్రమమున
స్వర్ణమితు లగు నల్పేరువర్ణములకు.

గీ. [5]పసిఁడిపుయిదలు పదియాఱుఁ బదియువన్నె
యెలమియొయ్యవియొడఁగూర్చి వెలయఁగరఁగి
వహ్ని వీర్యంబు ద్వాదశవర్ణ మయ్యె
వాని హేమప్రమాణముల్ వలయుఁ దెలియ.

ఒడ్డు వన్నెలు ౧౬, ౧౦. సాధ్యవర్ణం ౧౨, స్వర్ణమాన కర్షాలు $\frac{౧౬}{౨}$, $\frac{౧౦}{౪}$, ఒండేని ౧౬, $\frac{౧౦}{౨}$ యిట్లు బహువిధంబుల—

గీ. [6]అమలతామ్రైకలవయుక్త మైనశుద్ధ
తారభాగచతుష్కంబు దశము వాని
వన్నె శూన్యం బదియుఁ గడవన్నియయును
దొల్లి (?) పూర్వోక్తవిధి నచ్చుకట్టవలయు.

క. [7]పదునాలుగు పదుమూఁడును
గదశార్కులు చరమవర్ణసంఖ్యగ మచ్చుల్
పది వన్నెకుఁ గట్టింపం
గదయ్యె మనబొమ్మలాటకొళఁడు మెచ్చఁ.

ఒడ్డు వన్నెలు ౧౪/౦ సాధ్యవర్ణం ౧౦, చరమవర్ణ సువర్ణమానము ౧౦, దశమానము ౪, ఒండేని ౫, ౨, ఒడ్డు వన్నెలు ౧౩/౦, సాధ్యవర్ణము ౧౦; చరమవర్ణ సువర్ణమానము ౧౦, దశమానము ౨
౧
౧
౨

ఒండేని ౨౦/౫ - ఈ ప్రకారాననే కడమ మచ్చులను కట్టించేది.

వ. అనంతరంబ శ్రేఢీవ్యవహారంబునందుం గరణసూత్రము.

1. 'దశేశవర్ణాః' అనుశ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. పుట 181.

2. 'స్వర్ణైకనిఘ్నో యుతిజాతవర్ణః, అను శ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. పుట 182. సూత్రము 162. 3. 'దశేంద్రవర్ణాః' ఇత్యాదిశ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు - పుట 183. 4. 'సాధ్యేన నోనాల్పవర్ణో విధేయః' ఇత్యాది శ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు. పుట 184. సూత్రము 63. 5. 'హాటకగుణకే షోడశ' యిత్యాది శ్లోకమున

*

గీ. [1]అవని హీనపదఘ్నోత్తరాదియోగ
మంత్యధన, మంత్యధనపదసైక్యదళము
మధ్యధనము, పదాభ్యస్తమధ్యధనము
నఖిలధన మగు గణితంబు ననఁగఁ బరఁగు.

ఉదా—

గీ.[2] ప్రథమదినమున నాలుగుపణము లిచ్చి
పంచకోత్తరముగ నిచ్చుఁ బ్రతిదినంబు
నవనిసురునకు నొక్కరుఁ డాతఁ డొక్క
పక్షమున వారి కిచ్చినపణము లెన్ని?

ఒడ్డు ఆది ౪ ఉత్తర ౫ గచ్ఛ ౧౫ ఇందు ఆది ధనము ౪, మధ్యధనము ౩౯, అంత్యధనము ౭౪, సర్వధనము ౫౮౪.

గీ. [3]ఏడు ముఖము గచ్ఛ మెనిమిది యుత్తర
మైదు వీనియందు నంత్య మధ్య
సర్వధనము లెవ్వి సరవిఁ జెప్పుము బొమ్మ
లాట కాళహస్తి యాత్మ మెచ్చ.

ఒడ్డు అ ౭ ఉ ౫ గ ౮. మధ్యధనము ౪౯/౨, సర్వధనము ౧౯౬, ఇట్టిగచ్ఛ సమ దినము గాఁగాను మధ్యధనములేదు గాన మధ్య పూర్వాపరధనములయందుల ధనాల యోగార్థము మధ్యధనము గాఁదగు నని ప్రతీతి పుట్టినది.

అసంపూర్ణము.

* ఇటఁ గొన్ని సూత్రములు మూలములో నున్నవి. ఆంధ్రీకరణమున లేవు. తెలిఁగింపలేదు కాఁబోలును!

1. 'వ్యేకపదఘ్నచయో' రిత్యాది శ్లోకమున కాంధ్రీకరణము. చూడుఁడు - పుట 209. సూత్రము 6.

2. 'ఆద్యే దినే ద్రమ్మచతుష్టయం 'యో' యిత్యాది శ్లోకమున కాంధ్రీకరణము-పుట 212.

3. 'ఆది స్సప్తచయః' అను శ్లోకమున కాంధ్రీకరణము చూడుఁడు - పుట 218.

(5 వ పుట తరువాయి)

యిష్టదైవతము ఆర్యామహాదేవి; నలుగురితో పాటు తనకూ ఈశ్వరుడు దేవుడే; కాని, ఆర్యాదేవంతటి దగ్గరిదైవం కాడు— కొంచెం దూరం. వీళ్లను గురించి సందేహముంది. ఈశ్వరుడు అనుకూలించడానికి తలస్తాడో తలపడో అన్నది—అంత పరిచయం లేదుకాబట్టి. ఆర్యామహాదేవి విషయంలో తలస్తుందో లేదో అన్న సందేహం రుక్మిణికిలేదు; తప్పకుండా తలస్తుంది.

తనకు నమ్మకమే; కాని, ఆమెకు తన్ను రక్షించే ఉపాయం తెలుసునో తెలియదో; ఉన్న సందేహమంతా అదే; ఉపాయం తెలిస్తే తప్పక రక్షిస్తుందన్నమాటే ఇంత వ్యత్యాసముంది కాబట్టే, పోతన్న యీ రెండు సందేహాలను ఈవిధంగా ప్రకటించాడు. విషయ విశ్లేషణ్నింత చక్కగా ప్రదర్శించగల సమర్థులు మన కవులలో ఎందరున్నారు?

ఇన్ని విషయాల నింత రసవంతంగా చిత్రించగలిగినవాడు కాబట్టే, పోతన్న ఆంధ్రజన సామాన్యానికి అభిమాన కవి కాగలిగాడు. భారత రామాయణాలలోని ఒక్క పద్యమయినా నోటికిరానివారు చాలమంది భాగవతములోని కొన్ని పద్యాలు పఠించగలిగినారు[1]

ఇటువంటి పోతనలో కవిత్వ విశిష్టత లేదనీ, ఇతను వ్యాకరణంరాని సహజ పండితుడనీ, అంత్యప్రాసకోసం నిఘంటువులకు ప్రాకులాడేవాడనీ భావించడం కూడనిపని. ఇంకా సందేహముంటే, ఏదయినా ఒక్క ఘట్టం, సంస్కృత భాగవతంతో సరిపోల్చిచూస్తే, పోతన కవిత్వ పటుత్వం కరతలామలకం కాకతప్పదు.

రాజాజీగారు కంబరామాయణాన్ని ఇంగ్లీషులో ప్రచురిస్తున్నారు; అలాగే మనలో ఓపికున్న సమర్థులెవ్వరయినా తెలుగు భాగవతంలోని ఒకటి రెండు ఘట్టాలను ఇంగ్లీషున ప్రచురించడం మంచిది. అట్లయితే, సంస్కృత భాగవతంతో పరిచయమున్న ఇతర రాష్ట్రాల వారుగూడా, మన ఆంధ్రకవి పోతన్నలోని కవిత్వ పటుత్వం గ్రహించి గౌరవిస్తారు.

1. ఇది పాఠకుల భక్తిపరత్వం అనుకోనడం పొరపాటు. "కారేరాజులు, రాజ్యముల్ గలుగవే, గర్వోన్నతిన్ చెందరే, వారేరీ సిరిమూటగట్టుకొని పోవంజాలిరే..." లాంటి పద్యాలూ ఘట్టాలూ ఎన్నో ఆంధ్రులకు కంఠస్థంగా వున్నాయి.